దోమకొండ సంస్థానాధిప

కృష్ణ భూపాలశేఖరాస్థాన కవిపుంగవ

రాపాక లక్ష్మీపతి కవి విరచిత

# భద్రాయురభ్యుదయము



ఇది

శ్రీమంతు రాజా రాజేశ్వరరావు బహద్దరు వర్మ

సంస్థాన్ దోమకొండగారి యాజ్ఞానుసారము

గోలకొండ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ప్రకటింపఁబడియె.

౧౯౩౦



శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము.



## ప్రథమోల్లాసము.





శ్రీవర్ధిష్ణులిదం సమస్తచిదచి • జ్జేగీయమానప్రపం
చావిర్భావతిరో విధానకరుల • న్యోన్యావినాభావవే
షావిష్కారులు పూర్వదంపతులు న • త్యానందులైనట్టియా
శ్రీవర్ధిష్ణులఁ బార్వతీశ్వరుల నే - సేవింతునేతత్కృతిన్ - ౧

శా. శ్రీమద్ద్వాదశ ముఖ్యవర్ణ ముఖమై • శ్రీభూత నానామను
స్వామిత్వాంచితమై పరాపర రహ • స్యస్థేమమై స్వప్రభా
యామామేయ చిదంబరాకృతియునై • హార్దస్తుతింజెందునా
శ్రీమాతన్బరిశుద్ధ మానసమునన్ • సేవింతునే తత్కృతిన్.

శా. శ్రీసంకాశ దనూపమాగుణ సితాం • ఘ్రిన్యాసమేశజ్జగ
ద్భాసాభాస కరంబుగాఁక నిజపుం • భావోపపన్నంబు

వాసింజెందిన వారిజాసనముఖ • వ్యాపారముల్ స్వప్రభా
రాసంయుక్తత నొందుచోఁ దగు మహో • దాజ్ఞిఁ దలంతున్మతిన్. 3

మ. విలసత్తాత్త్విక వింశదక్షరసహా • విర్భూత మన్వంతరో
జ్జ్వలదాత్మ ప్రతిభన్ సభక్తిసముదా • చారంబులో నిల్చువా
రలకిష్టార్థ మొసంగి లోకముల సం • రక్షించుచున్నట్టి శ్రీ
లలితాంబా కళయైన దేవిఁ దలఁతున్ • లక్షించి యేతత్కృతిన్ ౪

శా. ప్రాకాశాఖ్య నిజానవాంతరమునన్ • భాస్వత్ప్రకాశంబుఁడా
లోకించన్ దదుదారభావమును ముక్ • లోఁ గాంచు నానాప్రకా
రాకారంబుల గల్గు లోకములనె • య్యంబొప్పఁ గల్పించి తా
నేకాకారతనొందు నస్ఫురణనే • నేతత్కృతిన్ గొల్చెదన్. ౫

చ. విలసితమైన యామిశ్రహిర • బిందువు ముద్దుమొగంబు గాఁగ నా
జ్జ్వలన సుధాంశుబిందువులు • చక్కనిసిబ్బెపు గబ్బిగుబ్బలై
యలరఁ బరార్ధమైన్న రశనాస్పదమై విలసిల్లుచుండ నా
ర్త్రిలు తదభేదమైన పర • దేవిఁ దలంచెద నీమహత్కృతిన్. ౬

మ. అమితాలంకరణాభిశోభితయు మా • యావాసు దుర్మంత్రచం
క్రమణప్రక్రమ మార్గదుర్గజయవి • ఘ్నప్రాజ్య యంత్రాద్యప
క్రమనిర్వక్ర పరాక్రమ స్థితివిశే • త్త్రప్రాణ హృచ్ఛాపశౌ
ర్యమునన్ మించి సమించితాత్మయగు వా • రాహిన్ మదిన్ దల్చెదన్. ౭

మ. కరమొప్పన్ స్వసుతాళి భేదనియతుల్ • కాలక్రియామానముల్
పరివిస్ఫూర్జిత మూర్ఛనాంతరములు, • త్పాదించి వీణావినో
దరతిన్ సొంపుజనింపు పెంపుగల మా • తంగాంగనల్ బాడను
స్థిరసింహాసన వాసయై దనరు ల • క్ష్మిన్ నెమ్మదిన్ గొల్చెదన్. ౮

శా. కాదంబాళి చకోరికా పికశుక, క్రౌంచాదిపక్షి స్ఫుర
త్కాదంబ ప్రసవ ప్రభూత మధుసం • ఘాతోప్లుతాకారమై
కాదంబర్యాగమ ప్రమోదసనట • త్కాంతా నిశాదార్భటీ
కాదంబస్థితి గల్గు దేవినిఁ బుర • స్కారింతు నేతత్కృతిన్. ౯

శా. ఆదిన్ దివ్య విమర్శరూపిణియునై • యాశ్రీ ప్రకాశాత్మతా
పేరాదంబేర్పడ నీచరాచర జగ • న్మూలంబు తానయ్యు త

ప్రాదుర్భూత పరాద్వైతఖిజుంచే ; భాసిల్లు నానుండహం
తేదంత్రైక్యము నాపరారిశించనే ॰ నేతత్కృతిం గోర్త్వదన్ .

మ. సకలస్థావర జంగమాత్మకజగ ◆ జ్జాలంబు నిర్మించు త
త్ప్రకటీభూతములైన శాస్త్రములనా ◆ శ్వాసించి బ్రహ్మాండక
ల్పకుఁడై నిక్కముగా మనన్ వెలయునా ◆ బ్రహ్మాధీశుండు ది
వ్యకవిత్వాంచితమైన మత్కృతిని ని ◆ త్యానంద మొందించుతన్, ౧౧

మ. సముసూక్ష్మైక దశాసమేత చిదచి ◆ జ్జ్ఞానస్వరూపంబు జెం
దముపో స్థూలదశాసమేత చిదచి ◆ త్కార్యస్వరూపంబునన్
బ్రగుదంబేర్పడ నొక్కఁడై జగమునన్ ◆ శ్వాదించు లక్ష్మీశ్వరుం
డమితస్తోత్ర కృతాస్మదీయకృతినా ◆ హ్లాదంబు నొందించుతన్. ౧౨

శా. శ్రీకాంతా రుచిరత్వమెల్ల మనుప ◆ ద్వీక్షించ నర్హన్వల్చి యు
స్త్రోకంబైన నిమేషమొందునని వి ◆ స్ఫూర్జత్కటా తనూలయ
ప్రాకట్యస్థితి నొందఁజేసి సకల । ప్రాణుల్ప్రపంచించునా
శ్రీకాంతుండగు వేంకటేశ్వరుఁడు ర ◆ క్షించున్మదంచత్కృతిన్. ౧౩

శా. శ్రీవర్ణావయవాత్మసంభవగచి ◆ జ్జీవాఖిలస్వామి సౌ
భావప్రస్ఫుట జానకీరమణి సం ◆ భావింపఁ దత్త్రిక్రియా
ప్రావీణ్యంబు వహించు తారకమును ◆ ప్రావీణ్యముజ్జెందునా
శ్రీవర్ణుండగు రాముఁడీకృతిని ర ◆ క్షించున్జిరస్థాయిగా. ౧౪

మ. వనజాక్షుండు పురందరోపలమునై ◆ వర్తింప దానాజపా
కనదచ్ఛప్రసవంబునైఁ దసరిత ◆ త్కాయంబు లోవెల్గులన్
దనకాంతిన్ బ్రసరింపఁజేయుచును మున్దత్ప్రావినాభాతమై
మనుగన్పట్టిన లక్ష్మిమత్కృతిని స ◆ మ్మోదంబునొందించుతన్. ౧౫

మ. యతులొక్కప్పుడు భక్తిచే నిజసహా ◆ ప్రారంబులన్ శ్రీశ్రియః
పతిబూజింపఁగటగెంత నే సతతము ◆ ష్పద్మాత్ము నంతర్బహి
స్థితునిం జేసి తదాజ్ఞచే ననురమో ◆ షిత్కంఠ కైవల్యసం
యతవృత్తిన్ జరియింతునంచను సహా ◆ ప్రారంబు దక్షిన్ మదిన్. ౧౬

సీ. ధుర్యయోక్త్రాదనో • త్సుకత వచ్చునటంచు । నిమ్నఁడనూర్ధ్వ వేము • ననుసరింప
కార్ముకజ్యాజిష్ణు • కునుజను దెంచునో । యనిశంకఁ గుఁడుశంకఁ • గొనివదింప
దర్పగ్రసనబుద్ధి • దలపోయునో యని । హరి కృపాదరంబున • ననుసరింప
యజ్ఞోపవీతసం • హరణార్థ మేతెంచునో । యని విఘ్నేశు • డూహసేయ

గీ. నిజగరున్మరుదుద్ధూత • నిఖిలభూమి । ధరుఁడు ఫణభృత్త్రయీపతి • త్రిపురహరణుఁ
డైన శ్రీశైవనతేయుండు • నస్మదీయ । కలుషము లడంచుఁగావుతఁ • గరుణతోడ.

మ. మును గృష్ణార్జున పక్షవిస్ఫురణతన్ • మోదంబు గల్పించి సొం
పునఁ గృష్ణార్జునపక్షవిస్ఫురణనీ • భూతప్రపంచంబు నే
ర్పునఁ గన్పట్టఁగఁ జేయుచో నిజపదాం • భోజాశ్రయుల్ గొల్చువా
రిని రక్షించు శివుండు మత్కృతిని సు • శ్రీనొందఁగాఁ జేయుతన్. ౧౮

శా. శ్రీవాణీశము ఖామరాధిపులిదం • సృష్ట్యాదిలో నాత్మలం
దేవానిన్ భజియించి ప్రాద్యఫల సౌ • హిత్యంబు నుంబొందిర
ద్దేవున్ దజ్జయ యంత్రవిఘ్నహరణున్ • దీనావనున్ సిద్ధల
క్ష్మీవిఘ్నేశు నిరంతరాయమునకై • చింతింతు నేతత్కృతిన్. ౧౯

శా. శ్రీరామాయణ భారతాఖ్య రచనా • జేగీయమాన ప్రథా
ధౌరంధర్య సమేత వాస్తవకథా • ధన్యాత్మ వల్మీకభూ
పారాశర్యులఁ గొల్చి ఛందములసం • పాదించి వృత్తప్రశ
స్తారూఢస్థితులెంచు పింగళభుజం • గాధీశ్వరున్ గొల్చెదన్. ౨౦

గీ. కావ్యనాటకసంగ్రహ • కాళిదాస । దండి భవభూతి శంకర • డిండిమాంక
శామకవి చోర మాఘ భా • రవి మయూర । బాణ బిల్హణముఖులను • బ్రస్తుతింతు

ఉ. ప్రాకృత సంస్కృతాంధ్రపర • భాగము లుల్లసిలంగ వైకృత
వ్యాకరణంబు జేసి బుధ • వత్సలతన్ సకలార్థవత్పురా
ణాకలితేతిహాసములు • నన్నివచించిన నన్నయార్యసు
శ్లోకుని దిక్కయజ్వను వ • చోనియతిన్ వినుతింతు మత్కృతిన్. ౨౧

గీ. తెలివిలేక ప్రదోషైక • దృష్టిరూఢి । విఘనన విబాధితావృత్తి • వెలయుచుండ
సంతతారుంతదోక్షులు • సల్పుచుండు । కాకవులు కాకవులుగాక • కలితసుతుల

కం. కృతులుగల • కృతులొనర్చని । కృతులదలంచియు దలంచ • కెంతేనినిరా
కృతులంచు • గృతులొనర్చిన । గృతుల దలంపంగనేల•పృథ్వీస్థలిపై, ౨౪

వ. అని యిష్టదేవతా, గురు, సుకవి, కుకవి, నమస్కరణ, పురస్కరణ తిరస్కర
ణంబు లొనరించి యొక్క పారమేశ్వర సపర్యాచర్య ధుర్యుండగు మహీశ్వ
రు దర్శింప దలంపున నుండునెడ, ౨౫

సీ. నవరత్న మాలికం • భవమహః పుంజంబు
మొండు జ్యోతిశ్చక్ర•మును హసింపఁ
గరుణా రసస్యంది • సరసనేత్రంబులు
సితకరారుణుల శ్రేణి • సేయుచుండ
చారుముక్తాఫలో • దారహారద్యుతుల్
గురుభార్గవులకు సం • కోచ మొసఁగ
సకల మాణిమయ • చ్ఛన్న పీఠప్రభల్
రత్నసా నుచ్ఛవి • రహింనడంప
గీ. సామితనుస్ఫూర్తి భుజగ • జనని ప్రేమ । దెలియఁగఁ బఠాపరప్రక్రి•తిత్వ మొందు
భవ్యసమయస్వరూప ప్ర•భావమహిమ । నలరి యొక దేవదేవుండు•పొలిచె మదిని.

వ. ఇట్లు స్ఫురించిన విశేషఫలంబు నగునని తలంచి• ౨౭

మ. పరవిద్యా నుపమానమానసయనా • ప్రాకాశ నీకాశసుం
దర పాదద్వితయోల్ల సన్నఖముఖాం • తర్బింబి తప్రత్యగాం
తరదృక్తారక నామయోగి గురుపాదద్వంద్వము న్నెమ్మదిన్
స్థిరత నెందఁగఁ జేసి ప్రత్యగయనా • ప్తిన్పొందఁగా నొక్కచో. ౨౮

కం. శ్రీరాజేశ్వర వరకరు • ణారూఢికటాక్షవీక్ష • ణాగతలక్ష్మీ
పూరిత ధనధాన్యాది • శ్రీరామా రెడ్డిపేట • చెలఁగున్ భువిలో. ౨౯

సీ. హరిహరిద్గిరిచర • ద్గురుమరుద్వరసరి
త్పరివహత్కృతకాద్రి • పరిసరములు
శ్లథదళత్పలగళ • న్మధుల లస్మదలగ
ద్దళచలత్పికశుకో • ద్యానములును
నవభవత్సవసము • ద్భవనముత్సవయుతో
పవనాంతరితయజ్ఞ • భవనములును

ఘనకంజ వనసంజ । వనసంజ వనగుంజ
దళిరంజిత సపుంజ • సాంబుఘనులు

గీ. దొరయ మెరసె నిరంతరం సరదనమకు। సుమసుమరసరజోఘుమం ఘుమితగంధ
వాసితాంతర్గృహారామం రామరామ।న్మృదునిపురముఖులశ్రీల • నెగడుచుండె. ౩౦

సీ. దీపితా శారివయే • తిప్రయోగశ్రుతి
జాగదన్స్వరభృతి • సంచయములు
సుఖిత కాన్తాజికా • సుశ్రౌషడితి సదా
వాప దచ్ఛారికా • వారములును
శ్రోత్ర శ్రవణ సౌఖ్యదాత్య్రయ జేత్య
రారట ద్రుచిరపా శావతములు
హితరమేయ జామహా • ఇతిభవ్యభాషి
లాలపద్వారిక • లాపములును

గీ. సరసవౌషడితిప్రభా • పచ్ఛ్వకములు। బరగ జెలువొందె రామభూ• పాలనగరి
మానసీయోల్ల సత్కామి • నేనివంశ।జననరాజన్న భూపాలు • శాసనమున. ౩౦

సీ. సింజాన సుమనః ప్ర • యుంజాన మకరంద
భుంజాన మధుకరీ రంజితంబు
కంజాత కింజల్క • పుంజాత తపరాగ
సంజాత నదపరి • వ్యాంజితంబు
ఖంజరీట విహార • మంజరీ పరివార
పింజరీ కృతభూజ • మంజులంబు
గుంజాధిగమ్యసౌ • మాంజస్య సమ్యజ్ఞ
గుంజాతి రమ్యభూ • మంజిమంబు

గీ. నగుచుఁ దొగరగు జిగిడగి•నిగుడు మొగడ।లగణితములగు పొగడల• తెగలసొగసు
గలవలపుకు మగుమయని• చెలువుఁజూప।బ్రమదవన మొప్పు చుండున•ప్పట్టణమున

సీ. సముదాతిశయపయః • ప్రమదాతతకరాగ
నముదాతతపలాశ • కుముదములును
స్యందమానమరంద • బృందపానమిళింద
నందదాన మహార • విందములును

నానావినీతప్ర • సూనావృతాంతరీ
పానీత హీరసో • పానములును
లోలాను వేలాను • కులానువేలక
ల్లోలాను సరకోక • జాలములును

గీ. దనరనాంతర తలపాతి • తప్రపమాక్తి! కగ్రహణనైగ నిదోయ్యద • కప్రకార
పూరితోదర దీర్ఘికా • వారములరె! రామభూపాలు పేటలో • రమ్యముగను.

కం. అపరాగములై • తనరెన! నపరాగంబులను దోహ • దార్ద్రక్రియచే
నపరాగగముల • జేయుదు! రుపవనమునఁ దత్పురీవ • రోయుక్తసతుల్. 3౫

సీ. పాటీర వాటీర! కోటీర నికటాగ
కందంబులైన మా • కందములును
యుక్తాతి ముక్తాతి • రిక్తాప్రసవకాంతి
పాటలాకృతినొందు • పాటలములు
నీపాను రూపస్వ • రూపద్యుతుల్ గల్గు
కేసరంబులఁ జెందు • కేసరములు
సాలావృతైలాప • మాలోల కిన్నరీ
మోదితులైన • ప్రమోదినులును

గీ॥ మల్లికలలోనఁ దగు దీవ • మల్లికలును
జీవకములై వెలయు బంధు • జీవకములు
కాంచనంబు లనఁగ నొప్పు • కాంచనములు
గలిగి విలసిల్లుఁ దత్పురో • ద్యానవనము. 3౫

సీ. తతదరీ చ్యుతఝరీ • హితకరీ స్తుతతరీ
గతచరీ తతపరీ • వృతధరములు
నతివేల రుతిశీల • గతిలోల రతిపాల
హితఖేల దతినీల • ధృతిమదలలు
సారదుర్వారదో • స్సారవన్మారనా
సీరసంచారయు • క్సారికలును
ప్రకట కోరకఫలా • దికమధూదకభూజ
శుకసముత్సకపిక ప్రకరములును

గీ. తరణికిరణవిహరణ నిగ • రణతరు౹ వరుణ వరణాంతిరిత్వరో • వరనివసద
వక్ర చక్రాంగ చక్రప • వర్ణనము౹ దనర దన్నగ రోద్యాన•వనములరె.

సీ. ఏలావనీజాత - హాలాఘ నీభూత
బాలా నిలాధూత • జాలకంబు
హేలీకృతారాళ • పాళీలతాజాల
కేళీరతోద్వేల • బాలికంబు
నానాలతాస్పంద • సూనాయత మరంద
పానాగ తమిళింద • తానకంబు
సారసోదారకా • సారసోదారసా
సార సంసారయు • క్సారికంబు

గీ॥ లుంగతరుసంగ రింగత్కు•రంగములను౹ బియకసాలలసన్న•ప్రియకములును
కోరకనికుంజ గుంజచ్చ•కోరకములు౹ గలిగెతత్సమాదవనంబు • పొలిచియుండె.

సీ. ధూపముల్ కర్పూర • దీపముల్ మధురసా
పూపముల్ దర్పణ • స్థాపనములు
ఖాద్యముల్ దివ్యనై • వేద్యముల్ విమలాంబు
పాద్యముల్ నిస్వన • ద్వాద్యములును
ఘ్రాగముల్ వీటికా • భోగముల్ దక్షిణా
భాగముల్ గంధనం • యోగములును
ఫలములు మాలూర • దళములు సారసో
త్పలములు శుద్ధతం • డులములలర

గీ. శంఖ కాహాళ ఘంటికా • ఝల్లరులును౹ మోయుము త్యాలమ్రు గ్గులింపుగఘటింప
దివ్యమందిరములమహా•దేవుభక్తి౹ బూజసేయుదురెప్పుడ • ప్పౌరజనులు ను. ౩౮

కం. ఆనకములు విమతజనభ౹ యానకము లు మోయుచాప • డధ్వవిచారా
దానసదానదాకములు౹ మానవపతులలరె శిప్రుని • మంటపములపై. ౩౯

కం. దరములు సతతసుధాసో౹ దరములు షడ్విధివిచార • తాత్పర్యసమా
దరములు సంస్కృతిదరతో౹ దరతోదరములయి మెలగు•దత్పురిలోనన్. ౪౦

కం. నయమానయమానయనో౹ భయములై దత్పురి వసించు • జనతతులు సదా
నయతో దయతోదములై౹ ప్రియమగు శివభక్తి మదిని•పెంపెసలారన్. ౪౧

కం. నవకుసుమానసమానాగో౹ పవనోదర సద్విహంగ • భవరవభరనీ
పవనోదర పవనోదర౹ భవనాదలగుచునుండు • ప్రజలప్పురిలోన్. ౪౨

సీ. మదనాశుగ వికాస • కృతకారత విలాస
సదనా హతావాస • సద సదములును
కేళీ విహిత సంత • కేళీ విహిత నారి
కేళీ విహిత సుప్ర • తోళికలును
నాళీకనిర్యన్మ • ధూళీక చర్య ప్ర
ణాళీకదర్యన్మ • రాళికలును
పాళీ లతాంతరం • ధ్రోళీ నితాంతయు,
క్తాళీ హితాంత ద్రుమ • మాళికలును
గీ. దొరయ మెరసె నిరంతరా రాం • కురిత, తపల్ల
విత, సుమిత ఫలితోద్యాన • వితతులెపుడు
రాజితాడ్మారి సీమాభి • రామ రామ
రఢ్డిసేటను జగులెల్ల • రంజిలంగ. ౪౩

మ. బలవత్స్వర్ణ మయూగ్ర విగ్రహ బహిః • ప్రాకార ముద్యద్రసా
తలజారుంతద ఖన్యమాన పరిఖాం • తర్చింబితంబై తగున్
దలరాదంచు వచింప ఖేదమున నెం • తన్ విన్న నయ్యెంగదా
బలిసాలంబిక దీనిఁ జేస్తు నని • సంభావింపఁగా నోయనన్. ౪౪

పాఠాంతరము.

బలభిద్రత్న ఘృణీసమూవహ బహిః • ప్రాకార ముద్యద్రసా
తలజారుంతద ఖన్యమాన పరిఖాం • తర్చింబితంబౌచు, సొం
పలరెన్, దీనిజలంబున్నడి, మనః • ప్యాద్దృశ్యమైయుండె, నా
బలిసద్మంబట దీనిఁ దేర్తుననిసం • భావింపఁగా నోయనన్, ౪౫

మ. అమలాగాధ పయఃప్రపూర జల స • త్వానేక తీర్థోరుఖే
యము, దోచున్ నిజభక్త పాలనమునం • దాసక్తుఁడై సన్నుతా
గమ రాజేశ్వరుఁడుండినన్ పదభిషే • కస్వస్తి హేత్వర్థమై
యమరాధీశ్వరుఁడంప, సంభ్రమముతో • నందుండు మిన్నేరనన్. ౪౬

మ. సరసాభ్రంకష చందిరోపల చతు • స్తంభంబు లొప్పంగఁద
త్సౌగమాధ్యంబున మధ్యశాల దనరున్ • పుంజీ భవత్పుణ్యమాఁ

గ్గ రతుల్ ధర్మము నాల్గు పాదములచేఁ • గప్పట్టఁ జేయంజతుః
పురుషార్థంబులుగూడి నిత్యైనన సం • పూర్ణేంది రావాసమై. ౪౭

మ. అలరున్ స్వర్ణమయంపు కుటోడలు నురు • వ్యాయూధ వాద్యత్రరో
జ్జ్వల దచ్ఛోదక కూపముల్ దనరుత • స్థానీయ లక్ష్మీ శుభా
చల నారంభమునన్ జనుల్ నిలుపు, మో • చా స్తంభ సంభారము
ధ్యల సత్పూర్ణ సువర్ణ కుంభముల చం • దంబొప్ప నా ప్రోలునన్. ౪౮

మ. వియదుల్లంఘన జాంఘికా జిరతలా • విర్భూత వానస్పతుల్
శ్రియ సంప్రాప్య ఫలప్రసూన కలికా • సంపత్తి బొల్చెన్ శివా
దయితా ర్చా విధికై చెలంగి ఫలపూజా • తప్రేషితంబైనయ
వ్యయ కల్పద్రుమ మన్నగా కృతులచే • నం సుందరానా నప్పురిన్. ౪౯

చ. లలితరసాలసాలకిస • లంబుల నింపగు పచ్చ తోరణం
బులుగల చైత్య వృక్షములు • పొల్చెను, నిర్వేష నర్తనంబుల
న్గలసిన గారుడాశ్మములు • గంటుల నొందిన చేకుకట్టులన్
నలువ సృజించెనో యనగ జ • నంబులు సంతసమంద నప్పురిన్. ౫౦

చ. కలువల తేనిరాలపయి • కప్పుల కుత్తడి కొయ్యంటికంబ పుం
బలితపుమేడల స్వాదిని • భాసిలు, తత్పుర లక్ష్మికింపుగాఁ
బలరిపు, దక్షిణాధిపత, • వారిశ కుబేరకులాంగనామణుల్
కలిత సితాతపత్రములఁ • గౌతుక మొప్పఁగఁ బట్టిరో యనన్. ౫౧

శా. అంతర్న్యాసవ నీలతారకలు బా • హ్యాస్థారుణ గ్రావనే
త్రాంతంబుల్ రుచిరాబ్జ నారద సుప • క్ష్మోఘంబు లింపొందగా
నంతర్ద్వార విలోకనంబుల సుప • ర్వావాస భూలక్ష్మి శు
ద్ధాంత స్త్రీలఁ గనుంగొనన్ నిలుచు చం • దంబేర్పడున్ బ్రోలునన్. ౫౨

మ. పొలుచుం జిత్రపచిత్తి తత్ప్రతిమలా • స్ఫూర్జత్ప్రతీహారని
ర్మలపాండుద్యుతిదీప్త కుడ్యములు నా • రస్త్రీసుగాంధారకా
కలితగ్రామ విపంచికా శ్రవణసౌ • కర్యోదయద్వ్యస్తత్రిక
స్థలయ్యున్ నిల్చిన వేల్పువీటిచెలులో • నాఁదత్పురిన్ నిచ్చలున్. ౫౩

మ. నెలకాలన్ విలసిల్లు స్తంభములపై • నెక్కొన్న రాత్రిందివో
జ్జ్వలదాజ్యాంచిత ఖండదీపకళికా • స్యందోద్యతస్పందవ్యస్నహి
స్థలులన్నిండగమించె, నచ్చటిమహీ • శప్రార్థనాప్తిక్ రసా
తలనిర్యత్ఫణి రాట్ఫణాఘటితర • త్నశ్రేణిలో నాపురిన్. ౫౪

సీ. కురువింద సంచయా • కుంఠిత పటలముల్
కమనీయ రక్తారాం • కవములుగను
పుష్యరాగవ్రజ • స్ఫురితవలీకముల్
శాతోదరాంక రాంకవ • స్రస్తములుగాఁగ
రుచిరగోమేధిక • రచితసోపానముల్
రమణీయ దీర్ఘతుం • డములుగాఁగ
హారిహయోపలవిశా • లాంచిత కుడ్యముల్
రమ్యబంధుకశరీ • రములుగాఁగ

గీ. బద్మరాయుగతో పరి • భాగములును
కళలఁ జెన్నొందు చౌడోలి • కలునుగాఁగ
సౌధములు యూథపస్థితి • చంద మొంది
వెలయుచుండును బురిభూప • తులవహించి. ౫౫

సీ. గమనవేగ సముత్థ • ఘర్ఘరస్వననేమి
చక్రసంధానిత • స్యందనములు
సప్తధా మదభర • స్రావిహసిత చతు
ర్దంత కద్రాంతదం • తావళములు
రింఖావి శృంఖలా • రింఖణా సంఖ్యాక
కంఖాణ పుంఖాను • పుంఖములును
నసమాన చరణాయు • ధాంక శస్త్రాస్త్రవి
ద్యారూఢ ధౌరేయ • వీరభటులు

గీ. నమవ కడు వేడ్క లడరంగ • నెడనెడలను
తడఁబడక వడివడి జను • పుడమిజనుల
నుడులచే ఘుమఘుమితమై • నడరు నిక్క
ధన్యమైనట్టి తద్రాజ • ధాని భువిని. ౫౬

చ. వెలఁదుకలప్పరోపవని • వెన్నెలకుప్పల నొప్పు క్రీడలన్
కలువలతేని రాలయును • కన్ గ్రహియించి వధూపదిష్టభూ
తలమున నుంచి తోల్తటిప • దంబునఁ జేరి తొంగిచూడఁ, గఁ
ల్వలచెలిచే తులంగరఁగ • లజ్జవహింతురు రేలనిచ్చలున్. ౫౭

సీ. పలుదెరంగుల మోవు • లలరిదే చెలియేల
తావులు లేమిచే • తనుదౌరకవు
గోరంటలకుఁ గోర్కె • లూరెను ద్దులగుమ్మ
వేగుజాము నకాని • విరియ వవియు
సజ్జాతు లడుగ, వే • సారెదంబుజముఖీ;
యూమని యొజ్జేగినీ • వడుగరాదు
ప్రొద్దుదిరుగు పల్క • పొసఁగించు వెలఁదుక
తోలికాంచనంబులు • విలువదాని
గీ. కనుచు నర్మవచోజాత • హావభావ
గర్భితము గాఁగ ముచ్చటల్ • గరపి సరస
బరిగి సరసులఁ గరగించి • విరుల వెలల
వెలయుచుఁ డురు పుష్పలా • పికలు పురిని. ౫౮

వ. మఱియును. ౫౯

సీ. వనిత స్త్రైకదండఁ • గొనవచ్చితి నటన్న
కైదండ నొక్కఁడు • పాదుకొనిన
నింపుతోఁ జనుగుత్తు • లెట్టివో జూపవే
చనుగుత్తులును మఱుం • గునవసించు
నీవొత్తుఁ గొనఁటకై • నేవచ్చితి నటన్న
నావొత్తుఁ గొనెనొక్క • యునువుకాదు
పడతిరో: కురువేరు • పరిపినకొప్పమా
కురువేరుపరుపనీ • తరముగాదు
గీ. పరిమళము జెందు మరువమొ • వ్వటికినైన
నమ్మఁగలవా యనంగని • న్నమ్మఁగలను
కలియుకల నర్మగర్భోక్తు • లలర సంజ
విరుల నమ్మను రవ్వైట • వెలది కొలఁది ౬౦

సీ. మణ్యంతరోపోత పణ్యస్థలాగణ్య
పుణ్యగంధంబులఁ • బొరలి పొరలి
నానావిధోపదం • శానీత పాత్రభృ
త్పాన గోష్ఠీశాల • లాని యాని
పుంభావనారంభ • శుంభద్వధూఘూర్మ
లాలితాంభః కేళిఁ • దేలి తేలి
పరిపక్వశాలికా • పాలికా బాలికా
గానానువృత్తులఁ • గదలి కదలి

గీ. సిరతఁ ఘుమఘుమితామోద • భరకువలయఁ
జలజవలయిత పరిసర • సరిదుదరజ
లఘుజలకణవహన గతి • లక్షణముల
దిరుఁగుఁ దెమ్మెరలప్పురీ • వరమునందు. ౬౧

మ. సరసాలాప గతాగతాంబుఘటయు • క్చంద్రాననామానసాం
తరసుప్తాంగ బోధకంబులగు యం • త్రశ్రేణి భాస్వారుపా
పరుహోద్గీతము లైన గేయములు స్వ • ప్నక్ష్మాలి గోపీనిరా
దరపత్త్యానయన క్రమంబునఁ దగుఁ • దద్బాహ్య దేశంబులన్. ౬౨

మ. చతురాస్యుల్ రసనాంచలప్రకటభా • షామూర్తు లభ్యంచిత
శ్రుతుల త్యూర్జిత సత్యలోకమతిద • క్షుల్, సర్వకాలోల్లస
ద్వ్రతులాపద్మ నివాసులై తగినవి • ప్రశ్రేణు లప్పట్టణ
స్థితులై బ్రహ్మను ధిక్కరింతురు మహా • దేవున్ బ్రశంసింపుచున్. ౬౩

సీ. కువలయస్థితికి సం • కుచితభావము సర్వ
పంకజామోద ప్ర • పంచ మొంది
ద్విజరాజ తేజంబు • నిజదీప్తి నడగించి
సద్విహారము దూర • సరణిఁ బెనచి
పగలు రజోవతు • లగు పద్మినులఁ గూడి
యొకవేళ సుతతోసి • యోగ మొంది
సకలలోకములక • సహ్యతాపముఁ జూపి
రాజకాంతోల్లస • ద్రక్తి మాపి

గీ. మెరయు నిసుఁడెంత వాఁడని • కెరలి కేళా
తలఘరబలబలాహక • విలయపవన
జవన శరసిక రావ్యక • చక్రముఖము
లమర సప్వూరి నివసింతు • రవనిపతులు. ౬౪

సీ. ఆపణ వీధికా ప్రథితి • హాటక కూట చిరత్న రత్నాంగ
వాపుచు రాసిబోసికొన • పస్పు బెహారుల కిచ్చి తీవ్రత్రై
దోపినవాని నెల్ల కడఁ • ద్రోచిన తద్బరమాని,రత్నగ
ర్భాభరమాభిదక్ బుడమి • రంజిలెఁ దద్వణి జాళి నిప్పుడున్. ౬౫

గీ. మిన్నొరయు ధాన్యరాసుల మించలేక • జలజ బొంధవుఁ డీవలా, వలజనంగ
దనరె భువినుత్తరాయణ• దక్షిణాయ, నములు, తత్పురిసచూర్ప్ర భ•సమితి వలన.

గు. కలువల తేనిరాల యుప•కారికలన్ నవలాలు కేళికా
కలనమునొంద ముంగిలి • గన్పడు ముత్యము లంచుఁ చోఁజగం
బులఁ గుఱియింప నాటబలె • ముత్తియముల్ గుఱియించు నంబుదం
బుల నెడివార్త లోకములఁ•బుట్టె ముదంబుల నొప్పుసప్పురిన్. ౬౬

గీ. కుంకుమాగరుఘనసారసంకుమదమృగమదగృహములసదయాస్త్ర సహయములను
దొరగుకసవాను చోఁమించి•తోయదములుబహుళవర్ణత్వ మొందును•వ్పట్టణమున

వ. మఱియు నప్పురంబున రమ్యసౌధ ప్రకీవిధి విధిమ త్త్రఘత మేధావ్యధావితో
దీర్ణ వర్ణనిర్ణయ వర్ణిత క్రమాంత స్వాధ్యాయ మధ్యాస మేదుర మరధిగ మ సిగముశి
రః ప్రముఖ మర్మపార గాసంఖ్య సంఖ్యావన్నుఖ్య ముఖర ముఖరీతి భువనంబు
లగు విప్రభవనంబులు,నిరంతర భ్యస్త శస్త్ర సమస్త శస్త్ర శాస్త్ర విశారదోద్యద్య
ద్గర్వాఖర్వ శౌర్యర విద్యా ప్రదర ప్రదర సంధానాద్య వధానాభ్యాసమాన
సంధానోల్లంఘన తత్వరస సమర్థాభ్యామర్ద క్షమాంతల సర్వవిపక్షనిర్దయమ
ర్దన క్షమాక్షీణ బలపద్భద్ర సిర్నిద్ర తేజోవిజిత దినరాజ లోకంబులగు రా
జలోకంబులును,సతతా గారాతి శైపతి ప్రభృతి దిక్పత విచిత్ర ప్రచురతరచి
రత్నరత్న ధనధాన్యాది ప్రచయ క్రయావిక్రయ నిపుణపరకృత వంచనాసంధాన
గంధానభిజ్ఞజాతనయాయన పోషితార్య జనంబులగు నార్యజనంబులును, స
మంచిత వర్ణనిర్ణయాశ్రమ మర్యాదాభిజ్ఞ ప్రజ్ఞాప్రాజ్ఞ ప్రభుసంతతి దురంత

శాసనధర్మ నియమనితాంత శాంతాంతఃకరణమానఘనులగు శూద్రఘను
లును. సోపకారాగవారముఖ్య ప్రఖ్యాతాభినయాభావసూచన చణరణన్మంజు
మంజీర చరణతల నూత్నరత్న క్రేంకారనాదమేదురకంకణ కరవిన్యాసాభిన
యప్రదీప్త స్వర్గప్రపంచ విపంచికా వికస్వరవినోదవిశదమానసమానసభవవా
హనాకాంతవిటఘటంభావసంభావనారంభసుభగంభావుకలగు రూపజీవికలును
దురారోహానోకహనివహమనోరమ మహోత్సవద్యోతితోద్యాన వననవో
న్మీలనవల్లీలతీమాధవీ విచికిలవకుల ముకుళకలాపకూల నిష్యందమాన మ
రందబిందు సందోహానంద దిందిరానవరతరుత సంతానతానహేతుభూతా
భ్యాస ప్రదేశా విరళసంజాతపచేళిమ నారికేళతృణరాజాది సాలరాజరాజిశా
ఖాసమాలింగిత తైలాడోలాలాలితోత్సుకశుకపిక నికరగాన మాధురీసాతిరే
కాస్వాదన సద్యోమాద్యత్సంగ భృంగ సహస్రాంగార రసాలాల సనారసర
ఘాంగ క్రీడత్సారంగ ముఖసుఖారావ పూరిత దిగంతరాళ వర్ధమానో
త్సాహ సంకర్షణార్థసార్థ త్రికోటితీర్థస్నాన ఫలేప్సిత మహిత సమజ్జనో
న్మజ్జనసమజ్జనాన వరతాసంక్రప్రవాహలోల లోలానునేలవేలాభిముఖోల్ల
సత్కల్లోల జాలకోలాహలనినాదమేదుర నదీతటాకదీర్ఘికా ప్రదేశంబులును,
హీరపంజరసంజనిత విహారశారికా కీరకలకలనాదివివిధ పక్షికోలాహలాదిక
రవిష్వగ్వ్యాకీర్ణోదీర్ణ సువర్ణదుర్వర్ణ ముఖభవ్య ద్రవ్యసన్నవ్యనవ్యవైభవ ని
పుణ విపణికాశ్రేతస్తత స్థాపితాంశుమత్సలాంగుగళ ప్రదసపూరామసర
శశిరసరకాంత ఘట్టితతలానుకూల నీలనాళి ప్రవాళీకాంతి సంక్రాంత ఛాయా
యాత్రివేణీ సందర్శన కుతూహల బృందారక సుందరీనేత్రాంతోత్పలతోర
ణంబులగు తోరణంబులును, సంతతినాయక పరిరక్షిత దుర్గమదుర్గప్రాకా
ర గోపురాట్టాలక పృథురథగజవాజి శస్త్రశాలాది రాజద్రాజ మార్గంబులు
గలిగి చెలువొందుసందు

కం. ఆపురమున రాజన్యమ । హీపాలాగ్రగణియు నిజబలలేతధ్వజినీ
ధూపాయితపాపాయిత । భూపాయుతుండగుచు సిరులం బొలుపొందెదగన్. ౨౦

సీ. ఒకచోట గురుమత • ప్రోక్త ప్రసంగంబు
లొకపక్క తర్కశా • స్త్రోదితంబు
లొకచక్కి సూత్రభా • ష్యార్థానులాపంబు
లొకమస్కి రతిరహ • స్యోక్తియుక్తు
లొకపట్టునను నాట • కోరుచాతుర్యంబు

లోకశంకి వ్యాకర • ణాకధనంబు
లోకప్రకేవ నుపనిష • త్ప్రకట సల్లాపంబు
లోకయున్ సంగీత • సుకవి ఫణితులు
గీ. లోకనాదికగాన సాగర • సోర్థసౌఖ్య
కరణ సమ్యగనుత్తర • గ్రంథగోష్ఠు
లలరు గొలువునం జెన్నొంది • యఖిలశాస్త్రి
సరసుండై పొల్చె రాజన్న • జనవిభుండు.

వ. అతండొక్కనాడు హితపురోహితామాత్య సామంతసేనాధిప దండనాయకో ప ప్రధాన రాయబార సంధివిగ్రహ విచారచార దౌవారిక గణక పౌరాణిక జ్యోతిషిక, కవీశ్వర, తార్కిక, శాబ్దిక, నయశాస్త్రి మంత్రశాస్త్ర ధర్మశాస్త్రి భరతశాస్త్ర శకునశాస్త్ర సాముద్రికశాస్త్రి శిల్పశాస్త్రిజ్ఞులును, దానాధికారి భాండాగారాధికారి గోష్ఠాధికారి వస్త్రాధికారి శస్త్రాధికారులు గస్తూరి ముఖపరిమళ కరండాధికారులును, ఫణిహార లాంఛన విదేశగ విదూషకులును, అంగరక్షక రావధానకారులును, దాస దాసీజనాందోళికా ధ్వజాల వట్టఛత్రచామర వ్యజన తాంబూల పేటికా పాదుకా మాలికాదిధారులును, వాద్య వాదక గాయక నర్తకీ నర్తక మార్దంగిక పాణవిక, వైణవిక, వైతాళిక చాక్రిక ఘంటిక శాంఖిక శాక్తిక నైస్త్రింశిక యాష్టిక పారశ్వధిక కౌంతిక ప్రాసిక వైజయంతిక వైవధికాదులు చెన్నొంద సింహాసంహానన సింహాసనాసీనుండయియుండి పేరోలగంబున.

మ. ననుశబ్దార్థపరిష్క్రియా కలితవా • గ్జెన్మపుణ్యా గణ్యప్రదా
జనితానంద కవిత్వ తత్త్వరచనా • సౌజన్యజన్యాత్మ వై
గనవద్దేశిక పాదుకానియమ చి • త్తప్రస్ఫురన్మార్గ ఖే
లను నైదిఘంటిక యుక్తి యుక్తమతి బి • ల్వన్బంచి పల్కెన్ దయన్. 23

సీ. అద్వితీయవ్యాపరో • క్షానుభూతి ప్రసి
ద్ధాచార్య విజయమహాం • ప్రాంచితముగ
ఘనజగజ్జన్మాది • కారణ శ్రీమదు
పాఖ్యానము దెనుంగు • నైదలిర్చ
లలిత పదార్థాద్య • లంకార సహితనీ
శాలివాహము నమ • ల్లాసనుండర

గృతులు మెచ్చంగ శ్రీ • కృష్ణవిలాసంబు
జనమనోహరముగా • మనురచించి

సీ. మించియున్నట్టి నిన్ను వ • ర్ణించ నరమె
ప్రబల రాచాకవంశ సం • భవనవీన
జవన కవన ప్రభవనభా • షావిశేష
లక్ష్మణప్రతి భాధుర్య • లక్ష్మణార్య. ౭౫

గీ. నీవు శబ్దార్థ చిత్రసన్నిహితమైన • కవన మొనరించు ప్రోడవు • గాన కొక్క-
డైవికావ్యక్త సూక్తసం • ధానమహిమ • గలిగిన ప్రబంధము రచింపు • కౌశలమున

వ. అది యెట్టిదనిన.

క. అనమానము,భయభాషా రసమానము • వృత్తిరీతి • రసశయ్యాప
ల్లసమానము చిచ్చైత్య్ర • స్వసమానముగా రచింప • జర్పింపదగున్. ౭౬

వ. మఱియు గుణదోష విభావజ్ఞుండగు వివేకియు, ననుప్రాస సమాబద్ధపదబంధు రుండగు వాచకుండును ప్రసాద మధురాయత్త వచనుండగు రాచికుండును, అర్థసంగ్రహ చాతుర్య ధురంధరుండగు ఆర్థికుండును, యమకాన్విత క విత్వపటుండగు శిల్పకుండును సాలంకార తత్పరుండగు భూషణార్థియు రసతత్పరుండగు మార్గవికుండును, దన్నియంబు లిట్టి రీతులు త్రివి ధంబులు వైదర్భిగౌడి పాంచాలి యనందనరు బంధపారుష్య రహితంబు, శబ్దకాఠిన్య వర్జితంబు నాతిదీర్ఘ సమాసంబునగు వైదర్భియు సమాసభూయ స్త్వంబైన యోజస్థితియు, నద్భుటబంధతా విశేషంబుగల కాంతియు, దనర గౌడీరీతి యనందగు వైదర్భి గౌడీరీతి మిశ్రితంబై పాంచాలిరీతి యనంద గు శబ్దార్థంబులు మూర్తి వ్యంగ్యవైభవంబు జీవితంబు అలంకారంబులు హారంబులు శ్లేషాదిగుణంబులు రీతులు స్వభావంబులు కైశిక్యాదివృత్తులు వృత్తులుపదానుగుణ్యావిశ్రాంతిగలశయ్యలుశయ్యలు.రసాస్వాద ప్రభేదంబులగు పాకంబులు పాకంబులు కావ్యసామగ్రికి నుండవలయు వాచకలక్షక వ్యంజక త్వంబున త్రివిధంబు శబ్దజాతంబు వాచ్యలక్ష్యవ్యంగ్యత్వంబున నర్థజాతంబు త్రివిధంబు తాత్పర్యార్థము వ్యంగ్యార్థగతంబైయుండు అభిధాలక్షణ వ్యంజ నాఖ్యలు శబ్దవృత్తులు త్రివిధంబులు సంబంధానుపపత్తి మూలంబగుటచేసి గౌణవృత్తి లక్షణాభేదంబైయుండు గావున నొక్క ప్రబంధంబు రచించి శ్రీ

సీ. వెలయు నారాయణ్లై • వేదగుం సర్వంబ
నుచుఁ బల్కు కిన్నరీ • నిచయములును
హితము మీరంగ, త • మీశ్వరాణాంపర
మం మహేశ్వరమను • సామగానము
తెలివిమీరంగ, తం, దేవతానాంపర
మం చ దైవతమను • పంచకోలము
నలువొంద, నారాయ • ణం మహాజ్ఞేయంబ
ని పఠించు ఖంజరీ • టపతగములు
గీ. సవ్యయః పురుషస్సాక్షి • యను శుభంగ
తతులు జెన్నొందు దత్పవి • ధ్రపదములు
నిష్కళంక నిరంజన • నిర్వికల్ప
నిర్గుణబ్రహ్మ మచటరా • ణించుకతన ౮౬

గీ. అదియు నిశ్శ్రేయసామృత • మదియు నిత్య
వాస్తవస్థానమదియు ని • ర్వాణపదము
దూరవర్జిత సుఖదుఃఖ • కారణమునఁ
దనరుఁ దత్పద మెన్నంగఁ • దరము నగునె. ౮౭

వ. ఆచ్చోట. ౮౮

గీ. వేదిసద్వేదికావిప్ర • ధీరవార! పర్యమా నస్మృతిశ్రుతి • ప్రకటితేతి
హానఘుమఘుమితారావ • భాసమాన భర్మహర్మ్యంబులో రామభద్రుఁడలరు.

వ. అద్వైవుండు స్వాభిమత స్వసంకల్పానుకూల్య పరమపద స్థానీయభోక్తృభోగ్య భోగోపకరణ భోగస్థాన స్వరూపుండును నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణైక తానస్వేతర సమస్తవస్తు విలక్షణానంత జ్ఞానానందైకస్వరూప స్వాభావికానవధికాతిశయజ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజోవిరాజమాన దివ్యమంగళ విగ్రహ చింత్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయ సౌందర్యౌజ్జ్వల్య సౌగంధ్య సౌశీల్య వాత్సల్య యౌవనాద్యసంఖ్యానంత కల్యాణగుణపరిపూర్ణుండును నిఖిల జగదుదయ విభవలయలీలాపరబ్రహ్మ పురుషోత్తమ నారాయణాది శబ్దవాచ్యుండును, బ్రహ్మాది దేవర్షిమనుష్యధ్యానారాధనాది గోచరుండును, తత్తద్భేద స్వరూపావస్థితుండును, శ్లో. ఉపాస్యోపాసకత్వేన గురుశిష్యక్రమేణ చ స్వామి భృత్యాది రూపేణ క్రీడతే స్వేచ్ఛయేశ్వరః" అన్న న్యాయంబు

సమ్మోహాత్మండు రవికరనికరవికసిత ప్రభామండల మండిత పుండరీక దళస్వాయదాయతేక్షణుండును, భ్రూలలాటసునాసాపుటసుస్మితాధర సురుచిరమణిముకుర సుకపోలయుగళుండును కంబుగ్రీవుండును, దనుతర మధ్యభాగుండును విశాల వక్షస్థలుండును, సముచిభక్త సర్వాంగ నిర్దేశ్యస్వరూప సింహాసంహాసనుండును, స్నిగ్ధవర్ణుండును, శోణసారస సుకుమార చరణయుగళుండును, నీలనీరదాంతర నటత్ప్రస్ఫురత్త కార్త, స్వర ప్రభాధగద్ధగిత పీతకౌశేయాంబరధరుండును సకలభువనోదయ హేతుభూత పితామహ విహారణంబుగల నాభికమలకుహరుండును జ్వలద్విశాలోరస్థలనూత్నరత్న వేదికా సమారోహణ కౌతుకితమత్సందదిందిరాసుందరీసుందర పురందరోపల కలితసోపాన విరాజితంబగు రోమరాజియు, విరాజమాన వైజయంతీ వనమాలికా కౌస్తుభ మణిఘృణిఘృణిలాగణితమణి సమంచితకాంచన కవాట తుల్యంబగు వక్షస్థలంబును, చతుర్విధపురుషార్థ ప్రదంబులగు చతుర్భుజంబులు వర్ణనీయ సువర్ణ దివ్యరత్న సమూదీర్ణకర్ణయుగళభాసమాన సుందరమకరకుండలమండితంబులగు గండస్థలంబులును,మణిమయ భ్రాజమాన కిరీటంబుగల మస్తకంబును, గలిగి యనాలోచిత శేషాశేషలోక శరణ్యుండును, శంఖచక్ర గదాశార్ఙ్గనందక శ్రీవత్సపద్మవనమాలాలంకృతుండును, అనవధికాతిశయ సౌందర్యాహృతవిశ్వనుహోదృష్టివృత్తి లావణ్యామృతపూరపూరితాశేషచరాచర భూతజాతాత్యద్భుతాచింత్యనిత్య యౌవనుండును, ప్రస్ఫురనవిసరసరదగణ్యపుణ్య గంధవాసితానంత దిగంతరాళ త్రైలోక్యాక్రమణ ప్రవృత్తగంభీరకరుణాకటాక్ష వీక్షితాపరిమితాశ్రితసమూహుండును సజాతీయవిజాతీయ స్వగతభేదస్వరూపుండును,తత్త్వలక్షణుండునగు శ్రీమన్నారాయణుని సంపూర్ణాంశంబువహించిన శ్రీసీతారాముల సేవించితిది యుదివ్యశ్రీపాదతులసీతీర్థ దివ్యమంగళవిగ్రహ శ్రీపాదాంకితశిరోగోపదివ్యనామ సంకీర్తనకల్యాణగుణ ప్రఘాణ పానసంతర్పిత శిరోవహాంఛా కర్ణనభాగ్యనైకాయన భాగధేయుండనై. ౯౦

కం. శతముఖముఖులను దినమును। గతకల్మషులైరినిన్ను • గనుగొనిశరపాతితవాలీ హితకేలీ। శ్రితపాళీకల్పధామ • సీతారామా ౯౧

కం. నావంటి యాచకౌఘము। నీవంటివదాన్యవరుల • నేనమ్మదగునీవాపర భావాచ। జీవాదరణాభిరామ • సీతారామా. ౯౨

కం. శతశతములుజేసిన ని • న్నతిభక్తినిం దలపవలయు •ననుదినమును మాహాత్మ్యారిహితకారీ। సితవారిజనేత్రధామ • సీతారామా. ౯౩

న. అని బహువిధంబున శ్రీరామచంద్రుని వినుతించి శ్రీమద్రాజన్న భూపాలమౌళి లక్ష్మీవిలాసనివాస మహాలక్ష్మిని సేవింపదలంచి తన్మహారాజాజ్ఞ గొని చని.

చూర్ణిక. శ్రీమత్కలశ జలనిధి విలసదంతరనిరంతర సురవిటపివిటపవలయిత బహుధి ద్రుమపల్లవిపుల విపులాతల ద్వీపనీపోపవనభవన కాంతచింతామణి ఘృణిధగద్ధగి తమృగరాజపీఠ రాజమానాసనసమాసీనాం హృద్యాన పద్య గద్య పద్య వైశారద్యో ద్యద్విద్యాధరీలోచనచకోరానందకర సాంద్రచంద్రాతపవద్దరహాసాభిరామాం నితాంతలతాంతబాణ బాణశాణాయమానాసమాన మణిగణ ప్రభామండల పిచండిలకుండల కమనిశిత సాయకపీత్యాకదంబాం, సౌరవరవర్ణినీవర్ణనీయసువ ర్ణవర్ణ తటిల్లతాతట ఘటితాకలంక కుంకుమ సంకలిత సుఖసంపాదనవళుసు భో ల్లసంతీం తరుణతరణికిరణ జాంబునదాంబుజహారి తాళవినీలనిరపాంతర నటిత టిత్ఫుల్లహల్లకజపాకర్ణికార కోరక ప్రకారతను ప్రభా భాసమానాం, కామా లికాబద్ధ సకలస్నిగ్ధ కేశపాశ విభ్రాజమానాం పమానాధిక నూతన కేతకీజాత చంపకాశోక పున్నాగమల్లీ బంధురబంధూక స్తబక కుచ కుంభగుంభిత గంధసార ఘనసార మృగమదసంకుమద మసృణఘుసృణ ముఖామోదవిరాజమానాం, నవరత్నగిలితాంచిత కాంచనకిరీట తారహార కేయూరచ్ఛన్నధీర ఝుణఝు ణాయమానకంకణాంగుళీయక ఘంటికోడ్డాణ కాంచీదామ శింజాన మంజీ రాద్యలంకారవిద్యోతమానాం నిరంతర సుమకదంబక దంబవర సంచరన్ముద్రిణీ ప్రదాపితోర్ధ్వకీలకుండల మండితప్రభాకర పాత్రశోభిత సుధాకర కిరణ పరా మృత్తోపహారప్రియాం, శ్రీరామేశ్వరాంక పర్యంకనివాసినీం, సువాసినీ పూజావి ధానావధాన రామల్లగోత్రపాత్ర కామిరేప రాజభూమీశ్వరేశ్వర లక్ష్మీవి లాస మాణిక్యసింహాసన స్థిరమహాలక్ష్మీం సదా కలయామి.

న. అని వినుతించి బ్రహ్మోత్తర ఖండంబునంగల భద్రాయురభ్యుదయంబు దెనింగించి శ్రీరామేశ్వరునకు నర్పితంబు జేయువలయునని యాజ్ఞయొసంగు కామినేని రాజన్న నృపాలు వంశావతారం బభివర్ణించెద.

సీ. సతతఘూర్ణంఘుళ • స్వనదచ్ఛజీవన
కమనీయ నదనదీ • వ్రజంబు
వికచాంబుజోత్పల • ప్రకరప్రసవస్మరం
దాసార కాసార • భాసురంబు

రాయ వేశ్యా భుజంగాఖ్య • రామ బిరుద
సహితుండై కామినేడు ప్ర • శస్తుఁడయ్యె. ౧౦౪

క. ఆకామినేడు నిజ నా • మైకాంక్షను గాఁగ కులము • నలరించిన యా
శ్రీకామినేనివంశం • బాకల్పస్థాయి గాఁగ • నవనిఁ బరఁగెన్. ౧౦౫

వ. తదీయ పుత్రపౌత్ర సంతాన పరంపరానుక్రమంబున. ౧౦౬

గీ. అవనిఁ దత్కామినేన్యన్వ • యంబునకల
గోత్రపరమైన రామన్న • గోత్రమునను
దనరుచుండంగ దత్కుల • మునను కాచి
రెడ్డిభూపతి జనియించెఁ • బ్రథితుఁడగుచు.

క. ఆకాచిరెడ్డికిని సు। శ్లోకుండు రెడ్డియను నాత్మ • జుండుదయించెన్
భూకాంతా సంఘటిత సు। హాకౌతుక హస్తకమలుఁడై జగమెన్నన్. ౧౦౭

సీ. ఆరెడ్డి నృపతికి • నార్యరత్నమైన దే
చాంబికయందు వి • ఖ్యాతులైన
సదయ కాచారెడ్డి • సరసమల్లారెడ్డి
భూరి బలోపేత • బొమ్మిరెడ్డి
నాదగు సుతుల నా • నందంబు నన్గాంచె
నందుఁ గాచారెడ్డి • యనునృపుఁడు
కులకాంతయైమూర్తి • కలితయా మాచాంబ
యందునెల్లారెడ్డి • యనెడుపుత్రుఁ

గీ. గనియె నాయెల్ల రెడ్డీంద్రుఁ • డనుపమాన
రూపలావణ్య విక్రమ • రూఢిఁ జెంది
ఘనగుణసాధ్వి మల్లమాం • బను వరించి
యిష్టవర్తనమున రాజ్య • మేలుచుండె. ౧౦౮

కం. అతిముదమున నెల్లనుపా। పతిమల్లాంబికను గూడి • బలవత్కన్యా
క్షితినాథుఁ గాచవిభుని। రతిరెడ్డియు ననుతనూజ • వర్యులఁ గనియెన్. ౧౦౯

వ. అందుం ౧౧౦

కం. గాచారెడ్డినృపతిస। త్యాచారనిదానదాన • హారివశ్యసుతుం
డైచతురహృదయలోకా। సేచనకతనూకళా వి• శేషుండగుచున్. ౧౧౧

గీ. సకలసాధ్వీమతల్లియై • సంభ్రమించి। యొప్పుడొప్పులకుప్పయై మెప్పువచ్చు
తిప్పమాంబను పెండ్లాడి • ధీరుడైన। సుతులఁగాంచెను నల్వుర • నతులమతుల.

కం. ధీరుఁడు జంగమరెడ్డియు। దారుండగు గామిరెడ్డి • ధన్యుండగు నె
ల్లారెడ్డి శాస్త్రఖనిమల్లారెడ్డి యనంగఁదగిరి • లకు జనులెన్నన్, ౧౧౩

వ. అందు.

కం. శ్రీకరజంగమనరపతి। కా కామారెడ్డి కనుజుఁడై సంతతసు
శ్లోకుండెల్లారెడ్డిమ। హీకాంతుఁడు వృద్ధినొందె • హితవర్తనుఁడై.

సీ. అపరవర్ణులెకాని • అపరవర్ణులు కారు
సరివాగ్రగణ్యప్రాప్తి • సంభృతులను
నలతమోనుదులెకా • నలతమోనుదులెగా
రెనశుచితాకాంతి • ఘనరుచులను
గోత్రాధిపులెకాని • గోత్రాధిపులు కారు
తరము ధర్మఖ్యాతి • ధైర్యములను
హరినామకులెకాని • హరినామకులుగారు
బలసత్త్వపాలన • ప్రాభవముల

గీ. వరహరి హరాగ్ని చంద్రభా • స్కరవృషగురు
శైలమారుతసమవర్తి • శక్రముఖుల
సాటిగోగుచు నెల్లర • సావిభుండు
ధరణిఁ బాలించెఁ ధార్మిక • త్వంబు మెరయ. ౧౧౪

సీ. మొదలు ధాతృత్వంబు • తుదియాచకత్వంబు
నిచ్చతోనుండు ... • డెంతవేల్పు

హర్షించి యొకవేళ • యప్పులిచ్చుటకాని
యెప్పుడీ కున్నవాఁ • డెంతవాఁడు
అహరహమ్ము యాచకులకు • యంచివిచ్చియప్పల
నీఁ లేకున్నవాఁ • డెంతదాత
యడిగినంతనె యర్థ • మిడక వెన్నేనియుఁ గమ
నొప్పింపఁజేయుడైవ • మ్ముక్రమము

గీ. ఇచ్చి మఱలంగ గొనక తా • నిచ్చవచ్చి
నట్టులొసగుచు రేబగ • లనక బంచి
పెట్టుచును ముఖ్యవస్తువు • పెక్కొసంగు
నెల్లరెడ్డి మహీపతి • నెన్నదరమె. ౧౧౬

సీ. సప్తసంతానప్ర • శస్త కామారెడ్డి
దేశాయి దివ్యాజ్ఞ • దేజరిల్ల
నమ్మహామహుఁడు ని • త్యముగాచరించిన
ధర్మంబు నభివృద్ధి • దనరఁజేసి
రాజకార్యాకార్య • రచనలాలోచించి
యుక్తియుక్తములుగ • నొప్పఁజేసి
బహుళ రత్నాకర • ప్రస్ఫీతదీర్ఘికా
కుల్యాదికిఁ దదాను • కూల్యమొంది

గీ. యమ్మహీపతి కిష్టుండై • యనుదినంబు
నన్నలందును నమ్ముల • యందుఁ బ్రేమ
గలిగి విలసిల్లె నెల్లభూ • కాంతుఁ డవని
భారమాత్మీయ భుజమునఁ • బ్రబలుచుండ. ౧౧౭

క౦. శ్రీరమణీరమణీమణి రుచిరాదర్శమనఁగ నిపుణశ్రీయె
ల్లారెడ్డిపేట దనరె మహీరామాస్యాబ్జ తిలకమై తత్త్వమై. ౧౧౮

వ. అది యెట్టిదనిన, ౧౧౯

సీ. ధ్వజపటాగ్రజనీత • స్వచ్ఛతద్యోధుని
సాంద్ర శీకరపూత • సౌధతతులు

గీ. లద్భుత రస ప్రకటిత కాం • తాభిరామ
భామ లోకాభి రాముల్తై • పొలచిన వన
భూచరత్సు మనోవృద్ధి • బూనికేళి
పర్వతేంద్రములు వెలసి • రప్పట్టణమున. ౧౨౪

శా. గంగా భంగతరంగ సంగత విహం • గ వ్యూహ భీకృన్మహో
త్తుంగ ప్రాంగణ గోపురో పసదా • స్తోక ప్రభాభీల మా
తంగాది వ్యవహార సారబల సం • ధాన ధ్వజోపేతమై
శృంగారా స్పదమయ్యె నెల్ల నృపతి • శ్రీమత్పురం బెప్పుడున్. ౧౨౫

మ. సరసీజాప్తుడో కానొకప్పుడు తదైశ్వర్యాది దృష్టార్థత
త్పరుడై నిల్చిన సాలజాల శిఖరస్థప్రోజ్వల న్నూత్న ర
త్న రుచి వ్యూహము వక్ర చక్రగతి నొందన్నాట నుండివ్వ సుం
ధరలోనంబరివేష భూషిత పదస్థానుండ నంగన్బడెన్. ౧౨౬

చ. అహరహ మస్సరీవసనమంచితకాంచన కూటకోటి సం
గ్రహణ విలాస వాసములఖండ విభా విభవంబు దోపనా
గ్రహముల ధిక్కరించిన చిరంతన కాంతమణీ గణాంత్ర రా
వహగతిఁ జూచు వారికి దివస్స్పృహ జేయుచు నుండు నెల్లెడన్. ౧౨౭

క. సద్మహిత స్వర్ణమణీసదన్మండగు నెల్ల నృపతిసదనమాఖ్యఁదగన్
పద్మాకర పద్మాకరపద్మాకరముల నొనర్చెఁబ్రజలు నుతింపన్. ౧౨౮

సీ. ఒక విప్రు చుళుకంబునకు లోనుగాకున్న
లవణ సముద్రంబు • సవతి యగును
కేవల ఖండవికృతిఁజెందకుండెనా
యైక్షవాంబు ధిసమంబగు దలంపఁ
బానంబుచేఁ దంద్రఁబట్టింపకుండెనా
మదిరా సరిత్పతి మార్దియగును
ముక్కవాసన లేకచొక్కమై యుండెనా
యాజ్యాంబు నిధి జతయగు వచింపఁ

మహిత పోతారెడ్డి విహిత కంతారెడ్డి
తనయుఁ డెల్లారెడ్డి యన వెలిఁగి
రందులో నగ్రజుం డైన పోతారెడ్డి
నిగ్రహానుగ్రహ నియత శాలి
శ్రీ భాగ్యనగర రాజ్యాధిప స్థిరతర
ప్రభువర్య వర్ణిత ప్రాభవుండు

గీ. నలభగీరథ నృగు సగరులను దెగడి
పదము పదఁతికి సౌఖ్యంబు పొసఁగఁ జేసి
రాజరాజ మహారాజ రాజ బిరుద
సహిత పోత మహీనేత చంద్రుఁ డలరె. ౧౩౫

సీ. శాత్రవాకీర్ణమై సలిల పూర్ణంబైన
జల దుర్గమున స్వ శాసనము నిలిపి
దురవగాహంబరుఁ దుద పథంబగుచున్న
వన దుర్గముల నిజాజ్ఞను విధించి
పరి భయంకర జల ప్రపూర్ణ ఖాతయు
స్థల దుర్గముల జయ స్తంభ మూఁచి
దుర్ధర గర్వ సర్వారాతి విద్విష
చ్ఛైల దుర్గములు వశ్యములు చేసి

గీ. యనుపమైశ్వర్య ధుర్యుండు ననుపమాన
శౌర్య ధుర్యుండు వీర్య గాంభీర్యుఁడగుచు
పోతిరెడ్డీంద్రుఁ డాశ్రితాంభోధి చంద్రుఁ
డవనిఁ బాలించె బూర్వ రాజానుమతిని. ౧౩౬

శా. ఏ రాజైనను రెడ్డి నామమున నీ పృథ్విఁ బ్రవర్తించునే
యే రెడ్డైనను రాజ శబ్దమున బంహిష్ఠ స్థితిం జెందునే
ధారావాహిక బుద్ధిచేఁ దనరు పోతారెడ్డి దేశాయి ము
న్మీరెన్ రాజన రెడ్డినాథుఁడన మన్నీల ద్యశో లక్ష్మిచే. ౧౩౭

క. ఆసేతు తుషారాచల వాసరమణి శైల శాలి పశ్చిమ ధరమ
ధ్యాసీన ధర్మ విజయ శాసనుఁడై పోతిరెడ్డి జన విభుఁ డలరె. ౧౩౮

సీ. అద్భుత ప్రాపతే • యముప్వయంబొనరించి
బహు తటాకంబులే, ప్రభుఁడొనర్చె
సిమ్నోన్నత క్షోణి • నిమ్నగా తుల్యకా
కుల్యలనే ధార్మి • కుండు ద్రవ్వె
నిర్జన స్థలులపై ని • ఖిల ప్రజోల్లస
ద్గ్రామముల్ పేటలే • ఘనుఁడు గట్టె
దుర్గమార్గంబుల • దోఁగంబులైనట్టి
యూ రామములనే మ • హాత్ముఁడుంచె

గీ. నశ్వితామహు ధర్మంబు • ననుసరించి
యంతకన్నను మిక్కుటం • బై దలిర్చ
వాని పరిపాలనముఁ జేసి • వసుధనేలె
యెల్ల భూపాలు పోత ధా • త్రీశ్వరుండు. ౧౩౯

క. శ్రీ పత్యంశ భవుండగు । నా పోతారెడ్డి మాచ • మాంబికయందుఁ
దీపిత పుత్రులఁ గనియె మ । హీ పాలన శీలన ప్ర • హేతులుగాఁగన్. ౧౪౦

మ. లలితాలంకర కాంచితా వయువుఁ డౌ • ల్లారెడ్డి జోగావనీ
తిలకుల్ వారలు దాన ధర్మముల ధా • త్రీ నిర్జర శ్రేణులన్
వెలయం జేయుచు రాజ కార్య ఘటనా • విఖ్యాత కౌతూహలం
బలరన్ వర్ధిలి రాహవ ప్రకటితా • హంభావ పుంభావులై. ౧౪౧

వ. అందు. ౧౪౨

శా. అంకారంభ విజృంభమాణ విజయో • ద్యద్భేరికా ఘాంక్రియా
లం కర్మీణ మహారవ శ్రవణ వే • ళా నిశ్చలాకాటవీ
కింకుర్వాణ వచోవిచార పరులై • గ్రించన్ దలిర్చన్ రణా
లంకారాసి భుజార్గళుండగుచు నా • ల్లారెడ్డి భూ మండలిన్. ౧౪౩

సీ. ఒక వేళఁ బరిహాస • మొనరించె నేనియు
నుచితోక్తులే కాని • యొండు లేదు

శయనించి యుండియు • స్వప్నంబు నందైన
అన్యకాంతాగోష్ఠి • నరయలేదు
సాహసోద్రిక్తుడై • శాత్రవునందైన
దుర్గుణారోపంబు • దొడరలేదు
మనసున నెడలనే • మఱపాటు నైనను
దగ నసత్యపు గల్ప • దలచలేదు

గీ. గాన నీ రెడ్డి నృపతియా • కల్పమవధి
గను ప్రవర్తించ వలెనని • జనులు వొగడ
ప్రబలి వర్ధిల్లెనెల్ల భూ • పాల మౌళి
తన సముజ్జ్వలతలు కల్ప • తరువు ప్రాక. ౧౪౪

క. ఆ యెల్లనృపతికతి భా • గ్యానుత జగ్గమ్మ భార్యయై వసరెఁ బ
ద్మాయతన ముఖకమల శో • భాయుతయై బుధనిజనులు ప్రస్తుతిసేయన్. ౧౪౫

గీ. అమ్మహీపతి కనుజుఁడై • యవని వెలసె
జోగిరెడ్డీంద్రుఁ డత్యంత • సుగుణగణ్యుఁ
డప్రతీప ప్రతాప ప్ర • తాభిరాముఁ
డాశ్రిత కదంబ వార్ధి కా • బ్జాభుఁడగుచు. ౧౪౬

మ. గరిమన్ భూపరి పాలకుండయిన జో • గారెడ్డి తేజో విభా
స్వరతఁ దొప్పెన్ మును చక్రవాళగిరి పా • ర్శ్వవర్తి ప్రదేశ స్థమ
స్తర జీవోల్లుఠ దంధకార చయము • ద్రావద్విప త్కామినీ
వర ధమ్మిల్ల తమోనివారక కర • వ్రాతంబు సంధిల్లగాన్. ౧౪౭

చ. నిరతము భూ జనమ్ములకు • నెమ్మదిరంజిలఁ జేయుచున్ ధరా
సురలను బ్రోచు చోఁదనకు • జోగనృపాలుఁ డొనర్చు దానవి
స్ఫురణను జూచి కల్పతరు • పుంజము దుర్యశమున్ వహించె నా
కర మరయంగ షట్పద పిక • ప్రకరాదిక కైతవంబునన్. ౧౪౮

శా. కారుణ్యాకర మూర్తియై వెలయు జో • గారెడ్డి సత్కీర్తి హం
సీ రత్నంబు సమస్త విశ్వములని • ష్టేపించు నందంబు ల

త్యాద్యూర్ధంబుజ సంభవాండ తతి • మధ్యస్థంబులై యుండ త
త్పారంపర్యము నొంది పిక్కటిలుచో • బంహిష్ఠ వృత్తిన్ దగన్. ౧౮౯

సీ. అంగవంగ కళింగ • బంగాళ వనితలు
లలిమించు వీచోపు • లను వహింప
లాట కర్ణాట ఘ • ర్జాట భోటాంగనల్
వినులంబులగు ముకు • రములు బూన
మాళవ మళయాళ • చోళ నేపాళ బిం
బా ధరల్ వేటు రు • మాళ్ళు వీవ
గొంకణ కుంకణ • కుకురు కాశ్మీర రూశ
రమణులు వీటికా భ • రములు దాల్ప

గీ. సర్వ సర్వంసహా చక్ర • చక్రవర్తి
లక్ష్మణోపేతుండై మహా • లక్ష్మి దనర
కామినేని కులాంభోధి • సోముడైన
జోగ భూపాలుడల రెయ • శోధనుడయి. ౧౯౦

క. ఆ జోగారెడ్డి మహీ • రాజుకు దేవేరి యగుచు • రంజిలె సుగుణ
భ్రాజిత చొక్కవ్వ జయ-శ్రీ జగతీ సదృశయగుచు • జిర కీర్తి దగన్. ౧౯౧

గీ. సుదతి పుట్టిన యింటికి • జొచ్చినింటి । కలరు వన్నియం దెచ్చిన • తలిరుబోడి
చారుతరకీ పలయపాణి • కీరవాణి । యైన చొక్కవ్వ నెన్నంగ • నలవియగునె ౧౯౨

క. శమదమములనెన్నగ నా । యమునమయే మగుప లీశ్వ • రార్చితమతియై
రమనను దినంబు పూజల । నమరంగ జేయుచును చొక్క • మాంబ దలిర్చెన్. ౧౯౩

గీ. అట్టి జోగనృపతి చొక్క • మాంబయందు
భూరి బలవంతుడైనట్టి • పోతిరెడ్డి
సుందరాకారుడై యుండు • జోగిరెడ్డి
యనగ దగు బుత్రులను గాంచె • దనయులుగను. ౧౯౪

క. ఆ జోగిరెడ్డి మహా • భాగుం డతి నీతిపరుడు • ప్రకటతర సమా
ఖ్యాగరిమ నొనరి రాజ్య । శ్రీ గురు బుద్ధి ప్రసిద్ధి • జెందు మనుం డై. ౧౯౫

క. ఆ పోతారెడ్డి మహీ • భూపాలుని భార్య యగుచుఁ • బొగడొందె నయ
శ్రీపతిపూజా పరహృద • యాపాదిత భక్తి సర్వ • మాంబ దలిర్పన్. ౧౬౧

గీ. అర్థి జనములఁ గనుఁగొన్న • నాదరించి
పూజలొనరించి యన్న మిం • పుగ విధించి
యన్నపూర్ణభవాని యో • యనఁగ మించి
సర్వమాంబిక దనరె యా • జగతిలోన. ౧౬౨

సీ. సమ్మదమునరంగఁ • దమ్మిగద్దియనుంతు
కొమ్మఁ జిత్తమ్మునఁ • గుదురు కొలిపి
బలువైన చలువగు • బ్బలిరాచ కూతురు
నెళిమి మానసమున • నిరవు కొలిపి
పటుబుద్ధి మగని పు • క్కిట నుండు పాలకు
లెందంబులో ముందు • పొందు పరచి
సురరాజ రాణి చం • ద్రురు కీరవాణి ము
న్నెంత రంగంబున • నలరఁగలఁచి

గీ. వారిజారిని గురుకరి • వీర కర్ణి
కార చంపక నవమల్లి • కాజపాప
కుంద కాంచనముల పూజ • గొందఁ జేసి
యింపుదళుకొత్తుచుండ రా • ణింపుచుండె. ౧౬౩

శా. ధీయుక్తిన్ ధరణీసురాగ్రణుల భ • క్తిన్ బూజ్యులం జేయుచున్
శ్రేయోవంతుని పోతభూమిపతిని • ర్థిం బ్రేమ వాటింపుచున్
స్నాయుప్రాప విలాస వైఖరులచే • సర్వాంబ రంజిల్లె శ్రీ
న్యాయం బేర్పడ సజ్జనంబులకు నా • నందంబు సంధిల్లఁగాన్. ౧౬౪

క. శ్రీ రాజేశ్వర కరుణా । సారాంధ కటాక్ష వీక్షణాగత రాజ్య
శ్రీ రక్షణ దక్షిణ పో । తారెడ్డి మహీపతికి ము • దంబులరారన్. ౧౬౫

గీ. మానవతిమైన యా • సర్వమాంబ గర్భ
మునను జన్మించి ప్రతి • దినాభ్యుదయ మొంది

సర్వ సర్వం సహా చక్ర • శక్రుఁ డనఁగ
వెలసె రాజన్న నృపమౌళి • విశ్వమెన్న. ౧౬౬

సీ. తన సమాఖ్యామధీ • తతినిత్య దానాంబు
ధారలచే వృద్ధి • దనరుచుండఁ
దన సుగుణ సుమంబు • ల నుపమ ధర్మ ధీ
కల్పలతాగ్రణిఁ • గలసివెలయ
తన విశ్రుత శ్రుతో • దన్వతీశ్వరునకు
శమదమాదులు తరం • గములు గాఁగఁ
దనకరుణామృతం • బునకు నేత్రాంతముల్
కలశయుగంబులై • కానుపింప

గీ. ధరణి వర్ధిల్లెనని సుధీ • తతులు బొగడఁ
గుశల చారిత్రు రాచుల్ల • గోత్ర పాత్రుఁ
డమిత జయసాంద్రుఁ గామి • నేన్యన్వయేంద్రుఁ
డైన రాజన్న చౌదరి • యవని నేలె. ౧౬౭

సీ. విధులై మహా యజ్ఞ • విధులై శివార్చన
విధులైఁ దగిన వేద • వేత్త లలర
పదవులై సద్వనీ • పదవులై ఘన దవా
పదవులై ప్రతి పక్షు • లొదుగుచుండ
కృతులై పరాసిరా • కృతులై పదు క్తి భా
కృతులై విచక్షణుల్ • నుతులొనర్ప
మాన్యులై రాజన • న్మాన్యులై విజితారి
మాన్యులై నికుల్ • పూనికొలువ

గీ. ప్రకట పాషండ బౌద్ధ చా • ర్వాక జైన
పరస మతములు తన మహా • సరస వచన
రచనల హసింపుచును రాజ • రాజ సదృశుఁ
డై తగెను కామినేని రా • జన్న నృపతి ౧౬౮

సీ. శ్రీ మహాదేవాంఘ్రి • సేవానురక్తుఁడై
సతత పంచాక్షరీ • జపము సేయు

శివభక్తగణముతోఁ • జెలిమి పాటింపుచు
  శివకథాశ్రవణంబు • చేఁదలిర్చు
సవ్యవివాహోప • నయనార్థ మర్థించు
  భూదేవతలఁ దృప్తిఁ • బొందఁజేయు
గ్రతుసమిత్త్రాగత • శతసంఖ్య విప్రోత్త
  ములు గోరు విత్తమి • మ్ముగ నొసంగు
గీ. ఘనతటాకోపవనదీర్ఘి • కలను కూప
ములను నిర్మించి కారుణ్య • కలితుఁ డగుచు
నిలను బాలించె శ్రీ కామి • నేని కులజుఁ
డైన రాజన్న చౌదరి • యనుదినంబు. ౧౬౯

మ. ప్రయుత శ్రీకర కామినేని కులుఁడౌ • రాజన్న భూమీశ్వరుం
డయితో దీర్ఘ సువర్ణ ముద్రికల ది • వ్యాచ్ఛాద్య నాదంబులన్
వ్యయ భాగంబొసరింపుచుండగను నిత్యంబర్చిత ప్రార్చిత
ప్రియ మేధా,యను వైదికోక్తి దనరన్ • రేయున్ బవల్ దత్సభన్. ౧౭౦

సీ. జపముచే భీకరా • హవముచే రాజ్యాను
  భవముచే రామ ప్రభావ మెన్న
భక్తిచేఁ దేజ ప్రయుక్తిచే కాంతి ప్ర
  సక్తిచే ఖగరాజ • సరణు లెన్నఁ
బ్రాప్తిచే సకల విద్యాప్తిచేఁ బావన
  వ్యాప్తిచే శుచి వృత్తి • ననుసరించుఁ
గీర్తిచే సౌందర్య • మూర్తిచే జ్ఞాన వి
  స్ఫూర్తిచేఁ గృష్ణ సం • శుద్ధులరయ
గీ. శరభ భృగురామ రాఘవ • గరుడసూర్య
చంద్ర శివ కవివహ్ని వి • జయగదాగ్ర
జన్మ సత్యవతీ సుత • సరణు లెసఁగ
సరస రాజన్న దేశాయి • చంద్రుఁడలరే. ౧౭౧

సీ. కింపచాన సదాభి • తంపచానలు నిత్య
  దివ్యాన్న భోక్తలై • తేజరిల్ల

గచ్ఛరోర్వేల్ల త్పటచ్ఛురుల్ వంతతో
దంచదంశుక ధారులై దలిర్చ
బ్రజ్ఞాన మార్గాన భిజ్ఞాన భూసురుల్
వేద శాస్త్రజ్ఞులై వెలయుచుండ
పాల్యానుగత కర్మ కల్యావరజులు స
ద్గ్రామాధికారులై రంజిలంగ

గీ॥ జేసి వారల కిష్టార్థ సిద్ధులొసఁగి
పుడమి రంజిల్లె భూభుజుల్ బొగడుచుండ
రమ్యతరమూర్తి చంద్రికా సౌమ్య కీర్తి
నిపుణ రాజన్న దేశాయి నృపవరుండు. ౧౭౨

సీ. తెలిదమ్మి గద్దియ చెలువొందు పైదలి
దలిరమ్మి దొరతండ్రి గెలువు గొమ్మ
గొమ్మచే నిలకింపు గూర్చునాతని మేను
మేను దాల్పుల నేలు వాని వ్రాలు
వ్రాలు గట్టుల గొట్టు వాఁడెక్కిన మెకమ్ము
కమ్మదీయక పాలు గమ్మిసొమ్ము
సొమ్ముగాఁ జెలువరా నొమ్మ జేసినవాఁడు
వాడు జూపక తావి గూడినలరు

గీ నలరు నల్లని వలువచే వెలయుసామి
సామి చెలితోడ జగడంపు (బు) నలువు సవతి
సవతిగొనఁ గామినేని సద్వంశవార్ధి
సరస రాజన్న నృపతి యశమ్ముతోడ. ౧౭౩

సీ. తన మూర్తి విధునకు జనసేత్ర పంక్తులు
కువలయ స్థలములై కొమరు దిగుల
తన విత్తమునకర్థి జనక రాజ్యంబులు
నిక్షేప సంస్థితి నియతి జెంద

తనను తేజోదిశంగనకు స్వామిస్వామ్యగుణములు
ఘనసజాలంబులై ప్రభవహింపఁ
ఘన బిరుదములకు దీప్తులును శాసన
స్తంభంబులై నితాంతముగ వెలుగఁ

గీ. నలరె నని సజ్జనంబులు సంస్తుతింపఁ
గామినేన్యన్వయాంభోధి సోమధాము
వమ్మనేత ప్రసన్న రాజన్య నృపతి
ధరణిఁ బాలించె ఘనధాన్యపురమే దనర. ౧౭౪

గీ. అమ్మహీనాథు ధర్మపత్నియై యలరుచుండె
రామమాంబ సుశీలాభిరామమాంబ
నిత్యసత్య వ్రతాచారనియమ వృత్తి
సకల సాధ్వీమతల్లులు సన్నుతింప. ౧౭౫

సీ. రాజకార్య విశేషరచనల నిజభర్త
కానుకూల్య ప్రధానాఢ్య యగుచు
భర్తృ శిశ్రూషాభిపరత కర్తవ్యబుద్ధి
ములయందు దాసీత్వకలన జెందు
వల్లభాభీష్టాన్నవాంఛ విచారించి
వర్ణిత మాతృభావంబు నొందు
పతిదేహ సౌఖ్య సంపాదన క్రియ నెంచి
రంభావిలాస సంరంభ మొనయు

గీ. ధవుఁడు ధర్మప్రవర్తనత్వంబు గలుఁప
నానుకూల్యంబుగ మెలంగు నవనివంటి
బరవసము బూను వాత్సల్యభవ్యమూర్తి
రామమాంబ దలిర్చె శ్రీరామయగుచు. ౧౭౬

సీ. తనపేరు సేరిలంపనరు ధాన్యంబుల
నర్థంబు ప్రవనుపిల్చునర్థితతికిఁ

దన దివ్య సహకార • తరువులలో గొన్ని
వృత్తులు విప్రుల • కెలమి నిచ్చె
తన సమార్జిత విత్త • మును వివాహోపన
యనముల కర్పించె • వినయమొసఁగ
తన సమ్యగిత్తు సం • జనిత శర్క విప
కృత సమారాధనా • ర్పితము జేసె

సీ॥ సకల జనములకును సల్లి • యగుచు దేవ
భూమి సురలకు వృత్తులు • పూర్ణముగ నొ
సంగి తత్కరుణాశీర్వ • చనములంది
రామమాంబ దనర్చె సూ • త్రామ గరిమ. ౧౭౭

గీ. అమ్మహారాణి పిమ్మట • నలరె జిన్న
రామమాంబిక స్వప్రియా • రామయగుచు
దానధర్మ ప్రసంగ తత్ • త్పరత దనరు
ప్రియుని కనుగుణ హృదయయై • పృథ్విలోన. ౧౭౮

గీ. చెలఁగివారల పదపడి • శ్రీ భవాని
దనరె సాధ్వీలలామయై • ధరణిలోన
ధన కనక వస్తువాహన • ధాన్య దాన
దాసికా గోగణాది సం • తతి జలిర్చె. ౧౭౯

గీ. లాసని మన్యత్ర సత్ర • సంబులై న
సత్యతము లాచరింపుచు • సంతతంబు
రజ రాజేశ్వరాంఘ్రిని • రేజ యుగము
నెమ్మనంబునఁ దలఁచుచు • నిగుడుచుండె. ౧౮౦

సీ ఘృతసూపదధి యుక్త • కించి దుత్కృష్టమైన
యన్నంబె కాని శు • పాకాన్న మిడదు
భూది శైలాదులు గల్గు • వీడ్యమె కాని
పట్టి తాంబూలమి • వ్వంగ లేదు

రమణీయ సూత్నాంబ • రంబులనేకాని
జరదంశుకంబు లో • నంగ లేదు
సకల వస్తు విశేష • సదనంబు లేకాని
శూన్య గేహంబులఁ • జూప లేదు

వసుధలో గల్గువార లె • వ్వారలైన
నర్థులై వచ్చి యాచించు • నంతలోన
తనయులను బ్రోచు తల్లి వి • ధంబు దోప
నెలమి రక్షించిన భవాని • నెన్న దరమె. ౧౮౧

సీ. స్వాధ్యాయ పరులను • సమ్మోదంబలరించి
దాన ప్రసంగంబు • దలఁపుచుండు
శాస్త్రి సంఘంబును • సంభ్రమంబొనరించి
యత్యంత మధురోక్తు • లాడుచుండు
సకల పురాణజ్ఞు • లకు ముదంబొనరించి
దేవతాంతరముల • దెలియ నడుగు
నితిహాస వేదుల • నీప్సితంబెనయించి
సద్వ్రత స్థితిగోపి • నలుపుచుండు

నిత్య సజ్జన సహవాస • నియమమునను
దేవగురువిప్ర విశ్వాస • భావమునను
విశ్వ సంపత్సమృద్ధియు • వెలయుచుండ
నా భవానమ్మ నెన్నంగ • నలవి యగునె. ౧౮౨

సీ. శ్రీరాజరాజేశ్వ • రీసపర్య యొనర్చు
పుణ్య సీమంతినుల్ • బొగడుచుండ
రాజేశ్వరామేయ • పూజా విధి వహించు
విప్రోత్తములు మెచ్చి • వినుతిసేయ
సకల సంపద్వృద్ధి • జప ముఖ్యము వహించు
స్నాతక వ్యూహంబు సన్నుతింప
నిరతాన్నదానము • నిమచేవర్తించు
నా బాలగోపాల • మభినుతింప

హితపురోహిత బాంధవ • హృదయ మంత్రి
మిత్ర భటదాస సఖులను • బ్రియులనును
దలంచి రక్షింపుచున్నట్టి • ధర్మమూర్తి
యగు భవానమ్మ నెన్నంగ • నలవియగునే. ౧౬౩

సీ. అధ్యాత్మ విద్యామహో • పాధ్యాయులను నిల్పి
వేదవేదాంగముల్ • వెలయఁజేసి
శ్రుతి శిరఃపరిచయా • న్వితపండితుల నుంచి
స్థిర మతుస్తంత్రముల్ • దేటపరచె
నాత్మ నామాంకితంబు • లైన పేటలలోన
వృత్తి మాన్యంబులు • వెలయఁజేసె
దనివోంద నన్నస • త్రంబులు విధయించి
బహుదేశ విద్యార్థి • పంక్తిఁ బ్రోచె

నగ్రజాతులు మొదలైన • యఖిల జాతు
లందు దయయుంచి యన్నవ • స్త్రాదు లొసఁగి
శ్రీ భవానమ్మ విలసిల్లె • శ్రీ భవాని
యనఁగ రాజన్య నృపు భార్య • యవనియందు. ౧౬౪

సీ. ధన్యమాంగల్య మా • త్ర ప్రసిద్ధి వహించి
జన మనోరమ వృత్తి • సంతసించి
సకల కలాభిజ్ఞ • చాతుర్యమును మించి
విదిత ప్రజావృద్ధి • విభవమొంచి
ప్రకటీకృత ప్రభా • పద్ధతి సవరించి
తనరుచుం దృఢ వ్రతంబు గాంచి
రూపలావణ్య [illegible] రూఢ విహరించి
హావభావవిలాస • మనుసరించి

గీ. సతి మహాలక్ష్మి • భారతి, శక్ర జనని
ప్రభు జనక జాత దమయంతి • రతిఁదలంచి
తాను చేసి భవానమ్మ • గరిసోడ
సాటి సేయంగ వచ్చును • సరసమతులు. ౧౬౫

సీ. ధైర్యంబు స్థైర్యమహా • దార్యంబు గాంభీర్య
          మాలోచనము గుండు నీ • యువని పతికి
శమదమార్జవతతి • శౌతవ శ్రద్ధా ప
          నాధాన మిమ్మహా • బాహునికెఁదు
రాజ కార్యాకార్య • రచన పాత్రాపాత్ర
          నిర్ణయం బెప్పుడీ • నృపతి నెనయు
దయయు సత్యము నీతి • ధర్మంబు శీలంబు
          బొంకుచు నుండు నీ • భూమి పతిని

గీ. ననుచు సకల కవీశ్వరు • లభినుతింప
నిపుణుడగుచును నాభవా • నీ సమేతుఁ
డగుచు రాజన్న దేశాయి • స్వాన్వయాబ్ధ్యుఁ
డైన సత్పుత్రుని గనంగ • నాత్మ గోరి. ౧౮౬

సీ. వేద వేదాంగ ప్ర • వీణమై విలసిల్లు
          విప్ర సందోహంబు • వెంబడింప
శ్రౌత కర్మాది ప్ర • శస్తమై తగినట్టి
          క్షత్రియ వ్యూహంబు • సందడింపఁ
క్రయ విక్రయార్థని • ర్ణయముచే గనుపట్టు
          యూరవ్య సంఘంబు • చేరి కొలువ
స్వాధిక వర్ణ సే • వాసక్తమై యుండు
          శూద్ర సమూహంబు • శోభిలంగ

గీ. వేద్య పంచ మహావాద్య • విభవ మలర
సౌమ్యరమ్య సువాసినుల్ • సరసరాగఁ
రాజరాజేశ్వరాత్మవి • భ్రాజమాన
మైన లేములవాడ నె • య్యమునఁ జేరి. ౧౮౭

సీ. ధర్మకుండోదక • స్నాన కార్యంబుల
          జెంది రాజేశ్వర • మందిరంబు
దర్శించి పర్వతి పై • మర్మ రూపిణియైన
          భ్రమరాంబికకు మ్రొక్కి • పసపు కుంకుమ

వ్యాధి పీడిత జనులే • వచ్చి వేడినయంత
నౌషధంబులనే ము • హాత్ముఁడొసఁగె
బహుతటాకంబులే • ర్పడగ నిర్మించుచు
సత్రె మాన్నంబులే • విభుఁడు జేసెఁ
తగవు కోరిన వారి • ధర్మ మార్గమ్మున
భావించి మించెనే • పార్థివుండు

గీ. నట్టి చెవ్వోల ముఖ్యాన్వ • యాబ్ధి చంద్రుఁ
డైన ధర్మ నృపాలుఁడు • ద్రవ్యశుండు
రాజకార్య ధురంధర • ప్రాభవుండు
ధరణి పాలించె ధన ధాన్య • గరిమ మెరయ. ౧౩

గీ. అతని పుత్రుఁడు చొక్క భూ • పాగ్రగణ్యుఁ
డద్భుతైశ్వర్య ధర్యుఁడ • వంయు శత్రు
హరణుఁడాశ్రిత రక్షణుం • డనుదినాగ్ర
జనకృత విశ్రి తా శోర్య • చనము నొంది. ౧౪

శ్రీ చొక్కనాథుఁడనఁదగిఁ యా చొక్క నృపాలుఁడంచెరి • సంచితకరుణా
లోచనుఁడు రాజకార్యాలోచనుఁడు ప్రభాప్తిలోక • లోచనుఁడనఁగఁ. ౧౫

గీ. చెలఁగి రాజన్న భూపాలు • చెలియలైన
రాజమాంబను బెండ్లాడి • రాజకాంతి
పొలిచియున్నట్టి యొక్క స • త్పుత్రు గనియె
నతఁడు రాజన్న చౌదరి • యనదలిగ్బ్. ౧౬.

సీ. కలశ పారావార • గర్భ వీచికలందు
జనియించు సంపూర్ణ • చంద్రుఁడనఁగ
శ్రీ మహాలక్ష్మి ప్ర • సిద్ధోదరంబున
సంభవించిన పంచ • శరుడనంగఁ
స్థిర తరైశ్వర్య శ • చీదేవి కుదయించి
సంతసించిన శ్రీ జ • యంతుఁడనఁగ

సంగరాంగణ గాండీవి • సదృశ కామి
సేని రాజన్న నృపమౌళి • యిలఁ దలిర్చె. ౧౦౨

సీ. ఖడ్గంబు బూనెనా • కఠినారిశిరములు
కందుక క్రీడ సెం • పొందవలయు
పాగఁ జేబట్టెనా • చటుల రాహుత్త
రాట్పటు శిలాబ త్తరుల్ • పగులఁ బొడుచు
నే జాగరించెనా? • నేటుగా వీరుల
గుడులు గాఁగను గ్రుచ్చు • మొదలఁ గొండ
కోదండ మందెనా? • వేదండములు నైన
నొక్కొక్క కోలచే • నుక్కడంచు

నౌర సాహస విక్రమా • న్యూనతారుఁ
డనుపమాకారుఁ డాశ్రితా • వన విహారుఁ
డను దినోదారుఁ డఖిల • విద్యా విచారుఁ
డగుచు రాజన్న నృప మౌళి • యలరుచుండె. ౧౦౩

సీ. హాటకాచల హారి • ద్ఘోటకానల సుహా
నాలకా గళ కాల • కూటములను
నళిన మార్గణ చైత్ర • నలరాజ హరిపుత్ర
ధనదాత్మజ విచిత్ర • ఘనతనులను
ఖర కరాత్మజ శీత • కర విరోచన జాత
హరస ఖామర పూత • సురతరులను
కాంతజాస గణేశ • కుండలీశ వ్యాస
చండీశ చిత్ర శి • ఖండిజాలను

గీ. శౌర్య సౌందర్య దానవా • క్ప్రతుల సుములఁ
బరిహరింపుచు నిత్య సం • పదఁ దలిర్చు
నిరుపమిత తేజుఁడై కామి • సేని కులజ
వరవ రాజన్న దేశాయి • చంద్రుఁడలరె. ౧౦౪

సీ. దంతావళ స్థితో • ద్ధత వాద్య మానోగ్ర
భేరికా ధణధణ • త్కార రవము
యోగ్యోష్ట్రి ఘటిత ము • హుస్తాడ్యమాన ధ
క్కాదూధ ధమధమ • త్కారములును
సంభృతా జానేయ • సంయుక్త టెంకెణ
దారుణ ఠమఠమ • త్కారములును
పటు జవోత్కట మహో • ద్భట సంతతాహత
పటహా ఢాంఢాంక్రియా • పాటవములు

కలయ సంగర జాంగలాం • గణకరాళ
కర్తరీము ఖ సుశిలీ ము • ఖ దళితలుత
దరి గళగళద సృక్ఝరీ • తరణి ఖేల
దసి ధరుఁడు రాజ నృపమౌళి • యలరుచుండు. ౧౯౯

సీ. హస్తముల్ రాజేశ్వ • రార్చనా విధియందు
వీనులు శివకథా • వితతియందుఁ
జూపు మహాదేవు • దీపితాంగమునందు
జిహ్వ పంచాక్షరీ • స్థిరత యందుఁ
జిత్తంబు శాంభవ • శ్రీ పదాబ్జములందు
స్వాంతంబు ద్వాదశా • క్షరమునందుఁ
బుద్ధి యుమా • నాథు • పూర్ణ రూపము నందు
మనసు మహేశ్వర • మతమునందు

గీ. నునిచి కాల త్రయా • బాధ్య • యోగమొంది
సంతత భ్రమరాంబికా • సామరస్య
సరస రాజేశ్వర వర ప్ర • సాదలబ్ధ
జనన రాజన్న దేశాయి • చంద్రుఁడలరె. ౨౦౦

సీ. పలికెనా? నతోక్తిఁ • బలుకుటింతియె కాని
తద్వ్యతిరిక్తంపు • తలఁపు లేదు
చూచెనా? దయజేయు • చూపులింతియె గాని
తదభావమగు చూపు • లోదవకుండు

నిచ్చెనా? పూర్తిగా • నిచ్చుటింతియెకాని
కోరుదువగా నిచ్చుట • నోదవకుండు
పట్టెనా? విడకచే • బట్టుటింతియె కాని
విడుచుట కెన్నడు • గడఁగ లేదు

గీ. భళిరె! యిటువంటు నృపుఁడేడి • యీదలంప
శాశ్వత స్థితి రాజ్యంబు • విశ్వమునను
జేయవలెనని కవులెన్న • జలఁగె నౌర
నిపుణుఁడైనట్టి రాజన్న • నృపవరుండు. ౨౦౪

శా. సామాన్యజ్ఞఁ గవీశ్వరుల్ సభకురా • వద్దన్న నీమనో
క్షీ మాధుర్య రసోక్తులంగరపి వా • ర్షింపన్ బ్రవర్తించుచున్
బో మార్గాకలన విద్య దుద్ధిత కళా • స్ఫూర్తి స్వరూపంబు తా
నె మాహేశ్వర పాదపంకజ సప • ర్యన్ జెందు నానందంబుగా. ౨౦౫

క. పటు శబ్దార్థాలంకృతి • రటద పిరళ తరంగళిత్త • రంగాయిత వా
ఘ్మటనోల్లస ఘటన ప్ర • స్ఫుటన ప్రతిభా విశేష•పూజ్యుండగుచున్. ౨౦౬

సీ. అఖిల భూజన జీవ • నాధారత వహించి
యనుపమ స్థితి ఘనా • ఘనుల మించు
దృఢతరా వయవ సం • దీప్త తత్త్వము నొంది
కార్త్స్న్యమున ఘనా • ఘనుల నొంచు
భాసమాన ప్రతా • ప స్ఫూర్తి జెన్నొంది
మనుముట్టుకా ఘనా • ఘనుల నొంచు

గీ. ప్రాజ్యతరపూజ్య సామ్రాజ్య • పరతఁ జెంది
ధరణి పాలింప వలెనని • ధన్యులెన్న
సమిత జయసాంద్ర కామినీ • సన్నయేంద్రుఁ
డైన రాజన్న నృపమౌళి • యలరుచుండె. ౨౦౭

సీ. ఏ తాపస స్వామి • యిరవుగా నామ్నాయ
పారస్యము వచించె • సజ్జనులకు
నే తపస్వి వరుండు • హిత పరివస్యాది
సద్గ్రంథ కథమహా • శయము దెల్పె

నేపారి కాంతిఁ జ • మేధమాన షడధ్వ
జనితాశయంబు సాం • పునవిధించె
నేపది ప్రాద్ధర్మ • దేశ మిత్రో దకద్విద్ధ
క్యానుసంధానంబు • నందఁ జేసె

గీ. సట్టి శ్రీరామ భద్రేంద్ర • యతివరుండు
నాత్మగురుఁడు కరుణారసార్ద్రదృష్టు
లలర గనుగొని రారహః • స్వంబు గరప
వెలసె రాజన్న దేశాయి • విశ్వమునను. ౧౧౧

సీ. అసమాన బలశౌర్య లసమాన సౌందర్య
రసమాన గాంభీర్య • రిభసమలర
ఋంఖాను పుంఖాజి • రింఖావిశృంఖలో
త్కంఖాణ సంఘముల్ • గడలుకొనఁగఁ
జండశుండాదండ • భండనోద్దండ వే
దండతండంబులు • ద్ధతిఁ దలిర్ప
డోలికా హాటకాం • దోళికా పర్యంక
పాలికా శకటసం • పద వెలుంగ

గీ. నిగ్రహానుగ్రహోదగ్ర • జాగ్రదుగ్ర
విగ్రహా వ్యగ్ర విక్రమా • వేశులైన
భటులు గొలువంగ • భూభార భరము బూనె
నిపుణ రాజన్న దేశాయి • నృపతులెన్న. ౧౧౨

గీ. అతని యర్ధాంగనాలక్ష్మి • యలరెరంగ
మాంబ యనఁగను సుగుణావ • లంబనుగుచు
సత్యశీల దయాద్రవతా • చారదాన
ధర్మసాధ్వీగుణములచే • ధన్యలెన్న. ౧౧౩

కం. రంగను లోచనజితసా। రంగను గరుణాంచితాంత • రంగను గతిసా
రంగను చికురాంచితసా।రంగను వినుతింపఁ జౌవ • రమణియనదగుఁ. ౧౧౪

సీ. ధవళ్ళ్రభాధళ • ధళలు నవ్వులనుంచి
హంసయానాభిఖ్య • సలరుచుండి
కాంచల్య గుణముననే • త్రాంచరంజనసుంచి
కమలాను గుణప్రత్తి • నెరుచుండి
నీలకాంతిచ్ఛటల • నెమ్మేన నొనరించి
యనుపమానాసనా • ఖ్యను వహించి
దృగ్గోచరముకాని • దీప్తిమధ్యము నెన్ని
యతను మోహనవిద్య • గతి జెలంగి

గీ. పలుకు చెలి కల్మి పతి సామి • పోలంతి రతిని
కలవిలాసవ దవయవం • బుల నెరిర్చు
ధన్యరాజన్న నృపమౌళి • ధర్మపత్ని
యైన రంగమ్మ నెన్నఁగ • నలవియగునెః ౨౧౫

సీ. వేవలి ఘననీల • విభవంబున మెలంగ
ఫాలంబు విధుకళా • లీలదనర
దనరుకొమ్మలు శార్జ • ధర్మమార్గము నొంద
కన్నులిందీవర • గతి జెలంగ
వీనులు శ్రీధర • విఖ్యాతిని వహింప
నధరంబు మధుగర్వ • హారతబూన
గళము శ్రీమత్కంబు • కరసంస్థితిని జెంద
నడుము హరిస్ఫూర్తి • నడరుచుండ

గీ. గతులు కరివరద ఖ్యాతి • నతిశయిల్లఁ
దనరు దివ్యాంగముల విష్ణు • తనువహించు
రాజశేఖరు నర్ధాంగి • రాజ్ఞయైన
రంగమాంబను బొగడత • రంబునౌనె. ౨౧౬

సీ. స్వసమాన వేషంబు • నినుమంతయైనను
పరభామ కొసఁగని • సరసిజాస్య
తనుకంచవ నొనర్పఁ • దలఁచినవారలఁ

ఋతుల గాఁ జేయు • పుష్పవాటి
బహుతపస్సిద్ధియైన • పతిమహావిద్యాను
భవము నొందఁగఁ జేయు • పద్మగంధి
భర్తృనిమిత్తమై • పద్మినీబాంధవు
నుదయింపఁ జేయుని • యుత్పలాక్షి

గీ. కలిత రాచూర్లగోత్రజ • కామినేని
కులజ రాజన్న దేశాయి • తిలకహృదయ
స్వాభిమత ధామ కుల పాలి • కాభిరామ
రంగమాంబకు సాటియే • యంగవచ్చు. ౧౧౪

సీ. ఏమహాదేవి కా • మేశ్వరాంకానల్ప
తత్త్వంబునందు మో • దంబుఁ జెందె
నేమహా శ్రీరాజ్ఞి • యింపుతోడ మదధ్వ
తత్త్వవిద్వజ్ఞాన • ధాత్రియయ్యె
నేజగజ్జనని మ • హేశ్వరార్పిత సప
ర్యావిశేషంబుల • నలరుచుండె
నేమహాలక్ష్మి శ్రీ • హేమశానముఖ దివ్య
జీవికావార్తయై • వెలఁగుచుండె

గీ. నట్టి జగదంబ లలితాంబ • యధరబింబ
సైకతనితంబ భ్రమరాంబ • శారదాంబ
తనదు పూజావిధానత • త్పరతఁ జెంద
రంగమాంబ దలిర్చె శ్రీ • రంగ యగుచు. ౧౧౫

సీ. సమ్యక్ప్రచీపాక • శాసనుంవిధంబు
సరసప్రభాప్రభ • కరులమాడ్కి
సంభ్రమ ద్రోహిణీ • చంద్రులకై వడి
చంద్రమతీహరి • శ్చంద్రులగతి
స్థిరభీమ జావీర • సేనజులనదగి
కనదనసూయాత్రి • మునులరీతి

పావనాంచదరుంధ • తీవసిష్ఠులభంగి
భాసుర రతిమనో • భవులరీతి

గీ. కామిసేన్యవ్వవాయసం • టితకరంగ
మాంబరాజన్న దేశాయి • యానుగుణ్య
దంపతీ భావ మింపొంద • తతసమృద్ధి
వెలయ విలసిల్లి రానంద • ములరుచుండ. ౧౦౯

గీ. నమ్మ గనపాయి పరశివ • శక్తులనగ
సకల సంపూర్ణ చంద్రచం • ద్రికలనంగ
భాసురాఖండ దీపదీ • ప్రప్రభలన
లలిత రాజన్న రంగమ్మ • వెలసిరిలను. ౧౧౦

గీ. అమ్మహీపతి తోబుట్టు • వగుచు దనరి
రాజమాంబ ముఖోపమా • రాజబింబ
ఆశ్రిత కదంబ ఘనసుగు • ణావలంబ
భానుతభ్రమరాంబొంశ • పూర్ణబింబ. ౧౧౧

సీ. అన్నార్తులైవచ్చు • నన్యజాతులకైన
నన్నదానము జేయు • ననుదినంబు
బాంధవులందుసం • బంధంబు వాటించి
సేలుగా వారిబో • షించుచుండు
దవదర్శనమ్మున జే • సినయాచకులమాంద్యు
బుత్రభావనసుంచి • బ్రోచుచుండు
దమ గొల్చు సేవక • దాసీజనమ్ములం
బనులెన్ని రక్షించు • వినయమలర

గీ. దనదు గ్రామంబుల వసించు • జనులకెల్లం
దల్లియై వారి కుశలంబు • దలపుచుండు
నిఖిల సుగుణాఢ్యయగు కామి • నేనిరంగ
మాంబను నుతింప శక్యమే • యవనిలోన. ౧౧౨

శా. రారాజద్గుణశాలి శీలవలన • ద్రాజన్న చేశాయిభా
ర్యారత్నంబగు రంగమాంబ గనియెన్ • రంజిల్లమున్ సద్గుణా
ధారుల్ ధీరులు దారులైతనరు పు • త్రశ్రేష్ఠులన్ సంతత
శ్రీరమ్యాకృతి వైభవంబుగల పు • త్రిన్ స్వర్ణపుత్రింబలెన్. ౧౧౩

క. ధీరోదాత్తుఁడు దారుఁడు। కారుణ్యాగణ్యపుణ్య • గణనీయశుభా
కారుఁడు పెదరాజన్నను। హీరమణుఁడు నిత్యవృద్ధి•నెనయుచునుండెన్ ౧౧౪.

మ. తనగాంభీర్యము సుందరత్వముదిగం • తఖ్యాత దాతృత్వమున్
వనధిన్ మన్మథు వారిజాప్త తనయున్ • వందారులంజేయు స
జ్జనతైకేప్సితదాయియై వెలసెనా • సౌజన్యజన్యప్రథన్
జినరాజన్న నృపాలమౌళి మదన• శ్రీరంజితాకారుఁడై ౧౧౫

సీ. పటుతర బ్రహ్మాండ • భాండోదరంబులు
బొమ్మరిండ్లయ్యెనే • పుణ్యవతికి
హరిహర బ్రహ్మాది • సురతతుల్ పాంచాలి
కాసంచయంబులే • కాంతకయ్యె
మేరుమందర ముఖ్య • భూధరపర్వతముల
న్నగిల్ల లేఘునా • ఘనచికురకు
మహాసహస్రస్తంభ • మంటపంబుయ్యెల
శాలయై దనరెనే • చంద్రముఖికి

గీ. రమ్య నవరత్నకరవయారు • రాజవరాస
యైన యూశాల యూశాల • మునుచుఁబొగడ
జన్న రాజమ్మ విలసిల్లెఁ • గన్నతల్లి
చంద్రుఁలకు నేత్రములుచెల్ల • దనముగాఁగ, ౧౧౬

క. సోమాంశంబున దనరుచు। సోమాభంబైన ముఖము • శోభిలుచుండన్
సోమావయవం బలరఁగ । సోమను నామాంతరమున•సుదతి చెలంగెన్ . ౧౧౭

భ

సందులో శరన్న • యనెడు మంత్రిముడు
　　దవరెనా ధన్యుని • ధర్మపత్ని
యగు పెకవాంబకు • నాత్రిమూర్త్యంశంబు
　　లను సంభవించిరి • వినయమతులు
రాజన్న లింగన్న • రమణీయ గాత్రుండౌ
　　చంద్రన్న వారలు • సాంద్రయశులు
గీ. ధార్మికము ... దదష్టప్ర • ధానహృదయ
బహుళ ... త్రాంగ కృజ్ఞయో • పాయగేయ
లేఖినీ గ్రహ్యచాతురీ• లీల దనరి
ధరణి వర్ధిల్లి రాచంద్ర • తారకముగా. ౨౩౩

శా. హారాకార మహాసుతుణసక్త • త్కాదంబ కాదంబ కాం
తారాగార సతీపురోపటుసనం • ధానాప ధానావట
త్స్మారుద్యాన విలాససాత్త్వికమన • స్సంచార సంచారణా
ద్యారూఢస్థితి నీతకష్టతమ రామా • గాధార గాధారతా. ౨౩౪

క. హాలాహాల కోలాహాల హేలావళి హాళికహారణ • హితవిద్యకృపా
లోలజటాల జటాలసిత టాలకటాలసితనాగ • టచ్ఛివి యనా. ౨౩౫

ఉత్సాహము.
దారుణ ప్రతాపదీప • దండభృన్నికారణా
ధీరధీ నివాసవాస • దివ్యముక్తి కారణా
తారకా సురాధిపత్య • ధైర్య శౌర్య వారణా
హారిమండ లాగ్రవర్య • హాస్యమాన వారణా. ౨౩౬

శా. అండే జధ్వజ కాండ కాండకకటా • హప్రాంచదుద్యద్యశ
స్తండప్రక్రమ దక్షదక్షసవన • ధ్వంసక్రియా హంక్రియా
ఖండప్రాభవచిత్త చిత్తజమహా • గర్వాగ్ర జంఝూనిలో
ద్దండస్థైర్య విహారహార శరద • భ్రప్రస్ఫురద్వాగహా. ౨౩౭

క. సురధరణి ధరశరాసన • నరసాధిత పావనత్రిభువనజనకా
శరధీహిత శరధీరత శరకృత శరణవిష్ణు • శరభూమిరధీ. ౨౩౭

పృథ్వీవృత్తము. నియుద్ధసమరోద్భట • నిజభుజార్గళాస్త్రీకృతి
ద్వియత్పృథువధావత • ద్విషదతుండ చండోత్తమో
భయప్రభవదహస్కరా • భయకరప్రభచక్రభవ
త్త్వయోదయ శరాసనంతత సమాజ్ఞత్రైలోక్యసా. ౨౩౯

మ. ఇది శ్రీరామన్నపాలుపేట నగరో • ర్వీశాగ్రణీ రాచుళ్లా
శ్రుతదిగంత శ్రుతకామినేని కులజ • ప్రఖ్యాత లక్ష్మీప్రసు
గ్రదయాసంయుత రాజశేఖరహిత • ప్రవ్యక్త భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమున నా • ద్యుల్లాసమింపై తగున్. ౨౪౦

## గద్య

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ
ప్రసాద ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్య పూజ్య రా
చుళ్లగోత్ర పాత్ర కామినేని వంశపయః పారావా
ర రాకాసుధాకర రాజన్న దేశాయి సార్వ
భౌమ జ్ఞాపితాంధ్ర గీర్వాణకవిత్వ
చాతుర్యధురీణ పరాశరగోత్ర
రాపాక లింగనార్యపుత్త్ర
లక్ష్మీపతిప్రణీతంబైన
భద్రాయురభ్యుదయం
బను మహాప్రబంధం
బునందు ప్రథ
మోల్లాసము
శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు

# భద్రాద్రియురభ్యుదయము

## ద్వితీయోల్లాసము



శ్రీమణిసౌధాసీన
శ్రీమత్సింహాసనేశ్వ • రీకారుణ్యో
ద్దామధనధాన్యసంప
ద్రామన్నృప పురాధ్యరాజ • రాజమహేశా. ౧

### షష్ఠ్యంతములు

క. ఈదృగిదమియత్తావచ్ఛేదకరహితగుణమణివి • శేషాంబుధికిన్
వేదాదివర్ణతత్త్వప్రాదుర్భావోపలబ్ధి • వరధీరునకున్. ౨

క. ప్రపదప్రపత్త్రిపదాన్యపత్రిపవిపద్ధృదతివి • హారునకు సరీ
సృపహారికి భవదారికి గ్లపితారికి నిత్యసత్య • కల్యాకృతికిన్. ౩

క. విప్రద్యుక్ప్రస్తిగఘురు సద్మునికేళి నిపనదాది • పత్యునకు మహా
రౌద్రాంధక పూర్వద్విష ద్రదిభినాస్థగితశూల • హస్తాబ్జునకున్. ౪

క. ఏకానేకాకారా! టీకునకు గటీతటీవ • టీసంరాజ
శ్రీకరకృత్తికి సహసా! ద్వ్యాకలిత మహాప్రబోధ • కాకృతిధృతికిన్. ౫

క. శరణాగత చరణామృత! చణానత కరుణాభక్త • సంవరణ స్త్రైత్
పురనాయక దరదాయక! మురహాయక మునుకుటు • భుస్తోత్రునకున్. ౬

క. శబల శరశరాసకటి! ప్రబలావృత బర్హిబర్హ • భాసురకుహనా
శబరీవరక బరీభర నిబిరీసరచిత సుమోహ • నీతాత్మునకున్. ౭

క. సత్యచిదానందునకున్! నిత్యునకును శ్రుతిశిరఃస్థ • నీతినిర్ణిత
ప్రత్యయరూపునకు జగ! త్ప్రత్యాహారోపపన్న • పరభాగునకున్. ౮

క. శ్రీరమ్యపరాశక్తి పరీరంభవిజృంభితాప • రిచ్ఛిన్నసుఖా
ధారోదార మనోర్థా! రారామారెడ్డివేట • రాజేశునకున్. ౯

వ. నిరంతరాభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన భద్రాయురభ్యుద
యంబను మహాప్రబంధంబునకు గథావిధానం బెట్టిదనిన. ౧౦

సీ. ప్రతిదినాధ్వరహవి • ర్భాగాగతామరా
నూన పరస్పరా • హ్వానములును
ప్రచురసమిద్దర్భ • ఫలపత్ర హరణార్థ
మునికుమారానోక్త్య • నినదములును
సతతావభృథశుచి • స్నానోత్సవాయాత
తాపస జనతాను • లాపములును
సమభిజ్ఞవీభవత్సవ • మానిసంసదు
దాశీర్వచనపూర్వ • కారవములు

గీ. సత్రకృతకృత్య యజమాన • దంపతీవి
రాజినీరాజనవిధాన • రతసువాసి
నీమిథోవిభ్రమానుగ • నిస్వనములు
నలర శ్రీనైమిశారణ్య•మవని వెలసె.

సీ. బద్ధపద్మాసన • ప్రస్ఫురత్ఖేచరీ
లక్ష్యపశ్యన్మనస్క • లంకృతంబు
సిద్ధాసన స్థిరప్ర • సిద్ధిమద్గోచరీ
వీక్షణోత్సుకమాని • విలసితంబు
సింహాసనవిధాన • సేవ్యమాననిరంజ
నావలోకనభిక్షు • జీవితంబు
ముక్తాసనప్రదా • వ్యక్తిమద్భూచరీ
సంయుక్త సంయమి • సంచయంబు

గీ. నగుచు వీరాసనస్వస్తి • కాసనాఢ్య
రమ్యహఠయోగ, లయయోగ • రాజయోగ
మోక్ష లక్ష్మీకరగ్రాహ • ముదితులైన
యోగులు వసించుచుండు • రింపొంద నచట. ౧౨

వ. మఱియు నిరంతరాంకురిత పల్లవిత సుమిత ఫలిత లలితసవిధ వివిధమహామహీరుహ వ్యూహశాఖోపశాఖా శిఖర ముఖర కలర కలకంఠ నీలకంఠ కీరశారికాది పత్రిపత్రభవ పవన చలిత గలితసుమసముదయ సంతతవికస్వర వాసంతికా సేవంతికా మల్లికా మాలత్యాది లతావితానస్యంద మానామంద మకరంద బిందుసందోహాస్వాదనానంద మిళింద ఝుంకారంబును, సదేశస్థితస్థల నలినీఫల్లహల్లక కమల కుముద శాలినీలోత్పల దళగళత్పరాగ పరిమళ పరిమిళిత విశదశశిభృదుపలశకలకీలితసోపానసంఘ సంఘట్టనోద్వేల్లితరంగఘళ స్వన ద భంగతరంగ సంగతరథాంగాది పతంగారావ ఘుమఘుమిత సరోవరంబును బాలాతపసేవనోత్సుక జలమానుషీ పరిమృదితమృదులసికతామయసంగత పానీయపానార్థసమాగతనిమజ్జనోన్మజ్జన సజ్జీవభవన్మదభర వనగజనాద ధారాస్తబకితోదకదనంబును నవనవభవత్సవనభవనభూమహోమధూమ పశ్యామీభూతదిశాకాశానకాశంబును ప్రవర్ధమానాధ్వరసకుత్సవ సమాగత శతముఖముఖ నిఖలసురవర పరిషదభిరామంబును కుసుమవిసరసమిత్కుశ విలసత్కంద మూలఫలాహరణార్థము వాంఛితాహూయమాన మానిసంత్రాసకలకల నినాదమేదురంబును విశ్రుతశ్రుతిస్మృతీతిహాసపురాణ కథాకథన చతురయతివరవిరాజితంబును కౌండిన్య కణ్వ మార్కండేయ కపిల శాండిల్య వత్స మాండవ్య శౌనక మైత్రేయ చిత్తి

కార్యకారణ భోక్తృభోగ్య నియంతృనియామ్య వ్యాప్తవ్యాప్య వ్యాపక జ్ఞాతృజ్ఞేయ స్వామి భృత్య ధార్య ధారక రక్ష్యరక్షక త్వాది విశేషంబులఁ జేతనాచేతన బద్ధముక్తాదికృత నానావిధ నటనములు లీలావిభూతిం జేయుచు నుత్పత్తిస్థితిల ను జ్ఞానాజ్ఞాన బంధమోక్షంబు లెఱుంగకుండు మఱియు “యథోర్ణనాభిస్సృజతే గృహ్ణాతిచ” అని యూర్ణనాభి శరీర ప్రధానోపాదాన కారణంబునఁ దనయందుఁ దంతువర్గంబు సృజియించి, బుద్ధిప్రధాన కారణంబున నాతంతువర్గంబు గూర్చి తత్తంతుగ్రసనంబు జేసినగతి, నప్పరశివుండుపాదాననిమిత్త కారణద్వయ భూతుండై జగదుత్పత్త్యాదికంబు లీలావిభూతి చేసి చేయుని వానిచందంబున నుండు, మృత్తిక పిండరూపంబై యనంతరంబున జలాహరణాది క్రియాదిక కులాలకారంబున ఘటాకారంబై తదాకారంబున కార్యరూప ఘటభా

[illegible]

థా... స్తథా [illegible] యగుచు! సర్వప్రయోజన[illegible] ఖ్యం హియజ్జగత్। ఏవమేవ సర్వభూతాత్మా విశ్వరూపోయతోవ్యయః” అన్న న్యాయంబున నానావిధోపాదుల సర్వేశ్వరుండు నలరుచుండు, సూర్యుండు జలదర్పణాదుల స్వప్రకాశ భూతప్రతిబింబమై జలాద్యుపాధిగతమయ్యును చలనాది వికారంబులఁ బ్రతిబింబ మార్గంబునఁ దత్తద్వికృతులఁ జెందని తెఱంగున శ్రీమత్పరమశివుండు నానావిధ ప్రపంచంబు తత్తద్రూపంబులు దాల్చి భోక్తృభోగ్యాది విశేషంబులఁ బ్రకాశింపుచుండి స్వావినాభావ సామర్థ్యంబున నసించునని బోధించి శివభక్తుల మాహాత్మ్యంబు జెప్పెద నాకర్ణింపుడని యిట్లనియె. ౧౬.

## మందరుండను బ్రాహ్మణుని చరిత్రము.

గీ. సకల ధనధాన్యరత్నవ • స్త్రప్రశస్త
విప్రముఖవర్ణ వేగవ • ద్వాతిసుద
సామజస్యందన పదాతి • సహితమగుచు
నవనివెలయు నవంతిరా • జ్యంబుకడిమి. ౧౭

క. ఆదివ్యనగరమున నొక। భూదేవుండు బహుపదార్థ • పూరితగేహా
మోదంబున దగి సకలజ। నాదరణీయుండయి మంద • రాఖ్యుఁ డనరెన్. ౧౮

క. హుంకారయుక్తుఁడై పలు కట్యంకారకు లీడఁబఱచు • నాగతవిత్తా
లంకార వైభవంబున। శంకారహితుండయి తిరుగు • సత్యేతరుఁడై. ౯

క. ఆరమ్య పురమునందొక। వారాంగన సౌరవార • వనితాజనతా
సారస్యమ లరిపింగళ। నా రూఢాఖ్యను వహించి • నైపుణి నసరెన్. ౧౦

వ. అది యొక్కనాఁడు సకలాభరణ భూషితయగుచు రాజమార్గంబున నరుదెంచు నెడ. ౧౧

క. చూచి తలయూఁచి మందరుఁ। డాచతురతరయానవిలాస • మాత్మనిడుచుమున్
నీచాతినీచుఁడై తా। ద్వ్యవిక్రంసానుమతిని • వర్తిలఁ దలఁచెన్. ౧౨

క. ఆ కాంతామణి పూర్వము। నైకాంతిక మతియునయ్యు • నా విప్రునియం
దాకలిత చిత్తయయ్యుఁ। బ్రాక్తన విధివశతఁ దాట • రాదెవ్వరికిన్. ౧౩

వ. ఇవ్విధంబున నాపింగళయను వారాంగన మందరుండను ధరామరుని రతికేళీ మందిరంబున నునిచి తత్సంపదాకర్షణశీలయై యుభబంధ, ధేనుబంధవ్యానత కరణాదిబంధ విశేషంబుల వలనను అంగుష్ఠపదగుల్ఫజానుజంఘనాభివక్షస్స్తన కంఠకపోల దంతాధర కర్ణనాసికామస్తక స్థలంబులు కళాస్పదంబులని యెఱింగించి యుత్పలపత్ర మయూరపదతగాదినఖక్షత విశేషంబులను రతిగతులను ప్రౌఢమార్గంబు నొందించి నక్తందివంబులు విషయాసక్తుం జేసి సంగీత నాట్య విద్యా నైపుణ్యంబుల సంతుష్టాంతరంగుని జేసి స్వాధీనుంగా నొనరించిన. ౧౪

గీ. ఇటుల నాతండు దానింట నిష్టగోష్ఠి
వెలయుచుండఁ దపోధర్మ • విశ్రుతుండు
ఋషభుఁడను శివయోగీంద్రుఁ • డేగుదెంచె
విప్రపుణ్యంబు మూర్తీభ • వించినటుల. ౧౫

శా. ఈరీతిన్ ఋషభాఖ్య నొందు శివయో • గీంద్రుండు రాఁజూచి యా
వారస్త్రీమణి బ్రాహ్మణుండు గురుభా • వంబేర్పడన్ జిత్రవ
ర్ణారూఢంబగు కంబళాంబర వృతం • బైనట్టి పీఠంబుపైఁ
జేరంజేయుచు భక్తిపూర్వకముగం • జిత్తంబు రంజిల్లఁగన్. ౧౬

క. అమ్మహనీయుని పాదా। బ్జమ్ముల సీతమ్ములైన • జలములచే మో
దమ్మున గడుగుచు నైజశి। రమ్ములపై జల్లుకొనితి • రమ్మగుమతిచే. ౨౭

గీ. కుశలము వచించి యాయోగి • కుంజరునకు
గంధ పుష్పాక్షతాదిస • త్కారవిధుల
బూజలొనరించి హృద్యమౌ • భోజనంబు
పొసఁగ నొసఁగినఁ జేవార్చి • పొలిచియున్న. ౨౮

సీ. చీనిచీనాంబరా • స్తీర్ణమౌ పాన్పుపై
నింపుగా మునుబవ్వ • ళింపజేసి
యమగులొత్తుచునప • ర్యావిశేషంబుల
నలరింపుచుండగ • నమ్మహాత్ముఁ
డత్యంత ముదితుఁడై • యారాత్రి నివసించి
స్వస్థానమున కేఁగ • జనినపిదప
సమయమవ్విధమున • జరిగిన నవ్వైశ్య
కర్మార్జితంబైన • గతివహించి

గీ. దేహమొడలిన నతఁడు భూ • దేవుఁడటుల
నంతమొంది దశార్ణదే • శాధినాథు
వజ్రబాహుని భార్యయై • వసుధ బరగు
సుమతి యనుదానిగర్భంబు • జొచ్చిపొలిచె. ౨౯

—: మందరుఁడు దశార్ణదేశాధీశు భార్యయం దుద్భవించుట. :—

గీ. అనుమతి గర్భమున పూర్వ • మస్మదుక్త
మందరుండను విప్రుండ • మందవిషయ
పరుండయి బహురోగ • వశతనొంది
నిధనమొందుచు జాలయి • నిలచెనపుడు. ౩౦

చ. ఎసనిన గర్భభారమున • నేచిన యాచిగురాకుబోడి మే
న్గనుగొని తత్సపత్నులుమ • నంబుల రోషముదోప తన్నిహం
సన మొనరింపఁ జాలినవి • షంబు మొసంగగ జేయ నామెయు
వ్వసట నెఱుంగక ఁ రుచిర • వస్తువటంచును గ్రోలనయ్యెడన్. ౩౧

కృశియించి దుర్దశా • వశతచే నొకకొన్ని
నెలలు సాగుచుననా • నృపవరుండు

గీ. వీరి రోగము మాన్పనె • వ్వారి తరము
సతిసుతులు జీవమొందియుఁ • జచ్చువార
లంచు మదిలో విచారించి • యంతకంత
కంతకొంగిన వారకై • చింతనొందె. ౩౯

క. ఈగృహిణీతనయులు నర! కాగతులై కాంచిచో ను • మారోగములన్
జోగుచు నేడ్చుచునిద్రా! త్యాగము నొందింతు గాని • తాంతవ్యథచే. ౪౦

వ. అదియునుంగాక,

క. మృతిఁబొందక జీవించుట! కతిశక్తులు గారువీరు • హతభోగులుగా
సతలంచెద నొక్కటి మది! నితరము దలపోయవలవ • దిట్టిపనికైనె. ౪౧

ఆ. అనుచు దత్సుపత్ని • యందు తదాత్మజు
నందుఁ సక్తుఁడగుచు • గుందు నృపుడు
దారపుత్రులనుర • థంబుపై నిడుకొని
యడవిఁజేర్చు సూత • యనుచు బలికె. ౪౨

క. ఆసారథి వేసారక! యాసారసముఖిని సుతుని • హాదుర్గపథా
వాసుల సత్తాసులహా! ర్యాసులఁగావించి మరల • వచ్చెన్పురికిన్. ౪౩

సీ. ప్రశస్యరత్నస్థల • ప్రశస్యశ్రీప్రాకార
ధ్వస్త జీర్ణచ్ఛద • స్థానమగుచు
నిర్గతవ్యథ్వసి • ర్నిద్ర గత్యధ్వనీ
నాధ్వజాతాయన • హారిణమగుచు
గ్రావకస్తదు • ప్రస్పష్టకోద్ఘటనో
చ్చైస్స్వనస్నిగ్ధర • స్థగితమగుచుఁ
ఘటకోటరరటత్క • రటమాఖాండజపత్ర
పటపటత్కార సం • భరితమగుచు

గీ. నడరు బహుయోజనాద్వార • హార్వతిప్ర
భానభిజ్ఞమహా మృగ • స్థానమగుచు
భూతభేతాళరావ ప్ర • భూతదురవ
గావ గహనంబు నారాజ • కాంతజొచ్చె. ౭౭

వ. అదియునేలా, లవంగ, తక్కోల, గంధసార, ఘనసార, కాక,తుండ, కాంచ
నా, లికుచ, కంటకీ• ఫలః బిజ్జల, పాటల, ఫలినీ, జటిల, గంధికా, కురంట,
క,కోవిదార, బంధుజీవిక, దాడిమా, శ్వకర్ణ,హస్తికర్ణ, చాంపేయ, తాలపరి
లాంగలి; సదాఫల, తమాల, నారికేళ, హింతాల; ఖర్జూర, కర్బుర, తిందుకా,
శ్లేష్మాత్మకీ, విభీతకీ, హరీతకీ, భల్లాతకీ,వాక్షప్పిప్పికా, ఖదిర, శాకోట, కాలాగ
రు, కాల్వగంధ, చించా, దుంబ, రచలదళ, శమీరుచక, కుటజాది వృక్షభే
దంబులు గలిగి సంతతాభంగ రంగత్తరంగిణీ రోధప్రపరూఢపు వేతసీకుహర
విహర దపరిమిత గండభేరుండ సింహశరభ శార్దూల భల్లూక వానరసృగాల
వృకాదిమృగ వ్యాపారంబును బహువిహగ నాద మేదురంబనగునచ్చట. ౭౮

మ. బహుధాధావదనేక భీకరమృగ • బ్రహ్మాణ్య వర్ధిష్ణునా
వహుతాశావృత తార్ణభూచిటచిట • స్వానంబుచే నుల్కుచున్
జహిహిత్వాత్స్వత మస్మదభ్యవహృతి • స్థానంజవాదంచుబై
నహహేత్యుక్తుల దానవుల్ గదియదు• • ఖార్థిన్ వడిన్ బోవుచున్. ౭౯

చ. అతివనితాంతచింత నుతు•ధాతతత్సృణ్మలచేత భీతయై
సుతునివహించి యించుకయు • సోలుచు వ్రాలుచు కాలకున్ ధరా
పతనము నొందఁజేయును న • పారపుఖేదము నూనుచు న్వరా
కృతమగు కర్మమెన్ని శమ • కింపుచు నూర్పులు సందడింపగన్. ౮౦

మ. పదరుక్కృత్కఠినోగ్ర కంటకశిలా • ప్రాయంపు త్రోవన్ మహా
పద నొందున్ బ్రపదప్రముక్త కనయై • ప్రత్యగ్రజాగ్రద్బలో
న్మదవద్బంధుర గంధసింధుర మిళ • న్మార్గంబు గన్గొంచున
మ్మద మొందున్ దరిమేరలేని పదవి • న్మల్లాడుచున్ బోవుచున్. ౮౧

వ. మఱియు.

శా. భూతప్రేత పిశాచ ఢాకినులచే • భూరివ్యధల్ జెందుచున్
యాతాయాత విలేశయంబులకు భీ • వ్యావృత్తి బెంపొందె భూ
జాతస్ఫీత నికుంజ పుంజను లలో • సంచారముల్ జేయుచున్
భూతాభూత కృశాంగి యావనములో • దూరంబుగా నేగగ.

క. గోరథవాజినగస్త్రం • బీరమయుత వైశ్యపదము • ప్రేమంగనిదై
వారంభ యత్నమునన౯ భోరుహలోచనయు బోవ • బోవగ్రామాలన్. ౫౦

సీ. ధనకనకవస్తువాహనో • దంచితంబు
నమిత మణిగణ విపణిమా • ర్గాన్వితంబు
విప్ర నృపవైశ్య శూద్రప్ర • వీణమైన
నొక్క వైశ్యపురంబును • నువిదజూచి.

క. ఆపురమునఁ గాపురమై। చూపట్టెను పద్మకరుడు • సుమహితనానా
భూపశ్రీపతికరుణల్। రైపతియై వైశ్యకులజ • రత్నంబగుచున్. ౫౧

వజ్రనాభ రాజభార్యయైన సుమతిపద్మకరుఁడను వైశ్యునియింటికి జనుట.

సీ. పూర్వోడి తత్పురం • బునకు నపుత్రయై
చనియెఁ గృశీభూత • తనువుదాల్చి
చనిన తజ్జనపాలు • సదనంబున వసించు
నొకదాసి యారాజు • యువతివార్త
నెఱిఁగి యవ్వైశ్యాధ్యు • నెదుటను గొనిపోవ
నతడు రుజాపీడి • తాంగియైన
నృపపత్ని వీక్షించి • నిపుణుఁడై యోకాంతి
మలర తద్వృత్తాంత • మంత యరసి

గీ. యహహ కష్టంబనుచు మది • నబ్బురంబు
నొంది నిట్టూర్పు నిగుడించి • యోగ్యమైన
తనదు గేహంబులోనన • త్తన్విమంచి
గారవంబెనయించుచు • గరుణతోడ. ౫౩

గీ. ఎప్పుడు గర్భస్థుఁడో దేహి • యప్పుడెనాక
ర్మంబు కల్పితమయ్యెను • కర్మంబుగాఁగ
దైవ వశతను జీవించు • దైవవశత
మరణ మొందును జంతువీ • ధరణిలోన. ౬౮

సీ. ఉదరస్థుఁడై కొంద • ఱుదయించి కొందఱు
ముదియక కొందఱు • ముదిసి కొంద
ఱంతంబు నొందుచు • నలపురాతనకర్మ
గతిపుట్టికొ యట్టి • గతివహించు
దేహంబుఁ బొందిత • ద్దేహానురూపంబు
లగు సుఖదుఃఖాదు • లనుభవించు
మాయానుభావప్ర • మాణంబుచే స్త్రీలు
పురుషులు సుర తాను • భూతిఁ జెంది

గీ. కలసియుండిన దైవయో • గమున జంతు
వుదయ మొందుచు సమ్యగా • యువు సుఖను
దుఃఖమును పుణ్యపాపంబు • దొడరశాస్త్ర
ధనములను బొందుచుండును • ధాత్రిలోన. ౬౯

గీ. వనజభవుఁడు లలాటంబు • లను లిఖింప
తదనురూపంబుగా దేహి • దనరుచుండు
కాలకర్మంబు లవిలంఘ్య • గతివహింప
భావముల నిత్యములు దుఃఖ • పడగనేలా. ౭౦

గీ. స్వప్నమున సౌఖ్యమెక్కడ • సమ్యగింద్ర
జాలమున సౌఖ్యమెక్కడ • శారదాభ్ర
మునకు నిత్యత్వమెక్కడ • తనువులకును
నిలుకడెక్కడ లేదని • నిశ్చయింపు. ౭౧

క. *శతకోట్యాయుతసంఖ్యా। మితజన్మంబుల నతిక్ర • మింపగనాశా
శ్వతపరతత్త్వంబెఱుఁగమి। నతినీకిభ్రమ జనించె • సాధ్వీ నమోసఁగఁగ.

* శతకోట్యాయుత మని అచ్చుప్రతి.

గీ. మృతుఁడగుచుఁ బునరుద్ధాన • + మొసఁగెననుచు
వైశ్యపురమున నివసించు • వారలెల్ల
విస్మిత స్వాంతులై వచ్చి • వెరగునొంది
మించు సమ్మోదమున నిల • నిలిచియుండె. ౯౨

గీ. అప్పుడానంద రసవిహ్వ • లాంగియగుచు
దనయునిఁ గ్రహించి కౌఁగిట • తా సునేత్ర
యగుచు నాలింగనము చేసి • యాత్మయు దాత్మ
నలరి తన్ను నౌరు నెరుంగ • దయ్యె నంత. ౯౩

వ. మఱియు నావృషభ శివయోగీంద్రుండు నారాజపత్నీ తత్పుత్రుల విమ్రవ ణావృతంబులైన శరీరంబులఁ దద్విభూతి స్పృశించిన నయ్యిద్దరు దివ్యతనువుల ధరించి బహుపుణ్యకర్మంబుల యేదేవతైశ్వర్యసుఖంబు గలదో దానికంటె శతగుణంబుగల సుఖంబునొంది యమ్మహాత్ముని పాదపద్మంబులపై వ్రాలి నన తండ్రీ! యో రాజపత్నీ; నీవు బహుసంవత్సరంబులు జీవింపుచుఁ దాపంబు నొందక జయంబు జెందఁగలవు. నీకుమారుఁడు భద్రాయువను నామంబు ధరియించి నిజరాజ్యంబు పాలింపుచు ఖ్యాతినొందఁగలఁడీవైశ్య గృహంబున సకల విద్యలు గ్రహించి యవ్వనాభిరాముండగు పర్యంతంబు నిల్వందగునని వచించి యా యోగీంద్రుఁ డతిఁగెనని సూతుండిట్లనియె- ౯౪

క. ఏపూర్వంబునఁ జెప్పిన • నాపింగళ కృష్ణపింగ • ళాఖ్యశివార్చా
దీపితమై తొలుతను నిరాకరణమొందంగఁ బుణ్య • పరతఁ దలిర్పన్. ౯౫

—:సుమతియొక్కయు దత్పుత్రునియొక్కయుఁ బూర్వజన్మ వృత్తాంతము:—

సీ. చంద్రాంగదుండను • జనవల్లభుని భార్య
యైన సీమంతిని • యనెడుసాధ్వి
కుదయించి ప్రతిదినా • భ్యుదయరూపౌదార్య
సుగుణ గణోపేత • సురుచిరాంగి
యై కీర్తిమాలిని • యనునామమున భూమి
వృద్ధిబొందెను గుణ • వృద్ధులెన్న
భద్రాయువును వైశ్య • పతితనూజుండు న
య్యంబువు నృపతి • బింబములన

+ మొనసెననుచు శా-ప్ర

గండపెండేరముల్ • కటినంపు గొలుసుల
దగిలిన శునకముల్ • జిగురుగండె
లలరెడు తడకలు • నప్పంపు సందివా
టులు వలలు మసుడి • యలునువంకి
కత్తులు శూలముల్ • ఖడ్గముల్ పట్టిన
ములుకాంతములు భల్ల • ములు చెలంగ

గీ. కటికుమిగాసాలు కొండేల • నగరుసేయ
గాత్రములు కొండ్రనెక్కులముల్ • కప్పుకలవ
కాసెలును గట్టి గొడ్డంపు • గలిగెనంచు
వాండ్రు జనుదెంచి రయ్యెడఁ • దీండ్రముగను. ౧౦౦

సీ. వరరక్త సితవర్ణ • వంశోద్భవంబులఁ
బీతవక్షేత్ఖసం • జాతములను
గురుకర్బురద్యోత • కాంభి కుంభములను
నీలవర్ణాహిస్ఫు • టాలయముల
జ్యోతీరుగంబుము • గ్జాతసంభవముల
శ్యావద్యుతివరాహా • జనస్యములను
ఖర్జూరదీప్తిశం • ఖసముద్రితంబుల
మహితగౌరప్రభా • మత్స్యజముల

గీ. కలితదీధితి శుక్తి • ప్రకాండజముల
కరములను బూని ముందు • పగ్రాహ్యములుగ
రాజదర్శన లాలసోల్లాస • మలర
నేగుదెంచి తదాజ్ఞచే • నెదుటనిల్చి. ౧౦౧

క. నతికి జోహారొనరించిరి! పతికిఁ వితరణగుణునకు• భాస్వన్మతికి
స్మృతికిఁ ఘనతేజోహా! కృతికిఁ సశతాభి యూతి • రాజవినుతికిన్. ౧౦౨

వ. ఇట్లు మ్రొక్కి నిలిచి. ౧౦౩

క. జేజేజేజేసామీ! యా జేజే లేనివ లె నొ • యారంబలరం
గాళినములఁ బాలింపుము! మా జీవములీవసుమ్ము • మానవనాథా. ౧౦౪

అని వచించిన. ౧౦౫

గీ. వారిఁ గన్గొని మన్నించి • మీరిచటికి
నేఁడు కోరక వచ్చితి • రిచటనుండు
వారు మీ పేరు పెంపు నే • ర్పాటుగావ
చించుడనఁ బల్కె • నందొక్క • చెంచుఱేఁడు. ౧౦౬

సీ. చెలువగు బ్బలిని ని • చ్చలు వసించుచునుండి
తిరిగొండమీఁదని • తత్తఱించి
చుట్టుఁగొండ మోకాలఁ • జుట్టుకొంచు మొలంగి
జాళువాతిప్పపై • జాలువారి
వెండి మెట్టుకుఁజుట్టి • వెండియు విహరించి
సిరిగందపుంగట్టు • సిరిహరించి
ప్రొద్దుపొద్దునఁ బూనే • ప్రొద్దుసంబరమొంది
గ్రుంకు రా పైనిటుఁ • గ్రుంకుచలమి

గీ. ఇంపుగల సొంపుటడవిని • దంపునడక
లడర నాడాడ దిరుఁగుచు • నవనినాథ
నిన్నుఁ బొడఁగని పెనుమొక్క • లున్నచోటు
దెలియ వచియింపవచ్చితి • నులవుమీర. ౧౦౭

గీ. అయ్య వైవస్వతకుమారుఁ • డందుఁబుట్టి
శ్వానకిశోరంబు లగుచుమ్మ • ద్దామబలము
గలుగు శునకంబులిగంవు • తులకు రాక
దక్కినప్పుడు దిక్కునవసించె • నుక్కుదక్కి ౧౦౮

గీ. దేవరా, క్షేత్రపాలక • దేవుఁడొక్క
భవక మీగంగ గన్గొని • పారిపోయి
యెచటనుండెనో కానిమా • కెరుక లేదు
తెలియఁజెప్పెద వీరిఁ స • త్తులను జగతి. ౧౦౯

వ. ఇట్టుల వాహ్యాళి సముత్సవంబునకో హాటించి, చటులభాసురచంద్రహాస ప్రా
సశరాసన భిండివాల కరవాలతోమర పరశుపట్టసకుంతశూల ముద్గరగదాది
సాధనంబులడర, తద్బలసహితుండై, గిరిసరిదుపవన జనపద దుర్గంబుల ని
క్రమించుచుఁ దత్పురింత సైన్యకలకల నినాదాకర్ణ నేపస్థత్రః కుంజపుంజంబుల
నరయుచుం జని ముందట. ౧౨౨

సీ. ఉడుపథోత్కటశాఖా • ఖోపశాఖాశిఖో
త్కటజటాపటలవ • త్కటసమూహ
ముభయ తీరప్రపా • తోల్లలత్కల్లోల
గుంభశుంభత్సరో • జృంభణంబు
సనోత్ర్యస్త జన్యత్ర్య • ద్ధర్యక్ష వీక్షణ
తరసద్యః తతరక్షు • సంచయంబు
సమిత శుండాదండ • హతదండ సంతాన
ఘానదుద్దండవే • దండనికర

తే. మమిత సంప్రౌఢ కుటజకు • సుమసముదయ
మత్యుదార తరుజమనో • హరఫలంబు
లమరవర్యులకున్ గోర • నలవిగాని
గహనమయ్యెడఁ గనుగొని • మహివిభుండు. ౧౨౩

సీ. హారాయితోభయ • ద్వారసిలాసమా
సక్తముక్తాలోక • సమద సింహ
కులిశవేల మదపూరి • తాశేష నిర్ఝర
బింబితాత్మోన్మకుం • భిప్రకాండ
మనుగళద్ఘోరదం • ష్ట్రానీల నఖముఖ
దారితముస్తాత • టోరుకోల
మగణిత నగభేద • నాభంగ తరశృంగ
సంఘటితాటవీ • సైరిభచయ

గీ. మనుపమాభ్రాభనఖరపం • చనఖఖడ్గ
గంధ గంధర్వశంబర • బంధురతల
మగుచు నగభేది సాను • తెగడి నిగుడు
విపిన మార్గంబు గనుగొని • నృపవరుండు ౧౨౪

సీ. ప్రాణసంకటము సం • ప్రాప్తమై యుండినన్
సత్యంబు విడనాడ • జనదు తలఁప
రమణి గోబ్రాహ్మణ • రక్షణార్థంబుగాఁ
బుడమిలో నొకవేళఁ • బొంకవచ్చు
పరభామినులయందుఁ • బరవిత్తములయందు
భువి దేవవిప్రవ • స్తువులయందు
తృష్ణను విడువుము • తత్కృష్టబాహుబలాఢ్య
దంభంబు సర్వదా • తలఁపవలదు

గీ. సత్కథలయందు సద్వ్రతా • చారవిధుల
సత్పథములందు ధర్మాది • సంగ్రహముల
నిత్యమును తృష్ణనుంచుము • నిరుపమాన
హృదయ వచియింతుఁ గొన్నిటి • సదయమతిని. ౧౪౭

సీ. స్వాధ్యాయమున స్నాన • జపహోమ పితృ తర్ప
ణాతిథి గోబ్రాహ్మ • ణార్చలందు
నలసత్వము వహింప • నర్హమార్గము గాదు
ముందుఁ గ్రోధము ద్వేష • మును భయంబు
నలజాడ్యమై శూన్య • మనసాగ్రహంబు కా
టిల్యంబు మోహంబు • తీవితోడ
నుద్వేగమును వీడు • టొప్పు క్షత్రియధర్మ
మెనసియు వృద్ధుల • హింసవలదు

గీ. శుష్కవైరంబు కూడదు • సొంపనుచుమ్ము
పానులాపంబు పరనిందలఁ • బూనఁదగదు
గాన నీవింక బహుధర్మ • గతులు గలుగు
పథమును మనంబులోఁ దల • పంగవలయు. ౧౪౮

క. సఖులందు మైత్రియుంచుము। సుఖులందు దయానువృత్తి • జూపందగునో
సఖ; పుణ్యవంతులందును। నఖిలము మెచ్చంగ మోద • మలరింపఁదగున్.

క. వ సికుబుద్ధులయందౌ। దాసీన్యము నుంచి తిరుగఁ • దలపుము సద్గ్రం

ధాసక్తిగలిగి సురుసే। వాసక్తుం డయ్యోనేని • హర్షముదలంపన్.

క. అత్యాహారమతిశ్రమ। మత్యాలాపంబు మఱియు • నతికోపంబా
ద్యత్యంబతి వీర్యముభువి। నిత్యమతిక్రీడసలుప • నీకుదగదాగిన్. ౧౫౧

క. అతివిద్య యతిశ్రద్ధయు। నతిపుణ్య మతి ప్రీతియును • నత్యుత్సాహం
బతిధైర్యంబతికీర్తియు। సతతము గడియింపవలయు • సౌజన్యనిధీ ౧౫౨

సీ. మోహాక్రన్నిజవరా రోహాసమభిలమ
త్స్యాంతంబుతో నున్కి • జనుదలంప
నత్యాహితపరిద్రవత్యవస్థాతుని
స్వర్ణాణంబొనరింప • దగుదలంప
గణ్యాంబులైనట్టి • పుణ్యాంబులందు తా
భ్యస్థితి వర్తింప • నగుదలంప
సభ్యేతరాధర్మి • కేభ్యసంఘమునందు
సాభ్యసూయుండౌట • నర్హయుక్తి

గీ. చండమతి హిండితాత్మసా • మండగణము
నందు విద్వేషుఁడగుటపెం • పొందుఁదలఁప
సజ్జనులమీఁద ననురాగ • సహితుఁడగుట
యుక్తమగుచుండు వివరింప • నుర్విలోన. ౧౫౩

సీ. తెలివిఁమీఱఁగఁబ్రిక్రి • త్రిప్రత్యయాంబుల
ననురక్తి గుణవృద్ధు • లరసియరసి
ప్రబలపరాదేశ • పదవిభక్తులసంధి
విగ్రహాంబులచక్కి • వెలసివెలసి
పటుపరరూపని • పాతంబుల రసిత
ధ్రితవాక్యముల మేలు • దెలసి తెలసి
సురుచిరాగమముఖ • సూత్రాన్వయార్థప్ర
త్తులసమున్మ్రసంబున • నలరియలరి
గీ. గురుసమంచదహీన • వాగ్గుంభనముల
నలరు చలజాతినిగ్రహ • ములవితర్క

గతులుగల రాజనీతిప్ర • కారమరయ
వలయు భూపాలతనయ యీ • వసుధలోన. ౧౫౪

క. కాపాలికలో కాయతి। కాపత్యత్వాగతదగ • యూతిగులందుఁ
దీపించి తత్పథముదూ। రాపాతనమొందఁజేయు ♦ నగుశలపోయుఁ. ౧౫౫

క. నిర్మర్యాదాభిజ్ఞులు! దుర్మంత్రులు బోధఁజేయు • దుర్బోధము చే
ధర్మంబు దప్పఁగూడదు। ధార్మికమార్గానువర్తి • తతనతీర్తి ౧౫౬

క. వర్ణవ్యావృత్తిస్థితి। గర్ణేజవనిర్ణయప్ర • కాకోక్తులనా
కర్ణించునెడలబధిరో। దీర్ణత్వము నొందలలయు • దీనసిధానా ౧౫౭

క. క్రూరశఠదంభ ధూర్త వి। హారకితవచపలపతిత • నాస్తికజిహ్మా
త్మాయూధులఁ గన్నంతనె। దూరముగాఁ దొలఁగవలయు • దూషితకలుషా.

సీ. పంతతాత్మప్రశంం • సారక్తుఁడవుగాక
విజితేంద్రియుఁడవుగా • విశదమతిని
పుత్రమిత్రకుటుంబ • ములనొకప్పటికిన
త్యాసక్తుఁడవుగాక • యలరవలయు
సాధ్వీత్వమొందిన • జాయవాక్యములందుఁ
బిత్రుభాషితములందుఁ • బ్రీతివెలయు
సద్గురూక్తులయందు • సర్వదావిశ్వాస
ముంచంగవలయునో • యురుగుణాఢ్య

గీ. మాత్మరక్షావరశ్యంబు • ప్రమత్త
తయు దృఢవ్రత బుద్ధియుఁ • దగఁజరింపు
మాత్మపై మీఁద నైననొ • కప్పుడైన
వలదు విశ్వాసముంచంగ • వర్ణనీయ. ౧౫౯

గీ. అవని వారలోలు సన్యాసి • యైనవిశ్వ
సించనేనియువాని హిం • సింపఁబాదు

మాయలేక చరించిన • మనుజానంము
శంక జేయంగవలవదో • జనవరేణ్య! ౧౬౦

సీ. స్త్రీల బాలురవృద్ధ • కృశహీనాశ్వనాథుల
నపరాధ రహితుల • నవనిలోన
బుద్ధిబలప్రాణ • ములశక్తిబలమున
నరసిరక్షించుము • యతిమూఢమున
సత్యంబు వలనసు • జలియింపగూడదు
మానన యోగ్యుండైన • యతివరుండు
శరణాగతుండైన • జంపంగవలవదు
పాత్రుండైనను మన్న • పాత్రుడైన

గీ. నీచుడగునేని మఱి • మహనీయుడేని
యెవ్వడైనను యాచించె • నేనివాని
కొఱకు శిరమైన నొసగుచు • గురుయశంబు
నొందు మఱియత్నమున సదా • యుర్విలోన ౧౬౧

క. నరపతులకుఁ గోవిదులకు। ధరఁగీర్తియె భూషణంబు • తత్కీర్తియె ప్ర
స్ఫురితమగులక్ష్మి తత్కీ। ర్తిరతింబుణ్యంబుగలుగు • ధీరవిచారా. ౧౬౨

క. అవనీశతనయః సంతత। కవిసన్నుత చంద్రచంద్రి • కలకెటువలెనో
యవినాభావంబటువలె। నవనిజనము కీర్తిచేత • నలరుచునుండున్. ౧౬౩

క. రాజాశ్వమేధమనఘమణి। రాజని గుప్తక్రియలను• రక్షింపమహా
రాజః యకీర్తినిపతితో। త్తేజితసర్వేశబువిడుము • తృణగణనుబలెన్. ౧౬౪

ఆ. మాతృకోపంబు జనకున • మన్ననముగు
రుప్రతిఘ్నశైవ్యయుంబు పు • త్రులవలనను
ప్రాప్తమగు నపరాధంబు • ప్రాహ్ణణాప
రాధమునసహింపవలయునో • రాజ్యకాంతా. ౧౬౫

చ. ఎటువలె నైన విప్రతతు • లెంతప్రపన్నత నొందుచుందురో
యటువలె వారికీప్సితప • దార్థ మొసంగ పోసంగు రాజసం
కటపడుచున్న వారల నొ : కానొక వేళఁ గడంగి యుద్ధరిం
చుట నిజమై చెలంగుఁ బరి • శుద్ధగురూదిత బోధసంయుతా. ౧౩౬

శా. ఆయుఃకీర్తి బలంబు సౌఖ్యధనవు • త్యాస్త్రీప్రజల్ పూర్వక
ర్మాయత్తంబులు గాన నేదిజనితంబై • ప్రాప్తమౌ దాని ని
చ్ఛాయుక్తిఁ భజియింపు కాలమును దే • శంబుఁ బ్రసక్తిన్ సదా
స్ఫాయత్కౌతుక కార్యముల్ జనము మె • చ్చం జేయుచే మేలగున్. ౧౩౭

గీ. ఎవ్వనికి బాధ జేయరా • దెంచిచూడ
బరుని బాధ నివారింపఁ • బడదలంపు
శాత్రవులఁ జోరులన్ దుష్ట • సంచయముల
శక్తి గాలఁదిని బాధింపు • జనవరేణ్య. ౧౩౮

గీ. వెలయు పితృకర్మ జపహోమ • ములను స్నాన
మొనరఁ జేయుతతిన్ వేగ • ముడుగవలయు
భోజనము జేయుచో నిద్ర • బోవునెడను
సత్వరస్థితి నొందంగఁ • జనుఁదలంప ౧౩౯

సీ. దాక్షిణ్య యుక్తమై • తనరి యక్రూరమై
జనమనోహరమునై • సత్యమగుచు
నల్పాక్షరం బనం • తార్థమౌ వాక్యంబు
బలుకు మెప్పుడు గురు • భక్తిసహిత
ప్రీతిపార్థివులయందు • భయ మొందకుము గురు
శాసనద్విజపాప • చయములందు
భయ మొందుమీ జ్ఞాతి • బంధుమిత్రులయెడ
జామాతృజులయందు • సమతచేత

గీ. సంచరింపుము పంక్తిభో • జనమునందు
నటుల వర్తింప నగువిద్య • దభిహితోక్తి

శాస్త్రిగోష్ఠుల పుణ్యప్ర • సంగములను
ధార్మికులపైఁ బ్రజాభి • వృద్ధింబు పడయుం. ౧౭౦

క. పరిశుద్ధ పుణ్యమానస సగణిక విఖ్యాతిని ప • స్తయు మందుండాగా
త్పరు శివుని మందిరంబున। స్థిరతఁ బసియింపవలయు • ధీరవిచారా ౧౭౧

క. కాముక కులటాగణికా! స్త్రీముఖసంచార్త దుష్ట • దేశమునను ము
న్నేమరి పాటున నైనను। నేమరి వసియింపరాదు • విహితవివేకా. ౧౭౨

గీ. త్రిభువనేశ్వరుఁడగు మహా • దేవుభక్తి
నేదినంబున భజియింతు • వాదినమున
నకల దేవతలను మది • సంస్మరించి
పూజసేయంగ వలయునో • భూపతనయా. ౧౭౩

క. నిరతము శుచివై చిద్వి। స్ఫురబుద్ధిని నిర్జితారి • షడ్వర్గుఁడవై
స్థిరశాంత వతులమదిఁ। బారయఁగ నేకాంతవాస•మునసగుము నృపా. ౧౭౪

సీ. మునుత్రయీధర్మాబ్ధి • ముఖ్యాస్యవిప్రుల
శాంతులై నియమితా • స్వాంతులైన
యతులఁ బుణ్యాత్ములఁ • నతివృత్తులను బుణ్య
నదుల నదంబులఁ • బొదలుచున్న
పుణ్యతీర్థంబులఁ • బుణ్యసరస్సుల
వితతమణీరత్న • వృషభములును
సత్య పతివ్రతా • సముదాయముల నాత్మ
గృహదైవములఁ గూర్చి - సేవలంపు

గీ. భక్తిచేఁ బ్రణమిల్లుచు • బ్రహ్మసనయ
ములను మేల్కొని స్వచ్ఛాంబు • వులను గ్రుంకి
యాచమన మొనరింపుచు • నాత్మగురుని
కలరవందన మొనరింపఁ • నగుదలంప. ౧౭౫

వ. ఇవ్విధంబున్ బ్రవర్తింపుచు శ్రీమదుమా మహేశ్వరుల ధ్యానంబు సేయుమని
యమ్మహాత్ముని ప్రభావంబు మందర శ్రీకవచ పూర్వకంబుగా వివరించెద

నిష్ఠను సగుణనిర్గుణ ప్రకారంబుల దన్మాహాత్మ్యంబుల వివరించెద నాకర్ణింపు మని మఱియు నిట్లనియె. ౧౭౬

శ్రీసుఖదశుద్ధసత్త్వా। వాసను శివపార్వతీని • వాసను సుమహా
భాసమనాభాసముకై। లాసము దనరారుచిద్వి • లాసం బగుచున్. ౧౭౭

అదియు నాదిమధ్యాంత రహితంబును సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యంబును, నిత్యాపరోక్ష స్వప్రకాశావభాసితానంతకోటిసూర్య చంద్రానల లోకంబును, వేదశాస్త్ర పురాణేతిహాసాగమాగమ్యంబును బహువిధ కర్మధర్మ గుణనామ రూపవికార శక్తివిహీనంబు బ్రహ్మేంద్రాద్యమరాసురోరగ గరుడగంధర్వ కిన్నర కింపురుష సిద్ధ సాధ్యవిద్యాధర చారణాప్సరోయక్ష గుహ్యకఖేచరభూచర దేవర్షిబ్రహ్మర్షీశ్వర యోగీశ్వర మునీశ్వర వాగీశ్వరాద్యుపాస్యంబును, నిత్యనిర్గుణ నిర్వికల్ప నిరాకార నిరంజననిర్విషయాత్యతీంద్రియావాఙ్మనస గోచరాప్రమేయ శుద్ధబుద్ధ ముక్త కేవలాఖండ సచ్చిదానందమయంబైన తురీయాతీత పరతత్త్వ కైలాసంబున నవ్యక్త మహదాది సప్తావరణ వేష్టితంబును. చతుర్దశలోకకందర సుందరంబును సార్వభౌమాది హిరణ్యగర్భానంతానంద గండశైల భాసురంబును, భానుసోమనక్షత్రగ్రహతారకా పావకసౌదామన్యాది వివిధరత్న శర్కరిలంబును, ప్రవిమల వైరాగ్యోపత్యకాత్యంతముముక్షుతాధిత్యకా కలితఫలిత నిష్కామ కర్మోపాసన యాగయోగజపతపశ్శౌచ సత్యదయాశీల వ్రతదానాది నానావిధానోకహోద్యాన విరాజితంబును ఋషిత నిగమాగమాంత కల్పలతా విలసితంబును షడధ్వనమాధి సౌధవిభ్రాజితంబును పరమాధ్యాత్మ విద్యానంద జలాభిషిక్త నిర్మల చిత్తవృత్త్యంగణమును? తితిక్షాశ్రద్ధా సమాధాన మానిత్వాదంభిత్వాది కల్యాణ గుణమణిగణ రంగవల్లీ ప్రకాశితంబును నిరతిశయ కైవల్యభాండాగార శోభితంబును ఫలకామానాభాస స్వభావ నియత కర్మాచరణ చిత్తశుద్ధి సర్వకర్మ పరిత్యాగ గురుభక్తి శ్రవణమనన నిధిధ్యాసనాది సోపాన సమన్విత విజ్ఞాన రాజమార్గ లలితంబును పంచాక్షరీ మహామంత్ర మాణిక్య తోరణాలంకృతంబును ప్రణవనాద మంగళవాద్య రవపూరితంబు నగు తదాస్థాన మంటపాంతరంబున సర్వోపనిషత్సార భూతబ్రహ్మాత్మైకత్వరూపోంకార సింహాసనాసీనుండై శుద్ధసత్త్వ ప్రధాన మాయామయ దివ్య శోభన దివ్యవిగ్రహుండును సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వరక్షకత్వ సర్వసంహారకత్వాద్యగణిత సమగ్రసుగుణ పరిగ్రహుండును సత్య

జ్ఞానానంద స్వరూపుండునగు శ్రీమహాదేవుండు శ్రీమూర్తి మంతంబులైన షట్త్రింశత్తత్త్వంబులు ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు, హృషీకేశ్వర వాగీశ్వర సురేశ్వర నందికేశ్వర విఘ్నేశ్వర కుమారాది ప్రమథగణాధీశ్వరులును, బ్రహ్మ మహేశ్వర్యాది సప్తమాతృకలు స్వసాన్నిధ్యంబున నిజకరుణా కటాక్షంబు నపేక్షించి కొలువ. స్వస్వరూపానుసంధానలోకనంబు సేయుచు నాత్మారాముండై యుండఁ దదీయ వామార్ధ శరీరిణియుఁ బరాపర ప్రకృతిస్వరూపిణియు, నిఖిల జగదుపాదాన కారణభూతయు, నిఖిల లోకైకమాతయుఁ, ద్రిభువన గేహిని యు విశ్వమోహినియు, ధీముఖ జ్ఞానవిజ్ఞాన లోచనయు, వివేక విరక్తి యధర యు, విచార మందస్మితయు, సిద్ధాంత నిరహంతా హస్తయు, యోగ శోభా స్తని యు, సందేహ మధ్యయు, సంసార చక్ర నాభియు, రాగ ద్వేష జఘనయుఁ గామలోభోరుయుగళయుఁ సంకల్ప వికల్ప చరణయు, కాలానుగత కర్మయాన యు, వేదాంతవిద్యావ్యసన వసనోపరతి కంచుక ధారిణియు, రజస్సత్త్వతమో గుణ గ్రంథియు నీవి బంధ వేణుబంధ సురుచిరయు, ఫల త్యాగ పూర్వక వర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠానేశ్వర ప్రణిధానాద్యుపాసనేంద్రియాత్మ యు, నిగమస్థిర ప్రజ్ఞత్వాది సాత్త్విక గుణభూషణాలంకారిణియు, శుద్ధవాసనా వాసితయు, నిత్యానపాయినియునగు నమ్మహాదేవి వామభాగంబున వసియింప. వెలుఁగొందు నా యుమామహేశ్వరుల ధ్యానంబు సేయుమని మఱియు నిట్లనియె. ౧౨౮

క. నారాయణ మూర్తిం బొగడని శరీరము వచింతు. దాని • నాకర్ణింపన్
ఘోరతర పాతకంబులు దూరముగాఁ దొలఁగుముక్తి • దొరకొనుచుండన్.

క. అనివచియించిన ఋషభుని గనిసంశయము వెట్టినీవు • గరుణదలిర్పన్
ననురక్షింపుము శ్రీహరి ఘనతర సుగుణానుభవము • గరపి ముదమునన్.

వ. అనిన నమ్మోగీంద్రుం డిట్లనియె శ్రీమన్నారాయణ చరణారవింద భక్తియుఁ దదితర విరక్తియు. నీకు సంభవించు. నిందుకు సాధనంబు వినుము. సర్వాత్ములకు క్షేమహేతువగు స్వస్వరూప జ్ఞానంబు, తద్వ్యతిరిక్త వైరాగ్యంబు ని నిశ్చయింపఁబడియె, నదియెట్లనిన. నాత్మశుద్ధుండును. జ్ఞానానందస్వరూపుండును భగవచ్ఛేషభూతుండును, శిరఃపాణ్యాది లక్షణంబు పిండంబు, నాత్మవ్యతిరిక్తంబు గాని యాత్మ గాదు. యుపచయాపచయాత్మకంబగు దేహంబు ఘటాదికంబు వగిది నాశస్వభావంబు, ఆత్మ నిత్యుండని చెప్పి మఱియు నిట్లనియె.

సీ. అసహాయమర్థంబైన • యంగంబునందభి
మానంబుచేతన • జ్ఞానియైన
జనుఁడు తత్రాకృత • సత్త్వాదికక్రియా
మాణంబులైనక • ర్మములఁగర్త
ననుచు బద్ధుండగుఁ • ననయంబు తద్గుణం
బులు స్వకార్యంబులఁ • బొదలుకతనఁ
దానకర్త నటంచుఁ • దత్త్వజ్ఞుఁడగువాఁడు
దలఁచు నిస్సంగవ • ర్తనముచేత

గీ. నాత్మకీదృశ కర్తృత్వ • మరసిచూడ
లలితప్రాకృత కర్మము • లగుణయోగ
కృతముగాని విచారింప • గేవలస్వ
రూపకృతమనదగదవ • నీపతిలకా. ౧౮౨

ఉ. కావున నాత్మయందురతి • గల్గితదన్యము లందరక్తుఁడై
పావనమూర్తి శ్రీయువతి • భర్తృసమర్పణ బుద్ధిజేసి క
ర్మావళి నాచరింపుచు ని • రంతర తత్త్వల సంగకర్తృతల్
భావమునందుఁ జేర్పకవి • భాసిలునాత్మహితాభిలాషియై. ౧౮౩

సీ. అధ్యాత్మయోగని • ష్ఠాతిశయంబు వి
జ్ఞానంబు శ్రీశ థు • సరససత్క
థానులాపంబుత • దాకర్ణనంబును
పరమయోగీశ్వర • ప్రాప్తి యంచి
తార్థేంద్రియారామ • లగువారి విడుచుట
యును వారి కిష్టమౌఁ • దనరునగ్ర
కామంబులందున • కాంక్షశీతోష్ణాది
సహనతాహింస • శమదమాది

గీ. కంబు విజనస్థలస్థితి • గలిగిశౌరి
కీర్తనామృతపానవి • స్ఫూర్తి దక్క
దతితర పదార్థ వైరాగ్య • దశదలిర్చి
యుండు యమనియమాదిసం • యుక్తుఁడగుచు. ౧౮౪

వ. ఇట్టి పురుషునికి జ్ఞానవైరాగ్య యోగంబున భక్తియోగాగ్ని జనించి హృదయగ్రంథి విదాహకంబగు నిట్లు దగ్ధహృదయగ్రంథియైన పురుషుండు బాల్యాదిబాహ్యధర్మంబులు, సుఖదుఃఖాద్యాంతరధర్మంబులు, రాజభృత్యాద్యుచ్చభేదంబులు, నాత్మనికారాముం డగుటంజేసి, నిరీక్షింపకుండు ద్రష్టయైనయాత్మకు, దృశ్యంబులైనయింద్రియార్థంబులకు నంతఃకరణంబు బంధుహేతువగుటం జేసి యయ్యంతఃకరణంబు నాత్మకధీనంబైన కతంబున దదితర దృశ్యభేదంబులు గనకుండు నిట్లుగాకుండిన విషయాకృష్టత్వంబులైననింద్రియంబులచేత మనంబాకృష్టంబులైన నింద్రియంబులచేత మనంబాకృష్టంబై విషయాసక్తిం దగిలియంతరంబైనవిచారశక్తి నపహరించుదానివలనఁ బూర్వాపరానుమేయసంధాన రూపస్మృతి దొలంగు నట్లయిన నాత్మవిషయక జ్ఞానంబు దూరంబగు నదియే యాత్మాపహ్నంబనదగు నదియుంగాక ౨౮౫

సీ. మహినాత్మ నోనుకా • మాయసర్వంప్రియం
భవతియన్ వైదిక, భావణమున
నఖిలంబు ప్రియతమం • బగునాత్మ కేయాత్మ
స్వాపహ్నవంబున • నలరుకంటె
నధికతరంబైన • నాత్మనాశంబెద్ది
గలుఁగు జర్చింపలో • కంబునందు
మఱియు సంసృతిఁదాట • మతిగల పురుషుండు
దొలిపురుషార్థచ • తుష్టయములఁ

గీ. ద్రితయమతి భీకరంబని • తెలసినాలు
గవది ముఖ్యార్థ మనిజనుల్ • గణుతిసేతు
రనుచు సద్భక్తియుక్తుఁడై • యనుపమాన
మైన మోక్షము వేక్షించు, ననఘచరితా. ౨౮౬

వ. అదియునుంగాక స్థావర జంగమాత్మకంబైన ప్రపంచంబునంగు భగవంతుండైన శ్రీహరి వ్యాపకుండయి యంతర్యామిత్వంబు నొంది వెలుంగుచుండు నమ్మహాత్మునియందుఁ గార్యకారణావస్థాద్వయంబుగల జగంబు సదసచ్ఛబ్దవాచ్యంబై ప్రవర్తిల్లు "యస్యాత్మా శరీరం యస్యప్రకృతిశ్శరీర" ఇత్యాది వేదాంత వచనములచే చిదచిదాత్మకంబైన ప్రపంచంబంతయు సచ్ఛబ్దవాచ్యుండగు నతనికి శరీరభూతంబు సూక్ష్మదశాపన్న చిదచిచ్ఛరీరుండగు నతం

డు కారణభూతుండై «సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయంబ్ర
హ్మ" అనంబడు పురుషోత్తమునికి శరీరశరీర భావంబుచేతగాని నిర్వికారంబై
న స్వరూపంబునంగాదు. ఏకవిజ్ఞానంబున సర్వవిజ్ఞానంబగునను వేదాంతోది
తార్థంబున సూక్ష్మచిదచిచ్ఛరీరక బ్రహ్మవిజ్ఞానంబున స్థూలచిదచిచ్ఛరీర వి
జ్ఞానంబగునని దేహాశ్రితంబులైన కామరాగాదికంబులు దేహియందు జెంద
ని తెరంగున, వ్యాప్తగతంబులైన వికారంబులు అపహతపాపాది గుణకుండైన
జగచ్ఛరీరియందు దవులకుండునట్టిసర్వేశ్వరుండు స్వసంకల్ప కృతజగదుదయ
విభవలయలీలుండును పాపకానుగ్రహార్థంబు హృత్కమలకర్ణికాంతరంబున
వసించి సర్వనియామకుండు సర్వవిలక్షణుండు దివ్యమహిషీరమారమణుండు
బ్రహ్మకర్మోభయ భావనాత్రయాతీతుండు ననంత కల్యాణగుణ పరిపూర్ణుండు
నై వర్తించునని యిట్లనియె. ౧౫౭

మ. కమలాభర్త లసత్స్వరూపగుణయో • గధ్యానమాధ్వీకపా
నమునం జేతన్గడుమత్తుండై చెలంగి య • న్యంబించుకంతైన చి
త్తమునందెంచక ధన్యుడై ప్రకృతిబం • ధంబుల్ దెగంగోసియు
త్తమయోగీశ్వర గమ్యముక్తిపద మం • దంబూను సర్వేశ్వరా. ౧౫౮

ఉ. వీనులవిందుగాంగ నర • వింద దళాయత నేత్రసత్కథా
గానము లోకమేను బుల • కల్ బచరించి ప్రమోద బాష్పసం
తానము మేయి మయ్యగను • దమ్ములఁ జార గళంబు గద్గద
ధ్వానము చేజెలంగఁ దగు • వానిది జన్మము సూతలంబగన్. ౧౫౯

సీ. ధరలోన నెవ్వని • చరణాబ్జభక్తిసం
స్మరణంబునన్ సుధీ • సంచయంబు
లధికకర్మగ్రథ • తాహంక్రియాహృద
యగ్రంధి నడచిన • యతులనిర్వి
షయ నిరుద్ధేంద్రియు • సరణిమానులుబోధ
జ్ఞేయ లేరదియేమి • జెప్పవచ్చు
నట్టియాశ్వరునిశ్రీ • యఃపతి వాసుదేవు
నిజగతా • వను ననఘచరితు
గీ. నర్థిశరణంబుగాందత్ప • దాబ్జయుగళి
భక్తి భజియించు నదియేనూ • పరమయోగి

సన్నుతంబైన పదము ని • స్సంశయముగ
రమ్యసుగుణవిహార యో • గాత్కుమారా. ౧౯౦

శా. కామక్రోధషడ్విషద్భయదన • క్రవ్యాహ సంకీర్ణని
స్సీమాగాధ భవాంబురాశిగడవన్ • శ్రీనాథ పాదారవిం
దానందస్మరణప్లవంబు తదుపా • యంబన్య మేదన్నను
ద్దామప్రీతి దదాశ్రయుండ వగుమీ • ధాత్రీశ నృపాలాత్మజా. ౧౯౧

వ. ఇవ్విధంబున శ్రీమన్నారాయణు ప్రభావంబు జెప్పితి నతని భజియింపుమని వచించి తదనంతరంబున బ్రహ్మదేవుని, విఘ్నేశ్వరుని, కుమారస్వామిని, మహాలక్ష్మిని, సరస్వతిని సేవింపుమని దేవీ మహాత్మ్యంబు వినుమని యిట్లనియె.

—ఋషభయోగి రాజకుమారునకు దేవీమహాత్మ్యంబు చెప్పుట—

మ. అనయంబున్మనిమై నవావరణ ము • ఖ్యప్రోల్ల సద్రత్నకాం
చన సింహాసన దేదివత్సరశిఖాం • చద్ధా వామాంకవా
సిని, సామర్థ్యకరాబ్జవీజిత కన • చ్చేలానిలస్పర్శసం
జనితానందిని యైన శ్రీత్రిపురవా • సన్ సంస్మరింపందగున్. ౧౯౩

చ. సరసమహాత్వతత్వ నవ • చక్రరథాధినివాసయయ్యు వి
స్తృతతరగేయచక్రగిరి • చక్రధరస్థితు లెప్పితార్థమం
త్రరతిని దండనీతిని య • థావిధిఁ దెల్పుచు నుండనొప్పునా
సురుచిరమూర్తి యాత్రిపుర • సుందరిఁ గొల్వుము నెమ్మనమ్మునన్. ౧౯౪

సీ. సదసదాత్మకజగ • జ్జన్మాది హేతుత్వ
మొందుచు సచ్చిదా • నందయగుచు
దీపితస్వస్వరూ • పాపరిత్యాగస్వ
రూపాంతరాదర్శ • రూఢిదనరి
సర్వోపనిషదర్థ • సారభూతస్థితి
కాదిహాది మనుప్ర • కారముంది
సమ్యగేకోనవిం • శద్దశావరణాంత
రస్థకోణత్రయా • రమ్యబిందు

సతతంబుశివపదా • బ్జధ్యాన మొనరించి
యింపుగాఁ గనుభోజి • యించునెడను

గీ. పల్కునెడ, జూచు నెడ, నిల్వఁ • బడిన యెడ, ది
రంగు నెడ, కూర్కునెడ, విహా • రంబొనర్చు
నెడను, వినునెడ, గ్రహియించు • నెడను, శివుని
చింతసేయంగఁ దగుబుద్ధి • మంతులకును. ౨౦౦

క. ఈవిధమున సంక్షేపము। గావచియింపఁబడె గ్ర • కటిసంగ్రహమీ
భూవలయమున బహుపురాఁ ణావిష్కృతమయ్యెఁ బ్రికటిత • తాంచితవృత్తిన్ ౨౦౧

చ. ప్రకలపురాణ గుహ్యమగు • సంహరణంబు పవిత్రపూజయు
ప్రకట సుఖప్రదంబతివి • పత్తి విమోచన మెంతలిర్చు శై
వకవచ మేను నీకుహిత • వర్తన మొప్ప వచింతుతాట్కుమా
రక పరిశుద్ధ మానసము • రంజిలఁజేయుము సమ్మదంబునన్. ౨౦౨

వ. అని శివకవచంబు సాంగంబుగా నతనికి నుపదేశించి యావృషభ యోగీం
ద్రుఁ డిట్లనియె. ౨౦౩

సీ. అవనిపరప్రదం • బగు శైవకవచంబు
చెలఁగ నాచేముందు • జెప్పఁబడియె
సకలబాధాప్రశాం • తికరంబు సర్వదే
వాలకు రహస్యమై • యొప్పుచుండు
నేమానవుండైన • నీయుత్తముండైన
శివకవచంబు పా • సించె నేని
యూనుర్ధ్యనకు శాంభ • వానుగ్రహంబున
భయము నించుకేని సం • భవము నొంద

గీ. దరసిచూడంగ • త్రిణాయు • వైనప్రాప్త
మృత్యువైన మహారోగ • మిళితుఁడైన
నతుల సంపత్సుఖంబుదీ • ర్ఘాయువెలమిఁ
జెంగు సంశయ ముక్కింత • జెందవలదు. ౨౦౪

సీ. జననాథ సుత; దివ్య • శంఖఖడ్గంబులు
పరసైన్యనాశన • ప్రతిభ జెందు
నాత్మసైన్యంబుల • నలరించు చిత్రంబు
భవ్యమానేత్రత్ర • భావమునను
జటులద్విషట్సహ • స్రశ్వేత బలము చే
బరిస్ఫుట ఘనస్రజా • రణము చేత
నిఖిలశాత్రవసేన • నిర్జించి విశ్వసం
తంబైన సింహాస • నంబునొంది

గీ. భూమి పాలించఁగలవని • బుద్ధిఁ దెలిపి
జననిచేఁ దత్సుతునిచేత • సరసపూజ
నంబులను దృప్తిఁ నొంది • యానందమునను
ఋషభయోగీంద్రుఁ డతిగ యు • దేచ్ఛమీర. ౨౧౩

వ. అని యివ్విధంబున సూతుండు శౌనకాదిమునులకుం జెప్పిన నటమీఁద కథ యె ట్టిదనిన. ౨౧౪

మ. వర వైజస్ఫురణోద్ధ వర్వభువనో • పాదాన పాదానత
స్వరధీశాజ మునీంద్రనిత్య విలస • ద్వ్యామాంగ వామాంగనా
కరుణారక్షిత శాస్త్ర సత్వబలవ • ద్గాంగేయ గాంగేయ భూ
ధరబాణాసవిలాస సత్యపదక • ద్వ్యాహార వ్యాహారకా. ౨౧౫

క. హార్దస్తుతికృజ్జనహా! హార్దసకాపర్దముక్తిదాపగయభ్యా
మర్దన సమ్మర్దబలీ! వర్ధరవవి పాట్యమాన • వనజభవాండా. ౨౧౬

భుజంగప్రయాతము

ప్రమాణాప్రమేయ • ప్రపూత్మస్వరూపా
అమేయావ్యయాత్మ్యద్యు • తైశ్వర్యదీపా
రమానాథ వాణీశ • రమ్యాసులాపా
నమోంతాను వాకాభి • సంభావ్య ప్రతీపా. ౨౧౭

మ. ఇది శ్రీమత్కృతి పాద్యవేద్య కవితా • హేవాకభావాదిక
ప్రదశయ్యాధ్వనివృత్తి రీతిరసపుం. భావ ప్రభావప్రబం
ధదయాసంభృతి రాజశేఖరహిత • శ్రీరచ్య భద్రాయుర
భ్యుదయాభిఖ్య మహాప్రబంధము ద్వితీయోల్లాసమై పెంపగున్. ౨౧౯

—•గద్య•—

ఇది శ్రీరామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణారస కటాక్షేక్షణ ప్రసాద
ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రామళ్లగోత్ర పాత్ర
కామినేని వంశపయః పారావార రాకాసుధాకర రాజ
ద్రాజన్య దేశాయిసార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వాణ
కవిత్వతత్వ చాతుర్యధుర్య పరాశరగోత్ర
రాపాకలింగామాత్యపుత్ర లక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాయు
రభ్యుదయంబునందు
ద్వితీయోల్లాసము





శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము



## తృతీయోల్లాసము





శ్రీరాం కరుణారస
ధారాప్లుత హృదయసదయ తత్పవనధురా
ధౌరేయ సుఖకరవిహా
రా రామారెడ్డిపేట . రామ మహేశా

వ. అవధరింపుము. శౌనకాది మునీంద్రులకు సూతుం డవలికథ నిట్లు చెప్పదొడంగెను. ౨

గీ. అధికబలుఁడు దశార్ణదే . శాధినాథుఁ
డై తగినవజ్రనాభురా . జ్యంబు గొనఁగ
మగధ దేశాధి పతిసుహో . మాహ్వుఁడు హేమ
రథుఁడనెడు ఘనబలాభి . రాముఁ డపుడు. ౩

క. ధనబలవంతుండా యో। ధనబలరథగజతురగప . దాత్యసి ముఖసా
ధనవలయిత భుజుఁడరిసా। ధనవిలయాంతకుఁడగుచును . దుగ్రతదోర్వ; ౪

సీ. సన్నిహిత దుష్ప్రథజన • ప్రథితావితథ మనో
రథ శాస్త్ర శస్త్రార్థ • ప్రథములలర
బంధురావయపగ • రక్తాంధదానప్రసవ
గ్గంధ సింధుర ఘటల్ • గడలుకొనఁగ
ఘోర బాహ్లీక ధా • రాశట్టతుఘాట్కార
ఘోట్టాణధట్టికా • కోటులెనయ
చటులారి ధీరవ్రా • త్పుటపటిస్ఫుటనార
భటకిసమున్నటపిద • భటులు గొలువ

గీ. భూరి భేరీమృదంగిక • కాహళములు
పటహ గోముఖవాద్య శ • బ్దములు భద్ర
కాహళీ కుహళీరవ • వ్యూహములును
నొక్క మొగిఁ మ్రోయఁ మాగధుల్ • పికక్రిల్ల. ౧౩

వ: ఇట్టియు. ౧౪

సీ. అధికులై తగినట్టి • రథికులు దృష్టవై
వధికులు దవిలి కే • వలఁజెలంగఁ
ప్రాసికుల్ కార్ముకా • భ్యాసికుల్ ముద్గర
న్యాసికుల్ దగుహాళా • హాళియొనర్ప
తాళికుల్ వందివై • తాళికుల్ నిశితార
హాళికుల్ సాటోపు • లగుచు నడవ
హేతికుల్ ముసలపి • ఖ్యాతికుల్ ముష్టిసం
ఘాతికుల్ మొనదుగా • గ్రందుకొనఁగ

గీ. శాంఖికులు ఘంటికులఁగూడి • చాంక్రికులును
ఖాడ్గికుల యాష్టికులమించి • కౌంతికులును
దారసోత్సాహ సన్నాహు • లగుచు నపుడు
పగర నిర్జించు వేడ్కచే • బలసి రాగ. ౧౫

సీ. స్వవిషయానంతర • స్థానంబు శత్రుండు
తదనంతరుండు మి • త్రత్వమొందు

తత్పరతర కాలా • జానీను జగుచుంచు
[illegible] వర్తించు దం[illegible]
నముల పార్శ్వగ్రాహ • [illegible]
వ్విధమంతరంబున • వెలయుచుండ
సాధుసహాయంబు • సాధనోపాయంబు
పరదేశ కాలవి • భాగమరసి

గీ. ఘనవిపత్తికి మున్ముట్టి • కారవృత్తి
కార్యసిద్ధియు నన్నైదు • గతులుగలుగు
నరసి పంచాంగ మరయుచు • షడ్విధంబు
బలము నడపింపఁ దొడఁగె • నబ్బలితుఁ డప్పుడు. ౧౫

సీ. కాంతీర విశ్వభయం • కరనినాదంబులు
సారథిక స్వాన • జారభటులు
పౌండరీక ఘోర • ఝాంకార రావముల్
సైరిభిక పరిస్ఫు • టారవములు
వారాహిఘోట్ఘటి • ఘోరుసం రావముల్
భైరుండ ఘోరగళ • బ్రవజంబు
ఖాడ్గిక సందర్భ • కఠిన స్వనంబులు
కౌశిక హుంక్రియా • కలుషరుతులు

గీ. సాహసాగత సైన్యకో • లాహలములు
గలసి యేకీభవింప న • త్యంతతోడ
ఛికరారణ్య గహ్వర • కీకరోగ్ర
మార్గముల నిర్గమించుచు • మాహివిభుండు; ౧౬

వ. మఱియు.

సీ. పరదేశములకు సం • బోధంబు రాకుండ
వ్యూహంబు నొనరింప • నూహచేయు
దుష్టసత్వంబులఁ • దూలింప నియమించు
వితత దృష్టాదృష్ట • విధముఁ దెలియు
దవి సాంద్రవృష్టిలో • ధర్మంబు గార్తాంతి

కులుదెల్ప సంతోష కలనఁ జెందు
నింపుమీరంగఁ ద్యై • నంపాతకీట్టిప
స్థానంబనుచుఁ బల్కి • బూనఁజేయు

గీ. వస్త్రముల బాడ్ల సవరణ • లలరుచుండ
శార్కరిలసికతిలమహా • శాడ్వలముల
ప్రకటపంకిల నద్యల • పద్ధతులను
గడచి చతురంగ బలములు • గ్రాలికతోడ. ౧౯

శా. శ్రీమానద్గళ నిర్గళత్స్వరబలా • భేద్యంబు • ధాన్యాదిక
స్థోమస్థేమ మనేక పార్శ్వరథవి • స్ఫూర్జద్ఘటద్వక్రమో
ద్దామంబద్భుత నూత్నరత్నవిలస • త్థానంబజస్రైకస
ద్ధైమచ్ఛత్రిగ వజ్రబాహునృపురా • ష్ట్రంబాక్రమించెఁ గడిన్. ౨౦

—• భద్రాయువు దశార్ణదేశనగరాదుల నాక్రమించుట •—

చ. కలుషిత ధూళితోనెదురు • గాడ్పులు డాయ, వరల్గులూయ, ను
ల్కలుబడ, రక్త మేఘములు • గర్జిలి నెత్తురు నింప, మించుచు
క్కలు భయదంబుగా దివిని • గన్పడ, దుష్టములైన శాకునం
బులు గనుపించ, మాగధ వ • మూహము శెగ్గిల రగ్గలంబుగన్. ౨౧

వ. ఇవ్విధంబున సముద్రతరంగంబుల చందంబున, వర్షబిందువుల విధంబున చిలు
కపరిగతి, మిడుతగమివడువున నుసిళ్లగుంపురీతి, నేల యీనిన పగిది సం
దోహ తండంబులై, లక్షోపలక్షలై, కోటానకోటులై, పెక్కగలనెక్కుడం
గన నక్కడగనుపట్టుశతాక్షౌహిణీ మాగధబలంబు వజ్రబాహు పరిపాలిత ద
శార్ణదేశనగర గ్రామజనపదంబుల నాక్రమించి. ౨౨

ఉ. కొందఱు రత్నరాసులను • కొందఱు స్వర్ణచయంబులన్ మఱిం
గొందఱు దివ్యవస్త్రములఁ • గొందఱు గోవృషసంచయంబుల
న్గొందఱు సుందరీమణుల • గొందఱు బాలుర గొందఱింపుతో
న్గొందిన ధాన్యసంఘముల • నుద్భటవృత్తిని సంగ్రహించుచున్. ౨౩

సీ. సౌభాగ్యకాపోతసూ • యూరసౌకాదిసు
ఖోద్యాన వనముల • నుక్కడంచి
జాలపాదరథాంగ • జాలమేఘాభంగ
విమలాంబు పద్మాక • రముల గలంచి
సుఖభోగశాలికా • సుఖయుక్త సస్యంబు
ఘోటకంబులు మెక్క • గోసివైచి
ముక్తాఫలాసక్త • ముఖ్యస్తుల వనములు
విటతాటనంబుగా • వించి మించి

గీ. కమ్యకేళీరథంబుల • గాసిజేసి
ధనవదాగారములు జొచ్చి • త్రెస్కరించి
సకల వస్తువ్రజంబును • తస్కరింగొనుచు
రిపుబలంబులు తద్రాజ్య • రిపుల నొంచి. ౨౪

చ. అలరులు త్రుంచి, తీవియల • నన్నిటి మున్నరసించి పెంపుడుం
బులుగుల గాంచి, వానిఁ జోరిఁ • బుచ్చదలంచి • రసాస్వకూటముల్
తోలుత నడంచి, రథ్యముల • తోరణముల్ విదళించి స్త్రీలసొం
పుల నడగించి, వారిడవగు • భూషణముల్ హరియించి మించఁగాఁ. ౨౫

క. అనదలగుచు ద్విషదపహృత। ధనకనకకళత్ర పుత్ర • ధాన్యాంబరగో
ధనులై నిర్బంధనులై। చనుదెంచి నిజాధిపతికి • సాగిలి భీతిన్. ౨౬

సీ. ఓమహారాజ, నీ • యుర్విలోపల మండ
సుఖసమృద్ధిని జెంది • సుతులు మేము
సకల సంపదలచే • సతతంబు చరియించు
వారమై యుండ నీ • వారమయ్య
వలసిన యప్పుడే • వారిదంబులు నిల్చి
వర్షంబు గురియున • వ్వారిగాఁగ
ముక్కారుపంటలు • నెక్కడ గనుగొన్న
తరగకుండును ధాన్య • తతి దలిర్చి

గీ. కామధేనువులన ధేను • లాముకొనఁగ

క్షీరవారిధి నింపునీ • నీమనెప్పుడు
బ్రాహ్మణ క్షత్రియార్యశూ • ద్రవ్రజంబు
సత్యవృత్తి జరియించునై • శ్వర్యమొంది. ౨౭

గీ. అట్టి మాపాటు వినుమిప్పు • డవనినాథ
యరివరులు నీదు రాజ్యంబు • నాక్రమింప
భంగపాటున సంకట • పాటుదుఃఖ
పాటుగల్గెనయా, యేమి • పలుకవచ్చు. ౨౮

—*ప్రజలు వజ్రనాభునితోఁ దమ సంకటములఁ జెప్పికొనుట*—

క. నిగుడింపునీదు మగటిమి। సెగపొగలెగయంగ శత్రు • సేనాటవులన్
దగులుకొనఁగ లేకునికిని। వగలుడుగునెనిమ్ము గొల్చు • వారల మదిలోన్. ౨౯

వ. అని విన్నవించిన. ౩౦

మ. వినియాభూపతి క్రోధఘూర్ణితరసా • వేశాత్ముఁడై మంత్రికా
ర్య నిరూఢాంతరులైన వారి, ఘనశౌ • ర్యస్ఫూర్తిఁ జెన్నొందువా
రిని బిల్వన్నియమించి శాత్రవులగా • రించంగ నెన్నాళ్లకో
మనకు ద్యోగముగల్గె సర్వబలసం • పద్ధంబుగాఁ బోదగున్. ౩౧

మ. అనిమిాసాల్ వడివేసి యీసునను బా • హాదండ పాండిత్యమే
ననిలోఁ జూపెద నాసమానులటె ము • న్నామాగధుల్ గీగధుల్
ననుఁబోటిం దొడరంగ వచ్చినను నే • నానావిధాస్త్రాళిఁ
త్తనువుల్ నెత్తుట జొత్తిలన్ బరపెదం • దథ్యంబుగా నెంచినన్. ౩౨

వ. అని కోపాటోపంబున వీరాలాపంబులు పలికి. ౩౩

సీ. సమరసన్నాహము • స్వాహాబలబంలరంగ
రథముదెమ్మనిన సా • రథికడంగి
వివిధాస్త్రశస్త్రప్ర • వేశదివ్యంబైన
తేరుసమ్ముఖమునఁ • దెచ్చినిలుపఁ

గని తత్కథం బెక్కి • కదనంబొనర్ప నా
ప్తవరూధినీపతుల్ • దరిసినదువ
నాగరాశేషమా • నవమోదము వహించి
చతురంగవాహినీ • సహితుఁడగుచు

గీ. స్వీయదేశప్రజార్తి కృ • చ్ఛీలఖేల
బహుళమాగధసైన్య సం • బాధనంబు
కొఱకు రౌద్రరసవిశేష • ఘూర్ణమాన
మానసంబున వెడలెన • మ్మహి వడంక. ౩౪

స్రగ్విణీవృత్తము. భూర్భువర్వ్యాఘ్ర కృ ద్భూరి భేరీనినా
దార్భటుల్ ఢక్కనాదార్భటుల్ మ్రోసెనా
విర్భవత్సామితద్వేషి రాడ్గర్భిణీ
గర్భనిర్భేదనో త్కంఠదీపింపఁగన్. ౩౫

క. తన రాజ్యవర్తులై తగు। మనుజులలో గల్గుపోటు • మానవులెల్లన్
వెనువెంట నంటిరాన। జ్జనపతి సంగరము సేయ • సరభసవృత్తిన్. ౩౬

వ. ఇవ్విధంబున బలసమన్వితుండై నొక్క దినమాత్రంబున శత్రుసైన్యంబు గదిసి. ౩౭

క. అరదంబులు నరదంబులు। కరులుకరుల్ హరులుహరులు • కాతుకములరన్
నరపతులును నరపతులును। దుర మొనరించంగ నపుడు • తుములంబయ్యెన్.

సీ. తుండాంచితాయసో • ద్దండ దండములచే
నెత్తులు బగులంగ • మొత్తి మొత్తి
కఠినోగ్రతరదంత • ఘట్టనంబులచేత
రొమ్ములు బగులంగఁ • గ్రుమ్మి గ్రుమ్మి
పటుభయంకరకాల • పాశవజ్రములచే
వీపులు చెదరంగ • వేసి వేసి
దృఢదృషత్సంకాశ • దీప్తదేహోద్ధతి
మేనులు నలియంగ • మొదపి మొదపి

## తృతీయోల్లాసము

గీ. మలయమారుత చోళసిం • హళసముద్ధ
లంబుగను హస్తి [illegible] మా • లంబనంబు
దోఁచెదదధిష్ఠిత వ్రజం • బేదిపోరె. ౩౯

సీ. ఫాలస్థలాయఃప్ర • భాలీన మకుటముల్
ఖడ్గధారల ఖంగు • ఖంగుమనఁగ
కవచరూపంబులౌ • ఘనశిలాబత్తరుల్
కరవాలగతి ఘల్లు • ఘల్లనంగ
కూర్పర గుప్త్యయః • కోశముల్ మండలా
గ్రంబులచే ఖణేల్ • ఖణేలనంగ
బంధుర తరములౌ • స్కంధదేశంబులు
తరవారులను ఖరేల్ • ఖరిలనంగ

గీ. హత్తుకొని మత్తులైనరా • హుత్తులడరి
సింధుకాంభోజ కురుపార • శీకవనాయు
యవనభవవనపీనవా • హములు బరపి
తునుముల నొనరించి రన్యోన్య • సమతదనర

సీ. రథముల బరపిత • త్పృథుల ఘట్టనముల
నెదురించు భటులము • న్నదిపి చదిపి
రయము మీరఁగ సాంప • రాయికంబున మోహ
రింపు పాదాతంబు • జంపి చంపి
ఖురుగొలంకుల నిల్చి • మర మొనర్చిన శారి
సిరముల నందందఁ • జిదిమి చిదిమి
వెనువెంట నంటవ • చ్చిన తురగబలముల
మించి తచ్ఛదములఁ • ద్రుంచి త్రుంచి

గీ. యద్భుతాన్యోన్య సైన్య గ • హనము నడుమ
జొచ్చి ఘంటాపథంబుగఁ • జొచ్చి వెడలి
రథికు లత్యంతరణ మనో • రథికులగుచు
భవర మొనరించి రమితమా • బరవసమున. ౪౧

వ॥ మఱియు నప్పురంబు లుకుపడి నొకరొకరు తను శౌర్యంబు మెఱయ ఖడ్గం బుల ద్రెవ్వేసియు, కుంతంబులఁ బొడిచి కుఠారంబుల నడచి వంకులఁ గుఱిచి శూలంబులఁ జిమ్మి ముసలంబుల మొత్తి పరిఘంబుల విదళించి పాశంబుల బంధించి ప్రాసంబుల హరియించి భిండివాలంబుల భేదించి ముద్గరంబుల ఛేదించి చక్రంబుల విక్రమించి తోమరంబుల నాక్రమించి మఱియు వివిధా యుధంబులఁ బరఁగించిన విరుగు తేరులును, యొఱఁగు నేనుంగులును దిరుగు హారులును, దఱుగు భటులునుం గలిగి విచ్ఛిన్నంబులైన ఛత్రంబులును, విగ ళితంబులైన కేతనంబులును విద్ధంబులైన తనుత్రాణంబులును ఖండితంబులైన శరాసనంబులు, విధ్వస్తంబులైన శరంబులు విగతంబులైన బాహుపుడికంబులు వికలంబులైన మస్తకంబులు, విలూనంబులైన కరంబులు పరికర్తంబులైన భుజంబులు విగళితంబులైన వక్షంబులు వివిధంబులైన తుండంబులు విశకలి తంబులైన యూరువులు విపాటితంబులైన జంఘికలు విభ్రష్టంబులైన పదంబు లుగలిగి వివ్యగ్ర్యాక్రీర్ణ నర్తన పఠిత నర్తన ప్రఘాత భూత ప్రేతపిశాచ శాకినీ ఢాకినీ భేతాళాది గణకోలాహల రవంబులుగలిగి బహు ప్రహారణంబులం బ్రవ బుడిబుడి బడయు శోణిత ధారాళ ధారావారి పూరంబు దారుణ బాణవిలూ న గజవాజి యోధమేదోమాంస మజ్జనుస్నిగ్ధంబు, పంకంబు, భుజంబులు, భుజంగంబులు శిరఃకపాలంబులు కమఠంబులు శిరోరుహంబులు శైవాలంబు లు కరంబులు మత్స్యంబులు తురంగంబులు నక్రంబులు ద్విపంబులు ద్వీపం బులు ఛత్రంబులు ఫేనపుంజంబులు చామరంబులు మరాళంబులు, నానా విధభూషణ మణిగణ చూర్ణంబు పులినంబుగల సంగరాంగణంబు మహార్ణ వంబు ననుకరించె దంభసంరంభ విజృంభమాణ ద్వంద్వ యుద్ధంబున శతాం గంబుల నిట్టట్టుసేయు మాతంగంబులు మాతంగంబులఁ దూలించు తురంగం బులు తురంగంబుల జెదరించు భటులును నిట్లు నిర్మర్యాదంబుగాఁ బెనంగు సమయంబున. ౮౫

క. మగధ మహీపతి బలమున మగటిమిగల వారలేట, మూర్ఛలములమున్ బెగడుపడఁజేసి తఱిమిన। వగచెడి దాశార్హసేన, నడిబరచుతఱిన్॥ ౮౬

వ॥ అట్టియెడ వృజిబాహుండు. ౮౭

గీ. వహ్నితాగ్నేయ బాణమా • వజ్రబాహుఁ
డేయ, నదిబ్భాల లలరంగ • నేచి రాగ
హేమరథుఁడంత వరుణాస్త్ర • మేసి దాని
యణఁచెడంచెను తనసైన్య • ముబ్బుచుండ.

క. చంద్రప్రకాశమునదగు • నైంద్రాస్త్రము వజ్రబాహుఁ డడరించుమరి
సాంద్రుఁడగు హేమరథుఁడును • హైంద్రాస్త్రముచేతదాని, యేపడచె వడిన్.

వ. ఇవ్విధంబున సింహంబుల చందంబున శరభంబుల పోలె శార్దూలంబులగతి
వృషభంబుల విధంబున గజంబుల చాడ్పున నంతకంతకు మచ్చరంబు గ్రచ్చు
కొన దివ్యాస్త్ర విలాసంబు జూపుచుఁ జెండంబు మొనయించుచు శరవర్షం
బులు పాటించుచు నిజబిరుదంబులఁ జాటించుచు పోరునవసరంబున. ౫౭

సీ. చటుల భృత్యామాత్య • సహితుఁడై యవ్వజ్ర
బాహుఁడు వజ్రాధి • పతినిగిట్టి
అయిదింట గుఱ్ఱంబు • లారింటసారథి
నేడింట దధ్వజం • బెనిమిదింటఁ
జాపంబు తొమ్మిది • తూపులఁ దత్తను
త్రాణంబు దశసంఖ్య • బాణములను
ఖండంబుగాఁ జేయ • వశనేయుటయుఁ జూచి
క్రోధారుణాక్షుఁడై • రోషపరుఁడు

గీ. నతఁడు నిగుడించు శరముల • నంతకంతె
పొడిదముగు తూపుగమిచేత • నుడిపి తత్ప్ర
కార మార్గంబునకు బ్రతీ • కారమొనయఁ
జేసి కడుమాట యుద్ధంపు • చిత్రమునను. ౫౮

క. తనరోషాధాగ్రణులందఱిఁ గనుఁగొని చేపిచికడిమి • గడలుకొనఁగఁద
త్తని శితబాణాసారము! మనువడివారింపుచోన, మోఘాస్త్రుండై. ౫౯

గీ. వ్యాతివర్షంబు గురిసిన • చందమలర
నతని యురదంబు బాణమ • యంబుజేసి

గీ. బహుళ ముక్తాఫలాంచిత • పటగృహములు
వితత సౌవర్ణ ముద్రికాం • చితవిశాల
పేటికా సంఘములరాజ • బిరుదకేత
నాదులను గొని రత్నాంత • మోదములర, ౬౩

వ. మఱియు. ౬౪

గీ. వరచమూ తన్మంత్రి ముఖ యోధ • వరులమీఁద
వాయువేగాశ్వములఁ దోలి • వారిబట్టి
పాశ నిర్బంధ దేహులై • పరగజేసి
హేమరథు మ్రోల నిడనమ్మ • హీనుఁడపుడు

గీ. పీని నావజ్రబాహుని • విరిచికట్ల
తోడ బహుళకటములతోఁ • గూడబెట్టి
తెండు మీరిపు డేమర • కుండుడనుచు
విజయ దుందుభి మ్రోయించె • వేడుకలర. ౬౫

క. నృపుఁడు చతుర్విధసైన్య ప్రతతునిగని మనమువజ్ర • బాహుపురశ్రీ
నిపుడపహరించి యారా జ్యపరిగ్రహణంబు సేయు • నర్హం బయ్యెన్. ౬

క. అనియానతి నోసఁగినవా రనుమోదముతోడ వేగ • సుభటులకుశుభ
తృస్నని దగుతత్పురవరము నగనిలఁగ్గకుఁజొచ్చిమిగుల • కడిమిదలిర్పన్. ౬

హేమరథునిభటులు వజ్రబాహుని పురంబు గొల్లగొనుట.

క. వీరులు తత్పురికావలి వారలొకించుకయు వేటు • వాటులచేతన్
బోరగ వారలనెల్లం జీరికిఁగైకొనక శత్రు • సేవలుకడిమిన్. ౬

గీ. ధనకనక వస్తువాహనా • దినిదనర్పు
వజ్రబాహుని గరిమము • వ్వరుసగాఁగ
దోచి తమతమకిష్టమౌ • వస్తువులఁగొనుచుఁ
బ్రభునియుక్తిఁ దెచ్చుచును • రమునకేగి.

మత్స్యందికాదిసం • భవమధుప్రతతితో
సచ్ఛ్రీకతరసంబు • సంఘటించి
మహిత గంధోత్తమా • స్థైరేయముంగూర్చి
యూపికి పలలంబు • నావటించి

గీ. వారవనితాళి వేలాస • వంబుగాఁగఁ
జేసి పానంబొనర్చిరం • జిల్లువారి
బట్టుకొని పశ్రిమదావన • ప్రముఖులను
రూపుమాపుచు నప్పుడా • యాధజనులు. ౭౩

సీ. మర్ధరాపద్వార్ధ, కార్ధకస్రైణాశ్రు
పాతపంకిలము నే • వట్టుఁజూడ
గుల్ఫద్వయసకాత • కుంభముక్తాఫల
శార్కరిలంబు నే • చక్కఁగనిన
జానుమాత్రసితాభ్ర • సంకుమ దాగరు
గంధగంధిలముః నే • కడదలంచ
స్కదఘ్నాధక • చణకశాలికుళుద్ధ
మావతుందిలము నే • మన్కిసరయ

గీ. ఘనజనులు చూరబుచ్చినఁ • గతసదత్న్వ
రావణంబులు జూపట్ట • నఖిలజనులఁ
జేరఁ గొనుచుఁబోవ సింధుసం • భరితనిజద
మనుకరించెను వినువారి • కద్భుతముగా. ౭౪

గీ. అప్పుడా బాల గోబాల • మనకప్రజలు
నొక్క మొగి వెరుఋకు జిక్కి • స్రుక్కిపొక్కి
క్రుందియాక్రంద నధ్వని • జెందియుండ
శత్రుజనులేగుచుండ త • త్సమయమునను ౭౫

మ. పరభా శ్వేభభటాళికై మగధధే • శంబేలుచున్నట్టి హే
మరథాభిఖ్య నృపాలమౌళి మిగులన్ • మత్తిల్లిదాశార్ణరా

వ. అట్టియెడ.

ఉ. ఈసున శత్రుసైన్యము ల • నేకము లై తగు సైనికోత్తముల్
జానటులై మెలంగఁ బటు • భల్లసమూహము లుల్లసిల్లఁగ
వేసియు దూసియుం బరగ • విచ్చియు నొచ్చియు మచ్చరంబుతోఁ
గాసిఁదలిర్ప నిప్పగిది • కయ్యము దయ్యము మీరుఁగఁ జేసినన్ ౧౦౩

చ. అనువుగ వారుబట్టిన శ • రాసన బాణ కృపాణ తూణముల్
తునుకలుగాఁగఁ జెట్టిదపు • తూపుల నేయుచు వారివర్మముల్
దునిమి తదంగ కంబులను • దూరగ ఘోర తరాశుగంబులన్
జొనుపుచు రక్తపూరములు • జొబ్బిలఁ జేయుచు కౌతుకంబునన్ ౧౦౪

క. గంధేభగమన సుందరి ని / ర్గంధన మొనరించి కార్ముక • ప్రోద్ధ్యుతగో
గంధన సఖవిశిఖా సం / ధానితముగ వేశ్యా సుతుఁ • జతురిమ మెఱయన్. ౧౦౫

వ. అప్పుడమ్మాగధ బలంబులు. ౧౦౬

చ. తమతమ దర్పమేర్పడ మ • దంబున గొల్లలఁ జేసి సంభ్రమిం
భ్రమితము జేభ ఘోటభట • పంక్తుల. నేరుపుచేఁ బ్రచక్రసూ
ద్యమమలరంగఁ జేయుచు య • థావిధిగా మొనలేర్పరించి, భూ
రమణునితోడ శత్రులుదు • రంబొనరించిరి పేరువాడుమన్. ౧౦౭

సీ. అట్టి సమయంబుఁ జూచి వై • శ్యాగ్రగణ్య
సుతుఁడు భద్రాయుఁ గనుచు నో • శూరవర్య
ఘనగదాయుద్ధ నైపుణి • గఁడు నాకు
చూడుమని వాహనము డిగ్గి • స్ఫురణ దనర. ౧౦౮

వైశ్యసుతుఁడు హేమరథు సైన్యంబుతోఁ గదాయుద్ధంబు సేయుట.

ఉ. దండధర ప్రచండతర • దండసమానమునైన పెన్గదా
దండముఁ గేలఁబూని, భుజ • దర్పము లర్వ నిజాంగకప్రభా
మండల మానదేశమున • మార్బలముల్ గని భీతిజెంద ను
ద్దండ పటుత్వ మొప్పఁ బవి • దారణ మీసఁ బొల్చి నిల్చినన్ ౧౦౯

క. కనినుగ ఘాధీశ్వరుమి। త్రినిపహ సధ్యమునశూ ధన్యుండనువాఁ
డనుపమ బలదర్పంబున। జనవ కింపురు నుగ నవ। సంగోనివచ్చెన్. ౧౧౦

వ. ఇట్లువచ్చిన యమ్మైత్రీనందనునకు నభిము ఖుండై. ౧౧౧

మ. సమదాటోపతవార లిర్వురుజయే చ్ఛాబొరుచో నుండలఁ
భ్రమణంబుల్ బటుసింహ చంక్రమణముల్ పాటిల్ల నుద్యద్గదా
సమిదారంభ విజృంభితోభయగదా సవ్యాపసవ్యప్రభా
దము లం జప్పుడు లుప్పతిల్ల భవదా నాదంబు సంబో నుచున్. ౧౧౨

వ. మత్తేభగతి గజగతి వ్యాఘ్రగతి, సింహగతి, జంబుకగతి, మర్కటగ
తి, మార్జాలగతి, హరిణగతి, చటకగతి తాండవగతి, మొదలగు ద్వాదశగ
తులు జూపుచు పరిభ్రాంతంబు నాప్లుతంబు నావిద్ధంబు నాపాతంబును విభ్రమ
ణంబును మానుషంబును నిర్గతాగ్రాకంబును జితాకంబును భిన్నంబును సవ్య
కరంబును దుంగ బాహువు నాపృష్ఠపహారంబు వేల్లితంబును గురించి తంబు
నుస్వస్తికంబును మొదలగు ద్వాత్రింశత్ప్రకారంబులఁ బచరించుచు. ౧౧౩

చ. మొనలు గనుంగొనంగఁ దల పుష్పరిగాఁగనియుంగఁ జుట్టి నె
మ్మనముఁ గోపముల్ గదుర మర్మపిఘాతన మాచరించునే
ర్పున బహువిచిత్రమార్గములు మూపు విపులు మోది మోది తెం
పొనరగ సేవదీన్పుకొన, కోప వైపున నేపుజూపుచున్. ౧౧౪

శా. పాదద్వంద్వ సమాహతింగలహాభూ భాగంబు గంపింపశే
షాగుల్ తద్భర హానిఖేద మున ని ర్వ్యాపారు లైయుండపె
న్వేదండ ములు సింహముల్ శరభముల్ ద్వీపుల్ మహోత్తుంబులున్
భేదంబించుక లేక పోరఁగతిని కీర్తిన్ విజృంభింపుచున్. ౧౧౫

వ. ఇవ్విధంబున. ౧౧౬

మ. చలవాదంబలరన్ స్వసంభృతగదా సంఘట్టనప్రోజ్జ్వల
జ్జ్వలనజ్వాల భవస్ఫులింగములచే సంగ్రామరంగ

స్థలదుద్వేషిణు లొక్కపెట్టునఁ గలంగం గంబార తద్గాత్రముల్
శలభాభంబులఁ జేసి కాల్చి నిధన స్థానంబు నొందించినన్. ౧౧౯

క. ఇనతనయుఁ డివ్విధంబున। దన నెచ్చెలియైన వైశ్య తనయుఁ గుశీరన్
గని నీవు విశ్రమింపుము। ననుఁ గనుఁగొను యుద్ధమిపుడ నర్చెద ననుచున్.

—రెండవతూరి భద్రాయువు శత్రుసైన్యంబుతోఁ బోరుట.—

ఉ. చండతర ప్రభావిభవ శాతశరంబుల నేర్చి పేర్చి దో
ర్మండల కుండలీకరణ మండితచాపలతా విశేషుఁడై
ఖండనభూమి శాత్రవుల భల్లముఖంబ దెగటార్చి యా
ఖండల దివ్యముఖ్యులును కౌతుకమానసులై కనుంగొనన్. ౧౨౦

వ. అట్టిసమయంబున భీషణహేషావిశేషరంగత్తుంగతరంగసన్నిభంబులగు తు
రంగంబులు ప్రావృట్సమయోచిత పర్జన్య గర్జావిజృంభణ శుంభచ్చతుర్దంత
కాంతంబులగు దంతావళంబులు దీర్ఘఘుర్ఘరస్వనదావక్ర చక్ర సుందరంబుల
గు స్యందనంబులును చటులాయుధ పటల సముద్భటులగు వీరభటులును; ని
జాధిపతి పనుపున నడువ దచ్చతురంగబల పదాఘాత భూతల సముద్భూత
ప్రభూత ధూళిపాళి పిహిత కాంతిగలిగి మార్తాండ మండలంబు కళఁ దొలం
గ విశ్వవిశ్వంభరాతలంబు తద్రజోమయంబై వెలుంగ ప్రతిపద వాద్యమా
నోద్యద్భేరీ పటహ ఢక్కా కాహళ ఖతాళ మర్దళాది వాద్యవిశేషంబులు
మ్రోయ తత్స్వరాగ భరంబున మునింగి యొకరొకరు నెఱుంగక పేరెలుగుల
మెలంగుచు కనకమణి మయంబులగు తమతమ ధ్వజంబులు మెరయ
కూట యుద్ధంబునకుఁ జొచ్చి భిండివాల మండలాగ్ర
భల్ల నారాచ సోపాన సఖర ప్రముష్టి ముద్గర శూలముసలభుసుండి
క ప్రాసపకూర్మ్య కంపనగద కుఠారోద్దండ కణయకుంత పరశుచక్ర పరిఘప
ట్టసంబులను పంకిణి సబళంబుల సెలకట్టెల చిరుతచేయమ్ముల గొరకలును
రియలు మొదలగు బహువిధాయుధంబుల నారాకుమారుంగప్పుచుఁ గది
యం గనుంగొని. ౧౨౧

క. ఆరథికులలో నొక్కఁడు। హారథుఁ డెదుటన్ వసింపక నతిజవమునన్నా
త్మాహూఢహయము ముడిగి గరు। డారయమునఁ దద్రథంబు నందుచు కడిమిన్.

గీ. సుశితాస్త్రంబుచే వాని • సూతుఁదునిమి
తద్రథికు శిర మొక్కన • స్త్రమున నరికి
తా మహారథుఁడై యుండి • తనదుసఖుని
సారథిగఁ జేసి వరశరా • సనము గాన• ౧౨౩

వ. అట్టియెడ. ౧౨౪

ఉ. దారుణవృత్తి మాగధులు • తద్గతసారథి కాథ్యు తేరుదా
గేరుచువచ్చి హెచ్చియిరు • క్రేవలఁ గ్రిందను వెన్క ముందరన్
సేరుపుమీరనిల్చి యతి • నిష్ఠురశస్త్రములేసి యాజ్యాల
ద్వారిధరంబు లొక్కమొగి • వారికణంబులు రాల్చున ట్లె వడిన్. ౧౨౫

వ. ఇట్లు గదిసినం గనుంగొని.

సీ. ఆమహారథికుండు • వామదక్షిణపాద
జలజముల్ సవ్యాప • సవ్యములుగ
సాచిపార్శ్వద్వయీ • సంచరత్పంచక
శూన్యవర్యులముందు • స్రుక్క జేసి
సహముగాఁ బదపడ్డ • యమళంబు నియమించి
చరమభాగస్థాన్న • వసులనడఁచి
మంథానదండసం • భ్రమణంబు నొందించి
యుగ్రతస్సరనవ • త్సాళిఁగలఁచి

గీ. యంఘ్రి సరసిరుహంబులునా • మామములుగఁ
జేసి తన తేరుక్రిందటఁ • జెలఁగుచున్న
బలువిరోధి వరూధినీ • ప్రభులదోచె
భూరిశరములచేత న • ద్భుతనియతని. ౧౨౬

కం. సమరధిక ప్రత్యాలీ ఢమునాలీఢంబు మునుగ • డత్తానుచుండన్
సమపాదమండలంబున కమనీయస్థానపంచ • కంబునజోరెన్. ౧౨౭

వ. ఇట్టియెడ. ౧౨౮

ఉ. కొండల మందకప్రకర • కూటవకూట విధంబు దోపగా
వందడిగాఁగ గూడి శర • జాలములన్ నిగుడించి మించనా
నండడి కయ్యమియ్యకొని • శౌర్యధురంధరుఁడైన రాట్సుతుం
డెంచుచు జూడఁదానగుచు • నేపడిచెన్ రిపుకోటి నయ్యెడన్. ౧౩౦

వ. మఱియును, ౧౩౧

చ. సొగసగు కెంపుసొంపుగల • చూపులఁ బుట్టిన కోపవహ్నిఁ గ్రొం
బొగలెగయంగ గాద్రరస • పూజ్యతరాజ్యము చేతఁ బైపయిన్
నెగడఁగఁ జేసి యీనున న • నీకచరాస్యలమీఁద దీపితా
శుగమరి, బోసియేయనది • సూరెలముట్టి దహించె గ్రేల్మిడిన్. ౧౩౨

ఉ. ముక్కులు చెక్కులుం చెవులు • మూపులు వీపులు జానుజంఘలున్
బక్కలు డొక్కలున్దలలు • ఫాలతలంబులు రంబులూరువుల్
జెక్కసపాటొనర్చ శర • వేగమెలర్పఁగఁ జిక్కుచిక్కుగాన్
జెక్కుచు నుక్కడంచె రిపు • సేనల గక్కున నుక్కుమీరగాన్. ౧౩౩

వ. ఇవ్విధంబున నయోధ్యాధవరుండు లయకాల కాలగళాభీలాలీక కీలికీలా కలాపంబు మెరసిన తెఱంగునఁ గాండ్రపకాండంబులు నిగుడింపుచు నిజబలంబులఁ గసిమసంగినం జూచి కోపాటోపంబున హేమరథుండుదగ్రుఁడై. ౧౩౪

మ. విలసచ్చాప విలాసకౌశల సమా • విర్భూత తేజంబుతో
బలవద్బాణ పరంపరల్ గురియఁద • ద్బాణంబు లావ్యోమభూ
తలమార్గంబులఁ బర్వి వైరి జననం • త్రాసంబు సంధాల్చియు
జ్వాలుఁడా రాసుతుపై పయిన్నిగుడగీ • ర్వాణోత్తముల్ భీతిలన్. ౧౩౫

వ. ఇట్లు నిండిన, ౧౩౬

సీ. అమ్మహా వీరాధ్యుఁ • డాశీవిషాభంబు
లై హేమరథుఁడేయు • నస్త్రములను
దిలలంతలై పోవ • ద్రావాశుగంబులఁ

బరగించి తచ్ఛత్రు • బలము లెల్ల
జర్ఝరితాంగులై • సమరవిద్రావంబు
నొందంగఁ గుందించి • డిందుపరచి
చండకోదండకాండ • హిండితాంచితభుజా
దండకుండలితకో • దండమలర

గీ. సర సకరపద్మ సవ్యాప • సవ్యముక్త
నిబిడశిత శిలీముఖ • నికరములను
సమర సమయసముద్భూత • సాహసప్ర
తాపదీపితుఁడై రణ • స్థలినిగుడ్చె. ౧౩౭

వ. ఇట్లు నిగుడించి వేఁడిమిఁజూపిన. ౧౩౮

మ. జ్వాలానాంత్రము బరివోసి హేమరథుఁడా • శర్వప్రసాదోజ్జ్వల
ద్జ్వలదగ్న్యస్త్ర మహాప్రభావుఁడగునా • భద్రాయువైనేయఁది
క్కులు నిండన్ జను మంటమింట సెగయన్ • ఘోరస్ఫులింగావళుల్
గలయంబర్వఁ జిటచ్చిటార్భటులుసు • గ్గన్నట్టుగా వచ్చినన్. ౧౩౯

సీ. ధళధళద్దీప్తి సం • ధానా చిరప్రభా
దూరస్వ గాఢాంధ • కారమగుచు
ఘుళఘుళధ్వాన ని • ర్గళిత నిర్ఘాతాప్తి
బధిరీకృతాజాండ • భాండమగుచు
ఫెళఫెళ స్స్వనగ • ర్భిత నిష్ఠురార్భటీ
స్తనితభీమాభవ • త్స్వర్గమగుచు
గళగళనాన్దనసం • కలిత కూలంకషా
పూరితాకూపార • వారియగుచు

గీ. ఝుళఝుళ స్వనభేదసం • జాతధూత
వారిధారాళి ధారాను • కారిఘోర
వారి వాహాంబుజనియించు • వారిదాస్త్ర
మేసి భద్రాయుఁడన లాస్త్ర • మలగలంచె. ౧౪౦

ఉ. భూధర బాణమామగధ • భూధవుఁడేసిన సర్వలోకసం
బాధకరంబుగాఁగ బహు • పర్వతరూపము దాల్చి యప్పుడా
యోధన భూమిజృంభితబ • లోద్ధత రాట్సుతుమీఁదఁ బెన్శిలా
సాధనముల్ సగుడ్చుచును • సత్వరవృత్తిఁ గడంగ నయ్యెడన్. ౧౪౧

సీ. భద్రాయువంతదీ • పస్త్రంబె దనర్చిన
దంభోళిశస్త్రము • దగతినిగుడ్చ
నదికోటి శతకోటి • యై తేజితస్వీయ
ధారాప్రభాధాళ • ధళ్య మెనయ
చటులమాగధసమ • సృష్టితాస్త్రంబుపై
నిగుడి మున్నెన్నంట • నెగయుచుండ
గండశైలములతోఁ • గదియంగ తత్పక్ష
ముల దచ్ఛిలాదుల • ముదుదుంచి

గీ. గిరులఁ దరులఁ దనుద్బద్ధ • హరులగిరుల
జరుల గిరులఁ దదుద్యాన • తరులనిరుల
మూలహీనంబులైపోవ • నేలగలిపి
చనియె శత్రుబలంబులు • సంచలింప. ౧౪౨

శా. బ్రహ్మాస్త్రంబరివేసి యేసెనపుడా • ప్రత్యర్థినాథుండునా
బ్రహ్మాస్త్రంబు మఖప్రపంచము,భయ • భ్రాంతిస్థితిన్ జెందనా
జిహ్మప్రక్రమునై జసైన్యము నుతుల్ • సేయంగ సాటోప్పర
బ్రహ్మేశాన వరప్రసాదుఁడగు నా • భద్రాయుపై నల్కతోన్. ౧౪౩

శా. ఆవేళన్ శివవర్మధారియగు భ • ద్రాయుర్మహావీరుఁడా
ద్యావాభూములు ఘూర్ణిలన్ నిగుడుబ్ర • హ్మాస్త్రంబుపై దోర్బలా
సావిర్భూత కుతూహలంబడరఁ • బ్రత్యస్త్రంబు చేదానిని
ర్జీవంబై దనరంగఁజేసె సురలా • శీర్వాదముల్ సేయగన్. ౧౪౪

సీ. ప్రబలమాగధుఁడంత • బహుళమాయోపేత
రాక్షసాస్త్రం బేయ • రయము మీర
నది ఘోర శరభసిం • హవ్యాఘ్రసూకర

వుండు పోనీకుండని యార్పులు పెడబొబ్బలు సలుపలు నింగిముట్టం జేయుచు
బరిఘాది సాధనంబు లడరింపుచుం గవిసినం గనుంగొని. ౧౪౨

గీ. ఇటులం దనుఁజుట్టుకొన్నట్టి ♦ చటులశౌర్య
ధుర్యులగు శాత్రవులఁ జూచి - ధైర్యశాలి
యైన భద్రాయుఁ డతికరు ♦ ణార్ద్రివృత్తి
దనర హింసింపఁజాలక ♦ తడయకపుడు. ౧౪౩

శా. అంభోజప్రభవాండముల్ బగులమా ♦ ద్యచ్ఛాత్రపాలంభసం
రంభారంభ విజృంభమాణ విలయా ♦ భ్రధ్వాన వద్భాంక్రియా
స్తంభీభూత జలేంధనాగ్నిభయకృ ♦ త్సన్నార్ణ వాహావకృ
చ్ఛుంభచ్ఛంఖము నెత్తె రొట్టునతుఁడని ♦ సర్ఫూర్తి ప్రభావంబునన్. ౧౪౩

సీ. అట్టిశంఖానాద ♦ మాత్మహృత్పుటములు
భేదిల్ల నత్యంత ♦ భీతినొంది
ఘోటకరథరథ్య ♦ కూబరాన్వితులై వి
సంజ్ఞచే భూమిపై ♦ జచ్చినటుల
బడి మూర్ఛనొందినఁ ♦ బరగఁ గన్గొనిదయా
భుత్వంబుతోనరి ♦ జిత్వరుండు
పీతాస్త్ర శస్త్రిల ♦ విగతవాహనులను
పష్టచే తనులను ♦ నయవిధిజ్ఞుఁ

గీ. డగుటచేఁ జంపనాదని ♦ యాత్మఁదరసి
హర్షమెసఁగ రథావరో ♦ హణ మొనర్చి
మనయుగన్గొని పాశబం ♦ ధనమునొందు
మజ్జనకుని గనుంగొను ♦ మాన్యచరిత. ౧౪౫

క. బలవంతమైనసర్పము। చలిచీమలచేతఁజిక్కు ♦ చందంబునఁదా
బలయుతుఁడయ్యును శాత్రవ। బలములచేఁ బడియె నైన ♦ బలరహితుండై ౧౪౬

గీ. అదియుగావునఁ దొలిబాము ♦ లందుఁజేయు
పాపపుణ్యము లనుభవిం ♦ పకతొలంగ

సీ. ఓ రాజ•వినుమిమ్మ • హారాజ తనయుండు
భూమిఁజూడఁగవచ్చి • పొదలుచున్న
యింద్రుఁడో చంద్రుఁడో • యినుఁడోయుపేంద్రుఁడో
తెలియంగవలవదీ • తేజఁగుమనకు
మనమహాభాగ్యంబు • మనతపఃఫలమెన్న
నాశ్చర్య మయ్యెనీ • యవనిలోన
ధన్యుఁడై తగినయా • ధరణీశ సుతునిచే
విజితులై రిపులెల్ల • వెగడుపడిరి

గీ. చెలఁగి యితఁడు మహాయోగ • సిద్ధుడేమొ
మఱితపస్సిద్ధుఁడో లేక • సురవరుండొ
కానిచోనీయమానుష • కర్మమితని
చేవిజృంభించునా • యింత జెప్పనేల? ౧౬ ౧

గీ, ఇతని జననీజనకులయు • న్నెన్నిచూడ
బార్వతీ పరమేశ్వరు • లుర్విలోనఁ
నిముషమాత్ర శతాక్షౌహి • ణీబలంబు
బలవదాశుగముల బరయ • ల్పడనడంచె. ౧౬ ౨

వ॥ అని బహువిధంబుల స్తోత్రంబులొనరించి ౧౬ ౬

గీ॥ ఇవ్విధంబున నత్యంత • హృష్టు లగుచు
మహామహాశ్చర్య సంయుతా • మాత్యవరులు
తోషమలరంగ వరమహా • త్మునఁడవటంచు
బలుకుచుండంగ నమ్మహా • భావుఁడప్పుడు.

సీ॥ విస్మయానందాను • విద్ధుఁడానందాశ్రు
పిహితాక్షుఁడును ప్రేమ • విహ్వలుండు
నైనట్టి జనకున • భ్యర్ణమానటఁజేరి
దండ ప్రణామముల్ • దగ నొనర్ప
నా రాజు ప్రణయాప్తి • నభివాదన మొనర్చి
ధన్యునిఁగని గాఢ • తరముగాఁగ

నర్వము వచింపునను నీవు ♦ నిర్వహింపు
దేవుఁడవుగాక పరుఁడవే ♦ ధీరవర్య. ౧౭౦

క. అని యివ్విధమున జనపతి। వినయంబునఁ బల్కు ధైర్య ♦ వీర్యఘనుండ
జ్జనసుతుఁడగు భద్రాయువు। సనునొందగ నిట్టులనియె ♦ నందఱువినఁగన్. ౧౭౧

సీ. ఇతఁడు వైశ్యసుతుండు ♦ కుతలాధినాయక
సునయాఖ్య మత్సఖ ♦ స్ఫూర్తిఁ నొందు
నేనితనింట వి ♦ నీతమజ్జననితో
సతతంబు వర్తింతు ♦ సౌఖ్యగరిమ
భద్రాయురాఖ్యచే ♦ బరగుచు వర్తింతు
వెనుక వచింతు మ ♦ ద్వృత్తమెల్ల
ఘనమదంబున నిన్ను ♦ గాసినొందించిన
పరిపంథి బలమెల్ల ♦ బడలువడియె
గీ. మునుసభృత్య సుహృన్మంత్రి ♦ ముఖుఁడవగుచు
నిజపురంబు ప్రవేశింపు ♦ నిర్భయముగ
శత్రుసాధ్వస మొక్కింత ♦ సరకుగొనక
సమ్మదంబున వసియించు ♦ జనవరేణ్య ౧౭౨

మ. అదియుంగాక మదంచితాగమనప ♦ ర్యంతంబు దుర్బుద్ధిభా
జ్మదమత్తాఖిల శత్రుతాచరదధ ♦ ర్మప్రత్య నీకావళిన్
వదలంబోవక బంధనాలయములో ♦ వర్తింపగాఁ జేయుము
ద్యదయప్రాప్తిని నేనుఁబోయెద మదీ ♦ యాగారముం జేరఁగాన్. ౧౭౩

గీ. విశ్వజననాది హేతుత్వ ♦ విభవమొందు
నమ్మహేశ్వరు కరుణనా ♦ యందుఁగలదు
గాన శాత్రవులఁ, ద్రుణాయ ♦ మానముగను
జేయఁజాలిన నేగల్గఁ ♦ జింతవలదు. ౧౭౪

మ. అని యీరీతినిఁ బల్కి యానృపతిము ♦ ఖ్యాదిష్టిఁ జెన్నొందిసం
జనితానంద మమందమై నిగుడసౌ ♦ జన్యాత్మ భద్రాయుఁడా

వ. నరేంద్రా; ఈ మహానుభావుండు శేషనరపతి శిరస్సమభ్యర్చిత శాసనుండై పాకశాసనుండనందగు గరతలోపలక్ష్యమాణ శంఖ చక్రలాంఛనుండై చక్రధరుండనందగు, నిర్జితమన్మథుండై హరుండనందగు విమానాహితరాజహంసమండలుండై కమలసంభవుండనందగు లక్ష్మీజనకుండై సముద్రుండనందగు ననవరత ప్రవృత్త దానార్ద్రీకృతకరకమలుండై దిగ్గజంబనందగు మహైశ్వర్యంబులకుఁ గర్త సకలశాస్త్రంబుల కాదర్శంబు క్షాత్రమ్ముండ్లకుంబు నకు దయాశైలంబు సహితజనముల కుత్పాతహేతువు సాహసికులలో ధౌరేయుండు, వినతానందజనకుండై వైనతేయుండనందగు చాపకోటి సముత్సారిత సకలారాతి కులాచలుండై వైన్యుండనందగు నతని జన్మక్రమంబు తెలియంజేసెద నాకర్ణింపుము. ౧౮౧

శివయోగి చంద్రాంగదునకు భద్రాయువు జన్మాదికము చెప్పుట

సీ. అధిప, దశార్ణదే • శాధినాథుఁడు వజ్ర
బాహుండనెడు నొక్క • పార్థివుండు
తగుమాత్రసంయుక్త • దారరత్నంబును
రోగపీడితయని • రోసివిడువ
విడచిన నారాచ • వెలఁదికి నుదయించు
తనయుండు నావల • ననుసమస్త
విద్యలెఱింగి సం • విద్రూపుఁడైనట్టి
శివుని వర్మమునఁ బ్ర • సిద్ధిఁ జెందె

గీ. ద్వాదశ సహస్రగజబలో • దాత్తుఁడగుచు
తనదు పితృసంకటము బాపి • ధన్యుఁడైన
యొకఁడు వైశ్యుని పురమునం • దున్నవాఁడు
గాన నీపుత్రికనుగుణుం • డైనవాఁడు. ౧౮౨

రాజకన్యలలో ధన్య • యై జగతిని
వెలయు నీసుతకమ్మహా • వీరవరుఁడు
భర్తయై యుండెనా, మహీ • పాల, నీదు
జననసాఫల్యమెంతని • సన్నుతింతు

గీ. అతఁడు భద్రాయువను సమా ♦ఖ్యను వెలుంగు
నార్యనుత శీఘ్రమున విశ్వహా ♦ కార్యమునకు
నిచ్ఛయింపంగఁ దగునని ♦ ఋషభయోగి
నిజగృహంబున కేగె నో ♦ నిర్మలాత్మ. ౧౮౪

వ. నిజగృహంబు నందుండుచు నొక్కనాఁడు ౧౮౫

సీ. శ్రీమంతుఁడైన యా ♦ ఋషభ యోగీంద్రుండు
భద్రాయుఁగనఁగ సం ♦ భ్రమమొలర్ప
వచ్చిన నయ్యోగి ♦ వరుఁగాంచి సాష్టాంగ
దండప్రణామముల్ ♦ దగనొనర్చి
ముకుళిత హస్తుఁడై ♦ ముందునిల్చినఁ జూచి
నవ్వి గాఢాలింగ ♦ నంబొనర్చి
యోపుత్ర మగధదే ♦ శోద్దీర్ణ బలముల
గెలచి వచ్చిననీదు ♦ బలిమి కలిమి

గీ. నెంతవర్ణింతు వినుము భూ ♦ మీశ్వరాగ్ర
గణ్య; చంద్రాంగదుని పుత్రి ♦ గలదు కీర్తి
మాలిని యనఁగఁ దగునది ♦ మాననీయ
నీవు పెండ్లాడవలయును ♦ నిక్కముగను ౧౮౬

*గీ. అతఁడు నీకిచ్చుటకు ♦ మది హర్షమొందె
నీసఖుండైన యొక ♦ విప్రు నీతిమంతు
గా విచారించి పంపుము ♦ కన్యఁ జూచి
వచ్చునని చెప్పి చనియెన ♦ వ్వరయుశుండు.

క. ఆ యోగీంద్రుఁడు చనభ । ద్రాయువు తనచనువు నెనయు ♦ నవనిసురునితో
శ్రీయుత తత్కాన్యమణి । నీయెడఁ గని రమ్మనుచు మ ♦ హేచ్ఛతఁ బలికెన్

---

పాఠాంతరము *గీ. అతఁడు నీకిచ్చుటకు మది ♦ హర్షమొందె
నీసఖుండైన సునయుండు ♦ నీతిమంతు
డితఁడు సుజని తత్సమాచార ♦ మెఱిగినీదు
కోర్కె సఫలంబుగాఁ జేయు ♦ గుతుకమునను. ౧౮౭

సీ. అమ్మహీసురుఁ డలరిచుఁ • బ్రాంగవాధి
నాయకునిగాంచినాతఁడా • సర్వ భక్తి,
కలరి యాకీర్తి మాలినీ • కలితరూప
లక్షణంబు లనరయుచు • దక్షణంబా

క. వచ్చి ధరణీశతనయుని । గ్రుచ్చి కవుంగిటనుఁజేర్చి • కొని వినయముతో
నచ్చు పడతద్విలాసము । నెచ్చరికఁ వచింపఁ దొడఁగె • నీహితవృత్తిన్

ఉ. చూచితి దేవతాసతులఁ • జూచితి యక్షపయోజనేత్రలన్
జూచితి నాగకన్యకలఁ • జూచితి సాధ్యవధూల లామలన్
జూచితిఁ గిన్నరాంగనలఁ • జూచితి సర్వజగల్లతాంగులన్
జూచితిఁగాని యీపడఁతి • జోడగుచేడియ గాననేకడన్ ౧౯౨

సీ. చిలిరులు తాబేళ్లు • కమలగర్భంబులు
కదళీకాండములు సై • కతముసుడియు
వినుతరగలుకను • పీనుల జాడరి
శైలముల్ బిసములు • సారసములు
దరము దర్పణముకుం • దములు ప్రవాళంబు
కనకంబు మీనముల్ • కార్ముకములు
సిరులర చందురుం • డొరపైన తేటులు
కటి మొగుల్ కమలంబు • మెఱపులీగ ౧౯౩

గీ. లునుదొగలునువ్వు బువ్వును • వసజవైరి
శిలలు నవసంఖ్యలును పూగ • ములునులతలు
పనటుల సిరేఖకూపంబు • లనటులుకరి
కరములును గాశైలును మేను • లలరబోలు ౧౯౪

సీ. పారబోని మేఘంబు • పాలిపోని చందురుం
డలిగాడ్పుసోకని • జల జములును
జిగిబిగి బాయని • సొగసు నంటగ మొగ్గ
నిద్దంపుటప రంజి • యద్దములును
చిలుకముట్టని బింబ • ఫలమంచ లంటని

పూడులు కోవెలల్ ♦ జూడనగ్రతీ
శలిరులు నెలడాల ♦ నలయని రిక్కలు
మెరసి నిల్కడగతి ♦ మెఱుఁగులీగ. ౧౫

సీ. తురుము నెమ్మోము గన్గవ ♦ యొరపునాస
చెక్కుల ధరంబు భుజములు ♦ చేతులునఖ
ములును మైవన్నె లైవగ ! ముద్దరాలి
నంచితంబుగ నలువ ని ♦ర్మించెనేమొ. ౧౬

గీ. నలువ వికచశిరీషకో ♦ మలపరాగ
మిందు మృదితామృతంబులో ♦ నెనయఁజేసి
త్రిముఖముల్ ద్రిజగద్గత ♦ శ్రీవహించి
కడమ ముఖమున నిర్మించెఁ ♦ గమలముఖని. ౧౭

క. వెలఁదుక కన్నులకాటుక। పులుఁగులగుటఁ దెలిసియెగరఁ ♦ బోయీసనిక
న్నుల విలుతుఁడు రులనొడ్డిన। చెలువున ముంగురులుదనరె ♦సింగారము గాఁ

ఉ. మేనికడానిలోనిజిగి ♦ మించిన మంచిమొగంపు సొంపుడాల్
పాలమడుంగునం జిరుత ♦ పాయమునంబొరలాడు జోడులో
వాలుగ మీలనన్గఁదెలి ♦ వాలు కనుంగవ నుల్లసిల్లున
బ్బాలిక కంచులోకములు ♦ ప్రస్తుతిఁజేయును బ్రస్ఫుటంబుగాఁ. ౧౯

గీ. కలికి నిడు సోయగవు ... లు ♦ కన్నుగవల
వలన గ్రుమ్మరు లావణ్య ♦ జలధినడుమఁ
జెలువు గరచింపఁ బూనిన ♦ సేతువనఁగ
భాసురాంబుజలోచన ♦ నాసమెరసె ౨౦

సీ. అధరామృతప్రవా ♦ హప్రతిక్షణజాత
నూతన బుద్బుద ♦ వ్రాతమనఁగ
యౌవ్వన మన్మథో ♦ ద్యానవాటీలస
ద్దాడి మఫలబీజ ♦ తతియనంగ
నానసపద్మప ♦ ద్మాల యాంగణసీమ

రంజిత మౌక్తిక ♦ పుంజమనఁగ
గించిద్వికచముఖ ♦ ప్రాంచత్ప్రమోదినీ
రసపూరకోరక ♦ విసరమనఁగఁ

గీ. లలిత రదనాంశు కారణ ♦ ఫలకలిఖిత
పంచబాణప్రతాప ప్ర ♦ పంచ విజయ
శాసనాక్షర సంతతి ♦ చందమమరఁ
గాంత కాంతామణీదంత ♦ గణము వెలసె. ౨౦౧

గీ. వరుసనైయొక్కవలుతక్కు ♦ వలుద లంగి
యొక్క తీరునఁ బెంపొందు ♦ చున్నదంత
పద్మరాగాళిఁ బెనగొని ♦ పరగినట్టి
తావిసకలాలితనుకన ♦ మోవిదనరె. ౨౦౨

సీ. కన్నుల విలుకాని ♦ యెన్నికజాళువా
జంజాళి యనఁదొప్పు ♦ నేకియనాస
చక్కరవిలుకాని ♦ చక్కని తోల్లటి
చిలుకల నఁగవెలుఁ ♦ జెలియకనులు
రాచిల్క నెక్కెడు ♦ రాయని తీరైన
విండ్లనఁగను నట్టు ♦ వెలఁది బొమలు
సింగారమైనట్టి ♦ సిరి పట్టిబంగారు
పలుకయనం దోచుఁ ♦ బడఁతి నొసలు

గీ. మరుఁడు శ్రీపుత్రుఁడనుమాట ♦ యెఱుకపడఁగఁ
జేయుచందమ్ము దోపన ♦ చ్చెలియవీను
లగుచు శ్రీలు మెలంగెనో ♦ నమచుఁబోగడ్డ
భ్రమరకుంతల జూపట్టు ♦ సుమశరమన. ౨౦౩

గీ. అలరువిల్తుఁడనేడు గెల్చి ♦ డెలివమైన
లలిత శృంగారలక్ష్మి వి. ♦ లాసములన్న
లలివినిర్మించుటోఁ దోలు ♦ దోలుతెళంకు
నిలిచెనోయన దసరారె ♦ కలికిగళము. ౨౦౪

సీ. అనురాగ రత్నప్ర • శస్తనకాశైలములన
మకరాంక కన్యకం • దుకములనఁగ
వరదేహ జన్యలా • వణ్యపుంజములన
స్వాంతసరోజకో • శములనంగ
మదనమోహనభూతి • పదకరండములన
గంతునిర్వక్రచ • క్రములనంగ
హారమృణాళసం • చారకోకములన
భవమహీ రుహామూల • ఫలములనఁగ

గీ. పధికలోక జగీషాప్ర • వర్తనప్ర
భవపరిశ్రమలాల స • పంచబాణ
సుఖనివాస గృహములన • సుందరాంగి
కులుకుగుబ్బలు దనరారెఁ • బొలుపుమీర. ౨౦౫

క. గ్యకాంచ నాచలాచల। దళదురు సంజీవనీల • తాఫలములనన్
విలసిల్లె దదురోజయు। గళమనఁదగు లీలచేవి • కాసము దనరన్. ౨౦౬

చ. మెఱఁగుదొరంగు తుందమను • మేలిమిబంగరు రంగుటాకునన్
మరుఁడు తదీయరూపమహి • మాతిశయంబున కన్యమీనుగా
దొరయదటంచు కజ్జలము • తో లిఖియించిన నాగరంబనన్
సరసిహాక్షి చక్కనగు • శ్యామలరోమగణంబు పొంపగున్ ౨౦౭

క. చూపట్టినట్టి పొక్కిలి। లోపల విలసిల్లు కడ • లోలమనోభూ
దీపపు కొడియన నూగా। రాపూర్ణ శశాంకవదన • కందంబయ్యెన్ ౨౦౮

గీ. అంశుక వ్యాప్తిచే మధ్య • మాస్తికత్వ
మొగిప రామరిశించిన • యొనరుననుచు
నంబుజాక్షి మనసుపట్టు • ననుటగాని
తలఁచిమాడఁ గృశత్వంబె • దానికిరవు. ౨౦౯

చ. ఉరుకుచ కుంభపాతమున • కోర్వకనో? యటుగాక భావిన
త్పురుష కరోరుపాశమునఁ • బుట్టిన ఖేదముచేతనో మొ? రు

సరసిరుహాక్షి నెన్నుదురు ♦ చారుకృశత్వముబూనెఁ గాని-చో
గురుగతి లోచనంబులకు ♦ గోచరమై విలసిల్లకుండునే ౨౧౦

మ. తలిరుంబోఁడినిగూడు రేడుత్రిజగ ♦ త్సంమోహ విద్యానవ
ద్యల సద్భావ పరాక్రమ క్రమము పాం ♦ థప్రాణికోటిం జలా
చలవృత్తింభజియింపఁ జేయఁగ జయ ♦ స్తంభంబులన్ నిల్పెనాఁ
గలనన్ భీతమృగీ విలోచన తొడల్ ♦ గన్పట్టెనా పట్టుగాన్. ౨౧౧

క. అంగజుఁడనియెడు సామరి ♦ బంగారపు రంగులన్ వి, భాగింపుచు మున్
రంగారింపఁ బిన గుదెలన ♦ సంగన జంఘికలు నన్ని, సద్భాతిరీతిన్. ౨౧౨

గీ. జంఘికాగత లావణ్య ♦ జలధి జనిత
శుక్తులయ్యెఁ బదంబులు ♦ స్ఫుటితె తత్సు
ముఖవినిర్యన్మణులు చంద్ర ♦ ముఖి నఖములు
గాని సుమతారకలు పోల్కెఁ ♦ గానవయ్యె. ౨౧౩

గీ. తారకలు సరిగాఁజేయఁ ♦ దగదు నఖస
మాన మొనరుట కనిబ్రహ్మ ♦ యమృతబిందు
తతికి నిల్కడవన్నియ ♦ ఁదగనొనర్చి
వెలఁదినఖములు నిర్మించె ♦ ఁజెలువుదనర. ౨౧౪

ఆ. అంగజేభ శిరము ♦ నంగ వక్షముదోచె
గుంభయుగమురీతి ♦ ఁగుచములలరెఁ
గరముపోల్కెరోమ ♦ గణము జెన్నొందెఁద
దగ్రముగతినాభి ♦ యలరుచుండె. ౨౧౫

చ. అతివ విలోచనంబులు శి ♦ తాబ్జములంచుఁ గనీసి కామిమ
స్థితి నిరుమేనులందు నరి ♦ శ్రీ హరి నిల్పినఁ జూచిలక్ష్మితి
త్పతి నెడఁబాయలేక కను ♦ పాపల నేనెపమొప్ప నుండెన
ప్రతిహతవృత్తిఁ జెందునన ♦ పోయినిగాభువి నెన్న నిచ్చలున్. ౨౧౬

క॥ అలికంబరనెలఁ దెగడిన । నలికంబునచూపు దెగడు ♦ టది చిత్రముగా
దలకంబు మోయిలఁ దెగడిన । నలకంబును గళము దెగడె ♦ నారతలంపన్ ౨౨౮

క॥ వలమురిగళమైతగఁ గలు । వల మురిఁగొనులే తనగవు ♦ వసుధాస్థలిపై
గల మహిళామధ్యమమే । కల మహిళా మధ్యమంబు ♦ కమనీయంబై ॥ ౨౨౯

క॥ అవర వర్ణి నియమధరం । బావరవర్ణిని సుధాస ♦ మన్వితి మగుచున్
భావిదితమైన యానతి । భావిదితయున గ మిగుల ♦ భాసిలుచుండెన్॥ ౨౩౦

క॥ సరమాతను వసితోర । స్సర మావేనలి సుధావ ♦ సరమానుడిమేల్
సరమాపాక్కలి రత్నవి । సరమారదనాళి చెలిసు ♦ సరమా పొగడన్॥ ౨౩౧

క॥ ఆరమణిరో మగణకజ । రీరమ్య కుచంబు లలరె ♦ శ్రీదన రారన్
ధారాధర ధారాధర । ధారాధరములు తిరస్కృ ♦ తములై దనరన్॥ ౨౩౨

ఉ॥ జంబుగ జేకచంబు ॥ జలఁజంబుగ దే మొగమా మణీసమా
జంబుగ దేర దావళిగ ♦ జంబుగ దే నడలార హేమపుం
జంబుగ దే తొడల్ మలయు ♦ జంబుగ దే మయితావి చంద్ర తే
జంబుగ దే స్మితంబునని ♦ జంబుగ దే నడుమెన్న బోటికిన్॥ ౨౩౩

వ॥ అని యివ్విధంబున వివరించి॥ ౨౩౪

గీ॥ ఋష భయోగీంద్రుఁ డెప్పుడు నా ♦ హృదయమందు
స్ఫురణఁ బుట్టించుటయుఁ జేసి ♦ భువనములను
గలుగు కన్యలఁ గంటినా ♦ క[illegible]కివంటి
చెలినిఁ జూడంగ లేదయా ♦ శ్రీదవిభవా॥ ౨౩౫

వ॥ అని యివ్విధంబునఁగీర్తిమాలిని సౌందర్యాదిగుణంబు లేకతంబునఁ దెలియం
జెప్పిన నారాజ సూనుండు సంతుష్టాంతరంగుండై యుండె నట్టియెడ॥ ౨౩౬

గీ॥ అంతనక్కడఁ జంద్రాంగ ♦ దావనీశుఁ
డాప్తులనుఁజూచి పలికె భ ♦ ద్రాయువునకుఁ
గీర్తిమాలిని నొసఁగినేఁ ♦ గీర్తిశాలి
నైతి మీకంద ఱికనిది ♦ మార్గముగదా॥ ౨౩౭

క॰ అనవారలనిరి జనవర। యనుపమ సౌందర్యధుర్యుఁ ♦ డార్యుఁడు భద్రా
యునికంటెనరుఁడు లేఁడీ। వనధిపరీతమగు భూమి ♦ వలయములోనన్. ౨౩౭

వ॰ అనివారు సమ్మతించి యంతఃపుర స్త్రీలతో సాధ్వీరత్నంబగు సీమంతి
నికి భద్రాయురభ్యుదయాది కావ్యంతంబు వృద్ధబ్రాహ్మణ ముఖంబున
వివరించిన నాకీర్తిమాలినివిని తనమనంబునకు భద్రాయువు సాక్షాత్క
రించి నట్లయినఁ గరణత్రయంబు నతని యధీనంబు జేసియుండు సమయం
బున॰ ౨౩౮

సీ॰ ధారాలసితనారి ♦ ధారాలసితనరా
ధారాలసితహంస ♦ పరమగుచు
సదన నిర్వృత్సదా ♦ సవన మానసదురా
సదన వార్తికవిద్యు ♦ దుదయ మగుచు
భావ జరితహావ ♦ భావ పల్లవికాధి
భావ కృత్స్నితప్రం ♦ భావ మగుచు
హాల హాలేత్యనుల్లాప ♦ హాలవిలాస భృతిదో
హాల భుజాబల కృషీ ♦ వలము నగుచు

గీ॰ దేదివద్ధాతు భూతలో ♦ ద్ధితతల్లాగ్ర
వితత సీపద సీపనీ ♦ పతదసమకు
సుమస ముద్గీర్ణ ఘుమఘుమ ♦ త్సురభిభూత
లంబుదగ ♦ నంబు దాడంబ ♦ రంబు దోఁచె. ౨౪౦

చ॰ పలుతాపంబుల నాపసోపములు జూ ♦ పట్టంగ నిట్టట్టుగా
సినలసె స్వంటవలంతి దీనికిఁ గశై ♦ త్యప్రక్రియల్ జేయఁగా
వలెనంచున్ ఘనుడంత వృష్టిజనిత ♦ వ్యాపారముల్ జేయఁగా
బులకల్ మేనజనించిమించెనన మున్ ♦ బొల్చెన్ దృణాంకూరముల్. ౨౪౧

చ॰ కతల భూనుఖస్థలుల ♦ జెందుచుముందు వివిక్త తక్తకీ
టకము లసహ్య తాపవిలు ♦ తస్మహితత్స్నమయుండు పొందుఁబా
యక గిలిగింతఁ గొల్పుఁదరు ♦ ణారుణదీధితి మత్ప్రవాళపా
లికల సరుల్ ఘటించెనన ♦ లీలఁగనందనరారె నత్తఱిన్. ౨౪౨

చ॥ ముసిముసి మబ్బునస్ధనరు • ముత్తెపుబిత్తులనం దృణాంతసం
వసదురు శీకరంబులన • వద్యుత దంతర కీలితంబులై
మిసిమిపసిండి కెంపులన • మించుమెఱుంగు పురుంగు లొప్పనో
నసిగలచోటు గాటముగఁ • జాలుపు వానలులేని వేళలన్. ౨౮౩

మ॥ వినుతప్రాప్త యథాక్రమ స్తనితయై • విద్యుల్లతామూర్తియై
తను మార్గాగత వృత్తి మచ్ఛ్వసనయై • ధారాప్రవాహైకియై
కనదుత్తుంగ పయోధరోల్లసనయై • కన్ర్మాంబ రోపేతయై
ఘనసంగంబున వృష్టిఁజూడఁదగె లో • కంబుల్ మదిన్మెచ్చఁగాన్. ౨౮౪

క॥ అహమహమికా వివాదం । బహర హమా స్తనిత విద్యు • దంబునికరప
న్నహనములకు రోవర్షము । తహతహాపొందితేచె సకల • ధరణులనెల్లన్. ౨౮౫

మ॥ అలరున్ జానపదస్థలాంబువులు సు • ముద్యద్దూర్వానుధూమాలతో
జ్వాలాచ్ఛాదనముల్ నీరాంతరజలో • నారంబులనేక సంధ్యా సం
దుల ధూమాంకురముల్ జనించి వసుమ • ధుంజోరు ధారాకరం
బులుగాఁ దజ్జరరంబులంబుదములై, భూమిన్ దివిం జేయఁగన్. ౨౮౬

సీ॥ ప్రతిపదా దర్శాను • మితపత్త్రలాద్యంత
రంబులై తీచిరగ • త్తంబులలర
సర్వతస్థాపితా • ఖర్వోద్యదుర్వర్ణ పా
త్రంబులై పద్మాక • రంబులలరఁ
బరితప్త మత్స్యత • స్థిరదు కూలాచ్ఛాద
నంబులైతేటి నీట • ణంబులలర
విష్వక్స్ఫురిత్ప్రేక్షణీయా • విఖ్యాత తారకా
రంబులై కల్యాది • కంబులలరఁ

గీ॥ బంటవలఁతి యానవాలు • గంటితోడ
మింటి తెరువరిదంట వా • ల్గంటనంటి
గంటకుండిన నివితోల్ల • నొంటిరియెందుఁ
దెలియ వేదియుంపనలవి యే నలువకైనఁ. వ॥ తదనంతరంబు॥ ౨౮౭

గంధిలాలేప సి • ష్యాసనంబు
వ్రదిక్ష స్ఫురగరోమ • జప్రచ్ఛదాచ్ఛాద
నేచ్ఛాసచ్ఛాలికా • హింసనంబు
స్థాపితాహార్ద్ర శో • షిత దుష్టనా: కుంభ
సంభూత కాంతాను • శాసనంబు

గీ. తప్తకాంచన కలదవ • ధ్వస్తశస్త
భూమధూమజ్వలన పరి • స్ఫురణచరద
యోమయ హసంతి కాదినం • యోగ జనిత
సుఖనికారణవ్య త్తిచే • సొంపుదనరె. ౨౫౫

సీ. సాంద్రచంద్రోపల • స్థగిత ధారాధర
సౌధాగ్ర కేళికా • సౌఖ్యకరము
సువాసనీయ హిమవారి • మర్దిత శ్రీగంధ
చర్చానుమోద ప్ర • సక్తిదాయి
సతత ఘుమఘుమ • త్సౌరభోద్గీర్ణకా
సారహారి విహార • కారణంబు
శీతలా నిలజాల • ధూతప్రసూనసం
వాసితో పవనప్ర • వాససేవ

గీ. నాస్పదంబును జంద్రా • పాభిరామ
మందిర ప్రాంగణాంభోజ • మాన్యప్ర
శనగ తాన్యోన్య పరిరంభ • జనకసమ్మ
దానహంబై వెలయుచుండె • నట్టియెడల. ౨౫౬

గీ. మథిత సజ్జాతి యగుచును • మధుపనికర
మెనసి కొలువంగమే నెఱు • గనివిభునితో
నేస్తమొనరించు టొక్కటే • నీచగుణము
గాని యిటువంటివాఁడు • లోకమునఁ గలఁడె. ౨౫౭

1. అట్టియెడ. ౨౫౮

సీ. పూచెనశోకముల్ ◆ పున్నాగములుబూరు
గలుకలి గొట్టులు ◆ తిలకములును
కాచెనామ్రకపిత్థ ◆ కదళీకాకంటకీ
ఫలజంబు జంబీర ◆ పాదపములు
నేచెసాలతమాల ◆ హింతాల తృణరాజ
నారికేళ పలాశ ◆ భూరుహంబులు
తోఁచెఁ గైరవసిత ◆ తోయజేందీవర
మాధవీమల్లికా ◆ మహితలతలు

గీ. పతితెమత్ మాతులుంగల ◆ వంగలుంగ
హింగుదీభుజ పత్రనా ◆ రంగగంధ
సారఘనసార సహకార ◆ సరళవకుళ
కురువకసితాసితాగరు ◆ కుజచయంబులు. ౨౬౫

సీ. తొలుదొల్తఁ దేనియల్ ◆ దొలుకుచుం జడిమంచి
ఫలజాతి యుదయించె ◆ నిలసితముగ
నాఫలసంతతి ◆ కన్న ముందుగఁ దోఁచెఁ
దోరగాయలపింజు ◆ మేరమీరి
యాదోరగాయల ◆ కాదిమై మునుదోఁచె
బుప్పొడిం దెలగున్న ◆ నివ్వటిలుచు
నా పువ్వు పిందెల ◆ నలరించి కుందనా
ము కుళ సందోహంబు ◆ ప్రకటమయ్యె

గీ. తిన్ననగు మొగ్గ గమికన్న ◆ మున్నెయగుచుఁ
బల్లవము లుదయించె జో ◆ భాప్రకార
మందు ముందుకు ముందుని ◆ వ్యంచమాన
మధుర మధురస మొలయంగ ◆ మహివనమున. ౨౬౬

సీ. వనలదట్టములోఁచ ◆ నంబులై కనుపట్టె
నళులగుంపులకనీని ◆ కలుసుగాఁగ
లలిజిగురులు ప్రవా ◆ ళంబులై విలసిల్లెఁ
గలికాతతులు మౌక్తి ◆ కములుగాఁగ

మ. ఇది శ్రీభార్గవపరిష్క్రియాకలితబం ♦ హిష్ఠప్రతిష్ఠాగరి
ష్ఠదిగంతస్తుత పారమేశ్వరకళా ♦ సంకాశ రామాంగనా
హృదయానంద దరాజశేఖర హిత♦శ్రీమూర్తి భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధము తృతీ ♦ యోల్లాసమై పొంపగున్. ౨౭౪

—: * గద్య * :—

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ ప్రసాద
ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుళ్లగోత్ర పాత్ర
కామినేనివంశపయః పారావార రాకాసుధాకర రాజద్రా
జన్య దేశాయి సార్వభౌమాజ్ఞాపితాంధ్ర గీర్వాణ
కవిత్వతత్త్వ చాతుర్యధుర్య పరాశరగోత్ర
రాపాక లింగనార్యపుత్ర లక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాయు
రభ్యుదయంబను మహా
ప్రబంధంబునందు
తృతీయోల్లాసము

శ్రీ శ్రీ శ్రీ





శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము



## చతుర్థోల్లాసము



శ్రీ తరుణీమృదు మధుర ర
సాలితవచన రచనాస • మంచితపీఠా
పాలన రామారెడ్డిధ
రాతల పతిపురనివేశ • రాజమహేశా. ౧

వ. అవధరింపుము, నిఖిలపురాణ వ్యాఖ్యాన సమేతుండైన సూతుండు శౌనకాది మునీంద్రుల కిట్లనియె. ౨

గీ. అవ్విధంబున శ్రీవసం • తాగమంబు
కరము సర్వజనానంద • కరముగాఁగఁ
దనరు సర్వేశ కీర్తిమా • లినివిరహాని
రసిత డోలాయమానమా • నసమునొంది ౩

సీ. శ్రీమంతుఁడైనట్టి • ఋషభయోగీంద్రుండు
మిహిరప్రకాశుఁడే • మిటికివచ్చె

చూపులొక్కట చేసి ॥ శుద్ధమనోవృత్తి
తదధీనముగఁ జేసి ॥ తమినడంచి
సకల వస్తువులను ॥ తుచ్ఛత విడంజేసి
ఖేచరీముద్రను ॥ గీలుకొలిపి
గీ. తనకొకట్టి దోచుటన్నది ॥ తానొకటికిఁ
దోచుచున్నది లేకయు త్రోయజాక్షి
విరహ యోగంబుతోఁగూడి .. విభునిపదము
లక్ష్యముగఁజేసె నాత్మీయ ॥ లలనలదరా.

క. అభిలాషవిప్రలంభ। ప్రభవస్తంభాది సత్త్వ ॥ భావములెదలోఁ
బ్రభవించిన నిర్వేదా। దిభయములు పొడకట్టెఁదేట్పడ తెల్లమిగాఁగన్. ౮

గీ. స్థిరవిభావ భావసా ॥ త్త్విక సుఖముల
నలరు రసమంబు జాతాయ - తాక్షిమేనఁ
జెలఁగుచుండె నవసారి ॥ శేషములను
నవవిధములఁ బరస్పర ॥ భవములగుచు ౯

క. గరమూరె నోగిరములు సా। గరమూరె వియోగమలిక ॥ గతకస్తురినా
గరమూరె రేబగలు జా। గరమూరెంజెలికి విరహ ॥ గతిమెట్టిది మో. ౧౦

వ. మఱియు మందమందాందోళిత కలశజలనిధి కల్లోల జాలధవళిత హాసచ్ఛురి తాధరంబు పూర్ణిమా శశాంకసంకాశ ముఖంబు కోటికందర్ప లావణ్యాధిక్యముద్రా మణీయకంబుగల భద్రాయువు సురూపంబు హృదయంబున ధ్యానంబుఁ జేయుచు నేత్రగోచరుం డైనట్టులైన నలుదిక్కులం జూచుచు యౌవన సాగర చంచలాభంగ తరంగ పరంపరా సహితయు, ననురాగ రజ్జుసమావృత్తయుఁ గుసుమశర శరకీలితయు నభిలాష విప్రలంభశృంగార భావనా పరిభూతయు నిజరూప పక్షిభావ శల్యకీలితయు మలయానిలావధూతయునై ప్రియసఖులంజూచి యోయనంగ రేఖావిరహ సంతాప దుస్సహంబైన నాహృదయంబునఁ బాణిపద్మంబు జేర్పుము; ఓ మదనమంజరీ, నాయవయవంబుల శ్రీచందనోదకంబులఁ దడుపుము; ఓ వసంతతిలకా, నా

కభరీభరంబుఁ జక్కఁజేయుము. ఓతరంగవతీ కేతకీసుమపరాగంబు పయిం జల్లుము. ఓ కందర్పమాలినీ, శైవాలజాలకలిత వ్యజనంబుల విసరుము. ఓ చిత్రరేఖా నా చిత్తవిత్తాపహారకుండైన పురుషరత్నంబు చిత్రపటంబు లిఖింపుము, ఓ విలాసవతీ ముక్తాఫల చూర్ణంబు నిక్షేపింపుము. ఓ సఖీ నళినీ దళచయంబున నా పయోధర యుగళంబు గప్పుము, ఓ సంచారికా కనకకదళీ పత్త్రంబునఁ జల్లనివాయువు సంచరింపఁజేయుము. ఓ కాంతిమతీ బాష్పంబుల పనుపుము మనుచుఁ బలికి నిరుత్తరయై యుండె నంత [illegible] మేలుకని పరిజన ప్రయత్నంబున గృహోన్ముఖయై [illegible]. ౧౧

గీ. మత్స్య కూర్మాంగ విలసన ♦ మహిమఁదనరు
సరసిజానన లావణ్య ♦ సరసిలోన
శంబరాహితుఁ డదరి జా ♦ లంబు వేసి
కలయఁ దజ్జీవనం బెల్లఁ ♦ గలఁచి కలఁచి. ౧౨

చ. కరువలి తేరు తీరరయ ♦ గారడి లేఁదలిరాకు బాకుచేఁ
జిరజిరలాడు నయ్యెడఁగ ♦ జిక్కినఁ గాటవు పోటు నర్వబి
త్తరి తరియింపరాని బలు ♦ తాప నితాంత దురంత చింతనా
కరవిరహార్తిఁ బెగ్గిలిన ♦ కౌశవధూతతి నేమరింపుచున్. ౧౩

సీ. అనవరతానిలో ♦ ద్ధతరజో భరచూత
నూతనసన్మరభూత ♦ భీతయగుచు
కోరకచ్ఛురికాగ్ర ♦ కార్కశ్యకేతకమూర్తి
మహితగతక్షోభిర ♦ మహిమకలసి
[illegible]తకుట్మలకింశు ♦ కతతి పాంథామిష
సహిత నఖవ్యాఘ్ర ♦ సరణి కులికి
నిరతోర్ధ్వ భాగసం ♦ చలపరాగస్థల
నలినీతలజ్వాల ♦ నునికి జడిసి

. నికట కింజల్క పుంజక ♦ టకచయంబు
కుసుమ రసదీర్ఘికాకూప ♦ విసరములను

నిన్ను బుట్టించి మున్నొక్క ◆ జన్నిగట్టు
పాత్రాడనము వహించె ◆ బింకజారి ౧౯౯

౨॥ చల్లచేతులవాఁడని ◆ జనులుబొగడ
వేడికరముల వాఁడవై ◆ చేడియలను
జలతనొందింపఁ జేసితి ◆ జడభవంబు
గలుగువానికిజ్ఞానంబు ◆ గలదెచంద్రా ౨౦౦

మలయమారుత దూషణము

సీ. ఎనసిచూచిననిల ◆ చినచోట నిలువక
భువనావిలత్వంబు ◆ బూనినావు
భువనావిలత్వంబు ◆ బూనుటయేగాదు
ఘనుల నిల్వఁగనీక ◆ కలఁచినావు
ఘనుల నిల్వఁగనీక ◆ కలచుటయేఁకాదు
తవిలి రజోవృత్తిఁ ◆ దాల్చినావు
తవిలి రజోవృత్తిఁ దాల్చుటయేకాదు
పోకుసంగతులచే ◆ పోలినావు

గీ. బుడమి పాశ్చాత్యసరణులఁ ◆ బొందువారు
తవిలి దాక్షిణ్యపదమున ◆ దారుటరిది
సుందరీజన బృందంబు ◆ గందఁజేయ
వలదు వలమాన పవమాన ◆ మలయనిలయ.

ఆ. విరహిజనుల ప్రాద ◆ వేడిమిఁ దరికొల్పు
సామివగుట కగ్ని ◆ సాక్షియయ్యె
నలినకారణంబి ◆ నాకార్య ముత్పద్య

తేయటంచు నీతి ♦ తేటపడియె. ౨౦౨

సీ. కనకసంచయముపైఁ ♦ గాంతు జెన్నొందుచు
గంధోత్తమావనిఁ ♦ గలయఁదిరిగి
ద్విజసంతతుల మింటి ♦ తెరువునంటఁగఁజేసి
గోచయంబుల తెల్విఁ ♦ గొఱలఁజేసి
బలముచే సరసుల ♦ భంగపాటొందించి
సుమనః ప్రపాతన ♦ స్ఫూర్తిమించి
పరరజోవతులైన ♦ పద్మినులఁగలంచి
యుత్పల ప్రీతిచే ♦ నుల్లసిల్లి

గీ. మహినిసావరములజంగ ♦ములఁగలంప
మొనరజేసి శిఖాచాని ♦ మోహవృత్తి
మేనులభరించి దర్పించి ♦ మించియున్న
మలయవలదుర నామీఁద♦ మలయపవనా. ౨౦౩

క. పవనాశనన్ని కరకరుణీరపవనాపవనాళినగర ♦ భారగమలరూ
పవనోదర భవనాకర! జవనాకుసుమాళుగాంగ ♦ జాతశతాంగా. ౨౦౪

—:వసంత దూషణ:—

క. శివిరిమదన యానమవై! లివిగాభవనాయనూన ♦ దీవ్యన్మలరూ
పవనాగురుపవనాజరు! పవనామరుబారిని గుడి ♦ పైరాకుండఁ ౨౦౫

గీ. సకలజాతుల కెల్లన ♦ సహ్యవృత్తి
సంచరింపుచు నుండు వ ♦ సంతనీవు
విరహిదశనొందు చున్నట్టి ♦ వెలఁదులందుఁ
గరుణలేనట్టి కాయఁజు ♦ గదియఁదగునా ౨౦౬

వ॥ అని పలికి పికశుకమధుకరాదుల నిందించి నివ్వెరఁగందు యాసుందరిఁగని
చెలులపుడు ౨౦౭

చ. కదియఁగఁ జేరిచేరి బిగి • కౌఁగిటఁ జేర్చి యదేమి దేమి నీ
వదరునఁ జెందనందమెలె • యానవునేమన నింటికేగనం
గొదువ యొకింతలేక యొన • గూఁకుశుభంబనన్ నమ్మినమ్మికం
బాదలెడు విప్రలంభ పరి • పూరితమానసయై రయంబునన్. ౨౦౮

వ. ఇవ్విధంబున బోధితయై సఖీజనంబులతోడ నిజాంతఃపురంబు ప్రవేశించి యొక్క సూనశయనంబునం బవ్వళించి మిక్కుటంబగు చక్కెరవిలుకాని చిక్కులఁజిక్కి నొక్కి కళవళపడుచు నలుదెసలంజూచుచు నాచిగురాకుఁబోడి విరహవేదనా ధూయమాన మానసయై యుండు తఱిఁ దత్సఖీజనంబు వగచి తద్విధంబంతయుఁ దజ్జనకున కెఱింగించ నతండు శైత్యోపచారంబులు జేయ నియోగించిన. ౨౦౯

క. నెలరాలనలకు గిన్నెల। జిలజిలయని జాలుగారు • శీతలవారిన్
పలిపె ముత్తామరనూల్గల। తెలివలువలు ముంచిమించి • తేకువతోడన్ ౨౧౦

గీ. కప్పురంబును బన్నీరు • గదిసినట్టి
గంధమందంబుగాఁ బూసి • కంజపుంజ
కేసరంబుల వ్యజనంబు • జేసివిసరి
శాంతి నొందింపుచుండిరి • సంభ్రమమున ౨౧౧

వ. అని శౌనకాది మహామునులకు సూతుండు జెప్పిన ౨౧౨

మ. అసమాశేష విశేష పాశుపతయో • గాధేయగాధేయ త్రై
జసవృత్తి ప్రదవిశ్రుత శ్రుతిశిర • స్సంధాన సంధానమ
ల్లసమాన ప్రమథాధి నాయకసదా • లంకార లంకారసా
రసదింద్రాది నుతాంఘ్రి పద్మహృతపా • రావార రావారయా

క. రణవిజిత లాంకజృంభణ। చణకాంచదనంతకోటి • సరసీరుహాభా
గణితాంతక హారదృంభా • ఫణిమణి ఘృణిలసితకర్ణ • ప్రత్యక్పూర్ణ ౨౧౩ర

పంచచామరము

చరాచర ప్రపంచరూప • సజ్జటాటవీనట
స్మరుత్సరిత్తరంగసంగ • మప్రశస్తమస్తకా
సురాసురాది వందనీయ • శుద్ధశైవ భక్తిమ
ద్ధరామరప్రధానధీని • ధానముక్తిదాయకా ౨౧౭

మ. ఇదిరాజేశ్వర పాదపంకజ సప • ర్యాతప్రభా ప్తసం
పదుదీర్ణత్వ విధుత్వ ధర్మసుగుణ • ప్రాల్భ్య సంయుక్తసం
మ్మద రాజన్న నృపాలకాభిహితసుం • భత్కీర్తి భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధము చతు • ర్థోల్లాస మొప్పారు ధరన్ ౨౧౮

గద్య

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ ప్రసాద ప్రా
ప్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుర్ల గోత్రపాత్రి కామినేనివం
శపయః పారావార రాకాసుధాకర రాజద్రాజన్న దేశాయిసార్వ
భౌమాజ్ఞాపితాంధ్ర గీర్వాణ కవిత్వతత్త్వ చాతుర్యధుర్య
పరాశరగోత్ర రాపాక లింగనార్యపుత్ర లక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాయురభ్యుదయంబను
మహాప్రబంధంబునందు
చతుర్థోల్లాసము



శ్రీరస్తు

# ప్రాయురభ్యుదయము



## పంచమాశ్వాసము



శ్రీమత్సువర్ణపూర్ణమ
ణీమయసంతతసువాసి ♦ నీపూజితల
క్ష్మీమందిర పవిత్రోల్లసితా।
రామారెడ్డీంద్ర నగర ♦ రాజమహేశా। ౧

అవధరింపుము♦ శౌనకాది మునీంద్రులకు నిఖిలపురాణ వ్యాఖ్యా ప్రఖ్యాతుం డైన సూతుం డిట్లనియె నట్లు నారాజకన్య నిశాంత సమయంబున సఖీకృత శైత్యోపచారంబు లొందుచుండు సమయంబున ౨

సీ॥ ఎడనెడఁ గన్పట్టు ♦ నడుతతుల్ ముత్తెంపు
గుత్తులు గలపువ్వు ♦ టుత్తులుగను
తొగడాల్లల మొగుల్ ♦ తెగలు లత్తుకనుబై
డంగైన చీరచే ♦ రంగులుగను

కెంజిగొరు కటి మొగుల్ ♦ తెర తెరల్ నలుపైన
యగరు ధూపమంబుల ♦ పొగలుగాఁగఁ
బలుచన నెలఁ యొజ్ఞ ♦ న్నెలపిండు లందంపు
గంధపు కోరల ♦ చందములుగఁ

ఆ॥ బొడలచాయలు కింపుగంపు ♦ మడుపులుగను
గుంపు రేయెండ దీపంపు ♦ సొంపుమీరఁ
బొలిచె నౌనాయికానాయ ♦ కులకుఁ గలయుఁ
కేళికా తల్పమనఁగన ♦ వ్వేళమింట ౩

సీ॥ శ్యామానుమోదంబు ♦ సమకూర్చి కలజీవ
నములకుఁ జల్లద ♦ నంబొనర్చి
సంపూర్ణ కళలచేఁ ♦ బెంపువహించి కు
ముద్వతీ వికసితా ♦ మోదమొనసి
బహుళరశ్మిస్ఫీతిఁ ♦ బలుమాడు బుధకోటి
కర్పించినట్టి మ ♦ హానుభావుఁ
డనుదిన శ్రీవ్యయా ♦ వ్యయమునఁ దనరారి
కువలయంబుల ప్రేమఁ ♦ గోరుచున్న

గీ॥ సరసుఁడై నట్టిరాజు ద్వి ♦ జప్రభువుల
స్వపదములనుంచె యామ్యత ♦ యపరిమితప
థంబు గతియని పలుమరు ♦ ధర్మదేవ
తలు బలుకురీతిఁ జరణాయు ♦ ధములు మ్రోసె ౪

ఆ॥ సకల చక్రపాల ♦ నకుతూహలేనుండు
శార్వరప్రకాశ ♦ శాసనుండు
కదిసితాగ నెదుట ♦ కాహళంబులు మ్రోయు
సరణి కుక్కుటములు ♦ తఱచు మ్రోసె ౫

ఆ॥ ఇఁక మరుద్విజాళి ♦ వృత్తులొసఁగునోర
వచ్చెనని త్రిశుద్ధి ♦ వాచకగ
నమ్ముఁడనుచు నజ్జ ♦ నముల్ దెల్పఁగఁదిగు
క్కుటములొక్క చక్కిఁ ♦ గూయఁదొడఁగె ౯

గీ॥ వీర్యవృద్ధికరంబుగా ♦ విశదపాద
రసఘటికఁ బుక్కిటనుబెట్టి ♦ రాజసమ్మ
దోత్తరాది సతీకేళి ♦ నొనరిమరల
నమియుగతి వేగునక్షత్ర ♦ ముదయమయ్యె ౭

చ॥ బలువిదు దాలయంబునన ♦ పారసరంపరలైన పూసరం
బులగతి వెల్గుతారలను ♦ పొల్పుగ వేకువ యాదికెంపుతో
య్యాలిలలిమించు శోధినిబ ♦ యల్పడనూడిచి యొక్కరాశిగా
నలరిచెనోయనంగ జల ♦ జారిగనంబడె సారెసారెకున్ ౮

మ॥ కమనీయారుణ వాసరంబను వనౌ ♦ కంబానభోవృక్షమిం
పమరన్ ప్రాకిని శాఖ్యశాఖలను ము ♦ న్నట్టిట్టు గానూచబు
షుములం బువ్వులు పల్చనై కనఁబడెన్ ♦ చంద్రుండనే పండు ప
శ్చిమపుంసంద్రములోన వ్రాలెననఁదో ♦ చెన్ సంధివేళన్ దగన్ ౯

వ॥ మఱియును ౧౦

గీ॥ యామినీ కామినీపీత ♦ హాస్యనార
సీరుహాచ్యుత పతయాళు ♦ శేషమధుభ
రస్ఫురద్రాప్య పానపా ♦ త్రంబనంగ
జరమ భూధరమునశీత ♦ కిరణుఁడలరె ౧౧

గీ॥ ద్విజపతియునై ప్రవృద్ధసం ♦ దీప్తవారు
ణీసమాగమముననుండి ♦ నిశ్చయముగ

నికరముతోఁ బ్రోచముగఁజేసి ♦ నిఖిలరాజ
మంత్ర తంత్రాంగకుఁ దెల్పి ♦ మదిఁగరంచి ౨౩

క॥ స్వామీ; చంద్రాంగదుఁడను। భూమీశ్వరుఁడు తనదుకూర్మి ♦ పుత్రికనుబలో
ద్దాముఁడనగు నీకియ్యఁగ। నేమముగా నొనరించెనిపుడు ♦ నియతాత్మండై ౨౪

ఉ॥ కావున నీవువచ్చుటయె ♦ కర్జమటంచు వచించియున్మహా
భావుఁడు వైశ్యవర్యుఁడు స ♦ బాంధవుఁడై చనుదేర దీప్తర
త్నావళి మైన వాహనము ♦ నందుముదంబునఁ దక్లినుంచిపుం
భావపరాక్రమక్రమము ♦ బర్వన మానుఁడై రయంబునన్ ౨౫

క॥ వచ్చిన నెదురుగఁ జనిమును। గ్రుచ్చిపరిరంభ ముంచి ♦ కూరిమితోఁడన్
విచ్చల విడివిడిదలలో। నచ్చుపటిన్ విడియఁజేసి ♦ యతిమోదమునన్ ౨౬

వ॥ పురాధికార పురుషుల రావించి వివాహకార్య ప్రయత్నోత్సవం బవలంబిం చుండని నియోగించిన శుంభద్రంభా స్తంభంబులు నిలిపిగరికపచ్చల తోరణం బులు గట్టువారును బ్రశస్త కస్తూరి కలనసలికి యొప్పిన కప్పురంబున ముగ్గు లు పెట్టువారును. మృగమద సంకుమద పరిమృదిత హిమాంబు సంచయంబుల నెల్లకడలం జల్లువారును వివిక్త ముక్తాఫలరంగ వల్లిసంగత శృంగాటకంబుల హాటకమయ వర్ణనీయ పూర్ణకలశంబు లుంచువారును నిట్టుల బహువిధ శో భనకార్యంబు లొనరించి యాభద్రాయువును శిల్పకళామర్మ పారగ నిర్మిత భర్మమయలక్ష్మీవిలాస మందిరంబుల వసింపఁజేసిన ౨౭

గీ॥ అటుల వసియింపఁ గూతురు ♦ ననుగుచెలుల
కలరఁ జేయుండనుచుఁ దెల్ప ♦ నంతకంత
కభినవవ్యక్త లావణ్య ♦ మమరఁగాఁ బ్ర
సాధికలు తత్సమయకృత ♦ సాధనముల ౨౮

సీ. తతపయోధరనిరో ♦ ధంబుగా నంబరం
బలరించఁ దగెనొక్క ♦ తలిరుఁబోఁడి
ఘనసువర్ణప్రభఁ ♦ గన్పట్టునంజనం
బమరించఁ దగెనొక్క ♦ కమలవదన
హృదయరంజకము గా ♦ నొదవి కుంకుమగంధ
మలరించఁ దగెనొక్క ♦ జలజనయన
నేత్రాంతకాంతితో ♦ సూత్రపట్టినరీతి
కస్తూరి బొట్టొక్క ♦ కలికిదీర్చె

గీ. విమల గోరోచనాచిత్ర ♦ కములురోజ
గల్లసీమల యందొక్క ♦ కాంతనిలిపెఁ
జరణతలముల లాక్షార ♦ సప్రకార
ముంచి చెలరేఁగె నందొక్క ♦ చంచలాక్షి ౨౯

ఆ॥ మెఱుఁగులీనుచున్న ♦ మేలిమి సంపంగి
విరుల మెఱుగుతురుము ♦ తరుచు మెఱసె
మెఱుపు విడుముకొన్న ♦ మేఘమో యనఁగను
వెలసెఁ జూచువారు ♦ వెరఁగుపడఁగా ౩౦

గీ॥ పులుగడిగివట్టి ముత్తియములచే రొకసకియదీర్చె ♦ ముంగుఱులు మఱి
వెలసె నలతురుము తారో జ్వాలదంతుర మైతనర్చు ♦ జలధరమువగ ౩౧

ఆ॥ చెలియయొకతె సకియ ♦ చెలువైననాసను
గొప్పముత్తియంపు ♦ నొప్పనునుప
నాస్యమునఁ దలిర్చె ♦ నధరామృతప్రతి
బింబమైనరాజ ♦ బింబమనఁగా ౩౨

కె॥ సుదతి యొక్కతె కరములఁ ♦ బదతలములఁ

గంకణంబులు ఘనహంస ♦ కములు నిలుప
మెఱసెఁ దద్దేహలావణ్య ♦ సరసిలోన
నవి వినోదింపు టాశ్చర్య ♦ మవునె తలఁప 3౨

వ॥ చెలియ యొకర్తు బోటికటి ♦ సీమపయిన్ రతనంపుసొంపు బి
ల్లల మొలనూలు నిల్పిన సు ♦ లక్షణమై కనుపట్టె నెట్లనన్
గలికి విలోచనంబులు మృ ♦ గంబులనన్ విలసిల్లుచుండఁగా
వాలయము నిరామారమ్మృగ ♦ యుండొనరించిన జాలమోయనన్ 3౪

సీ॥ తీగబోడి యొకర్తు మ ♦ త్తెంపుసరులు
గలికి కుచసీమ వెలయింప ♦ వెలసెనవియు
వెలఁది వేసవి మేఘంబు ♦ వలనఁ దొరఁగి
గిరుల జాల్గొను ముక్తప్ర ♦ కరమనంగా 3౫

సీ॥ పొంకమై తగువజ్ర తా ♦ టంకయుగళ
మొకసరోరుహ లోచన ♦ యుంచనలరె
మంగళాంగత దంగనా ♦ పాంగశరము
సానబట్టెడు కంతుని ♦ శాణములన 3౬

క॥ చెలియొక తెరుచిరమౌక్తిక। ములచే లు నుదుటఁజేర్చ♦ ముదమలరించెన
య్యలికార్ధ విధుఁడు తారా। వలయవిలాసంబుదోఁచ♦వఱలెననంగన్ 3౭

క॥ తరుణియొకతె నవరపరిచె। నుగమణిగణ ఖచితఘంటి♦కౌధ్యానముపై
మెరసెనభోంతర్గతమై। సౌరుగుల నెడ తెగకనిలచు ♦ మెరపోయనఁగాన్ 3౮

సీ॥ పడఁతి యొక్కతె తళుకుల ♦ పద్మరాగ
మణుల పదకంబు సవరింప ♦ మహిమ వలరె
సరసతఁ దలిర్చు కుచసీమ ♦ గిరులనడుమ
డంబుమీరిన బాలార్క ♦ బింబమనఁగా 3౯

సీ॥ లలితకంబుసమాన • గళమందు నేకమై
భాసిల్లు ముత్యాల • పట్టెఁగట్టి
సుందరదోఃకాంతి • కందళప్రసనములో
సందిటి తాయెతుల్ • బొందుపరచి
పొగ లెక్క బిగియైన • జిగిగబ్బిగుబ్బల
సవరించి జాలీల • రవికఁదొడఁగి
శస్త గోరోచనా • కస్తూరికాసంకు
మదకుంకు మాగరు • మలయజాది

గీ॥ వస్తువుల విస్తరించిరి • వలయునెడల
రామణీయక దేహాభి • రామసీమ
నలరఁజేయుచు దృష్టిదో • షాభిహతిగ
మంచి సామ్రాణి ధూపము • ర్పించి రతివయు ౮౦

గీ॥ తరుణియొక్కతె నిలువుట • ద్దంబుదెచ్చి
యెదుట నిల్పిన నారాచ • సుదతిఁజూచె
నంగశృంగార రసభేద • మమరనపర
లక్ష్మియనిమది నాత్మీయ • లలనలలరా ౮౧

క॥ ఇవ్విధంబున నలంకరించుట విని పెండ్లికొడుకు నలంకరించుఁడని నియోగించిన
నర్మసఖులుగడంగి ౮౨

సీ॥ సంపంగనూనెచే • సవరించి యొక్కతె
శిరసంటెనమ్మహీ • వరసుతునకు
మలయజపరిమళ • మర్దితంబైనట్టి
నలుగిడె నొకతెమ • విలసితునకు
నామోద యుక్తమౌ • నటకలి నొనరించె
నొకముద్దుగుమ్మయా • యుర్విపతికి

సన్నిట జలకమే • ర్పరచె నొక్క లతాంగి
సాహస బిరుదాంక • సంయుతునకు

గీ॥ మిసిమిబంగరు కోకచే • మేనునంటి
నట్టి తడియొత్తె నొకలేమ • యధికమతిని
దివ్యవసనంబు గట్టించెఁ • దెరవయొకతె
సకల జనసమ్మద ప్రద • జనవరునకు ౪

సీ॥ రంగుబంగరుశాలు • రింగులువారంగఁ
గప్పి మేనునసిరి • గందమలఁది
కురులలోఁ బువ్వులు • దురిమిక్రొమ్ముడివేసి
హైమణి మకుటంబుఁ • బదిలపరచి
కళలీను మకరకుం • డలములు శ్రవణసం
గతములుగాఁ జేసి • కరములందుఁ
గంకణంబులునిల్పి • ఘనదోర్యుగమునందుఁ
గేయూర వరములు • గీలుకొల్పి

గీ॥ వక్షమునఁ బతకమొనర్చి • వజ్రరశనఁ
గటితటిఁ సవరించి డా • కాలబిరుద
సారమై తగుగండపెం • డారముంచి
పడఁతులీరీతి వరుఁబెండ్లి • కొడుకుఁజేసి ౪౪

చ॥ కళలు వెలుంగునెన్నుదుటఁ • గస్తురినామము దిద్ది సొంపుగాఁ
గలయఁగఁ గంఠసీమసిరి • గందముబూసి సరుల్ ఘటింపుచుం
బొలుపుగఁ గప్పురంపుమడ • పుల్ దగనోటికొసంగుచుంజ సఖుల్
నిలువగు దర్పణంబెదుట • నిల్పినఁ జూచెద దోచితస్థితిఁ ౪౫

వ॥ ఇవ్విధంబునఁ జూచి భద్రాయువ భంగముంగళ స్నానానంతరంబున ససాధన ప్రసాధితాలంకృతులంగైకొని నిర్జితసంక్రందన నందనుండు నిర్భర్త్సిత రాజ

రాజతనూజుండు నిందిత వసంతుండునై నిరుపమాన మానాతీత నూతన శృం
గారరస విశేషుండు తన్మహోత్సవాగతానంద కందళిత దరహాస సుందర వ
దనార విందుండునై యుండుటవిని ౪౮

చ॥ అలరు మనంబుతోడ వసు • ధాధిపుఁ డాప్తులఁ బుత్రమిత్రమం
త్రులఁ దగుబంధులంగనిపు • రోహిత నిశ్చిత చంద్రతారకా
బలయుత లగ్ననిర్ణయము • బర్విన వేడుకతోప నాయెడన్
గలిత వివాహవేళయని • కైకొనుఁడందఱు సంభ్రమంబునన్ ౪౭

వ. అని పెండ్లికొమరుని కభ్యుదయిక స్థితి నొనరించి గోదాన భూదాన హిరణ్యా
ది దానంబులు నిర్వహించి బహుమణిగణాగణిత భూషావిశేష భూషితులును
బంధురసుగంధ మాల్యాలంకృతులును బరిమళ మిళిత గంధలేపన శరీరులును
బాంధవుల వరునివారలై వచ్చుట కిచ్చగించి భేరీపటహఢక్కాడిండిమమర్ద
లతాళకాహళ ముఖవాద్యానవద్యధ్వానులును వారనారీవిలాస కుండలిదండ
లాసక ప్రేరణాది నృత్యావధాన విధాన చమత్క్రియా చంచలమణి శ్లాఘ్య
మేఖలా మంజుసింజాన మంజీర విలసిత వలయకింకిణీ విలాప సంభూతారావ
సంఘాతంబులు తర్కద్వయ సాంఖ్యయోగమీమాంసాయుగ భాట్టప్రాభా
కర నాటకాలంకారా క్షీణలక్షణ గంధసందర్భ దుర్భర వ్యాఖ్యాన ప్రఖ్యాతి
ధౌరంధర్య ధుర్యావనీసుర క్షేమంక రాశీర్వాద భేదంబులు వందిమాగధ జ
యజయ శబ్దంబులు మాధురీధురీణతాన మానసషడ్జ మధ్యమ గాంధారబంధు
ర గ్రామకరానూన గానన సంధాన గాయక వీణావేణు ముఖనిస్వనంబు లేకీ
భవింప నిజాజ్ఞావశవర్తి సమాగతాంగ వంగకళింగ కాంభోజాది దేశాధీశ్వర
సల్లాపంబులు చెలంగనిజమనోరంబులగు రథంబులును, సంతత గాంభీర్య నిర్జి
త సింధువులగు సింధువులును, జవనదూరీకృత గంధర్వంబులగు గంధర్వంబు
లును, నిరంతర బాహుబలోద్భటులగు భటులును దనర భద్రాయు భద్రగ
జంబునెక్కించి మండలాధిపతులను సామంతులు నతనివెంబడి రానియమించి
సాంద్రచంద్ర చంద్రికా ప్రభాసుర వివిక్త మాక్తికాతపత్రంబులు ధ్వజాలవట్టి
కావ్య జనాదులు సందడింపఁ బరశుగి బాప్రాసతో మరభిండివాల ముండులా

గాది సాధనంబులుగాని కాల్బలంబునే తేరఁ గనత్కనకమణిమయ వేత్రహస్తులు నలుదెసల బరాబరులుసేయ బంగరు పళ్ళెరంబుల సాక్షత మృగమద సంకుమద ఘనసార గంధసార కుంకుమ చంపకతైల హిమోదకాది గంధిల ద్రవ్యంబుల. గొనుచుఁ బుణ్యస్త్రీలు నిజకర సరసిజ పరిస్ఫురన్మంగళా రాత్రికలు వెలుంగ రత్నమయ పాత్రంబుల నవీన దుకూలంబులు మనోహరంబులు ఫలంబులు కుసుమంబులు గొనుచు కనకమణిమయ రాజద్వార మార్గంబు ౪౮
నఁ జనుదెంచు సమయంబున

సీ॥ అమ్మహాత్మునిఁ గనువేడ్క • నతివయోర్తు
హారవల్లులు మొలనూళ్లఁ • గారచించి
కంకణంబుల నలకాళ్ల • కడియములుగఁ
జేసి చనుదెంచె విభ్రమ • స్థితిఁ దలిర్ప

క॥ స్నానంబు చేయుచోనొక। మానిని రవణములదాల్చ • మరచి జగద్ర
క్షానిపుణత్వము గలిగిన। యానరపతి సుతునిఁ జూడ • నల్లన వచ్చెన్ ౫౦

ఉ॥ చేడియ యోర్తుగల్లకుచ • సీమలపై మకరీ కలాపముల్
వేడుకతో వహించకర • వేనలి దూలఁగ వేగ మొప్పఁదూ
గాడెడు హేమధామ వస • నాంచల మిట్టటుఁ జేసికొంచుత
న్గూడిన ప్రేమనవ్వగను • గోరిక దీరఁగ వచ్చెఁ జెచ్చెరన్ ౫౧

మ॥ పొలఁతి యొకర్తు నెచ్చెలుర • పుష్పాడిచీర ధరించి మేడలో
వలఁగల యుంగఁజూచితన • ప్రాణసఖుండు రతిప్రసంగముల్
దలపఁగ వద్దువద్దనుచుఁ • దద్వగునిం గనవచ్చెఁ జెచ్చెరన్
బిలువని పేరటంబనుచుఁ • బెక్కు తెఱంగుల గేలిసేయఁగన్ ౫౨

ఉ॥ రామయొకర్తు వచ్చి యుల • రాజకుమారునిఁ గాంచి కాంచికా
దామము పుష్పదామము య • థాక్రమ యోగము నొందనందమా

మోమునసాదు బొట్టమర ♦ ముంగురులల్లన నాడఁజూచు భా
మామణులెల్ల సవ్వగను ♦ మారవికారము జెందిరున్నఁగన్ ౫౩

శా॥ ద్వారాసక్తదృగబ్జముల్ దనరనిం ♦ ద్రప్రస్థ రాఁగారశృం
గారోదార విహారకేల్ మరచిభూ ♦ కాంతాత్మజుండల్లదే
రారేరారె యటంచుఁబిల్చి కొనుచున్ ♦ రామామణుల్ వచ్చిరో
య్యారంబేర్పడఁ జూడవేఁడు గలవా ♦ రాబాల గోపాలమున్ ౫౪

వ॥ ఇట్టుల సకలజనంబులు ఘనంబులగు నుపహారంబులుఁగొని యవ్వరునికి సమ
ర్పించి వెంటరానయ్యెడ ౫౫

గీ॥ మలయుచు పకంర నక్షత్ర ♦ మాలదనర
కుజను లడరంగగఁ విబుధ ♦ గురువులలరఁ
గలసిచూచు చకోరాళు ♦ లెలమిఁజెంద
సత్పథంబున నారాజు ♦ సంభ్రమించె ౫౬

వ॥ మఱియు నీరాజన భాజన కరసరసిజాధన్య పుణ్యాంగన లుపొంగుచు మంగ
ళపాఠంబులు పాడ దేదీప్యమాన కరదీపికానేకంబులు వెలుంగ సాంద్రచం
ద్రజ్యోతిస్సంచయంబులు ప్రకాశింప నుభయపైవాహిక బలంబు లెదుర్కొ
ను నెడ ముందుముందుగ నందంబుగ నందఱు గ్రందుకొని గంధవడులు పిడికిళ్ల
గొలఁదిగుప్పునం బఱవఁదత్సుగంధ బంధుర పరాగంబు నల్దెసలఁ బ్రసరింపుచుం
డ నిర్నిద్రభద్ర చతుర్దంతకాంత దంతావళంబులనుండి యామహీపతి కుమా
రుండు మగసాలందిగి యుద్దండ మండలాధిపతులు కైదండలొసంగ సాకల్య
కల్యాణావహావివాహవేదిక కేతెంచి ప్రచుర రచిత నూత్నరత్న హాటక పీఠం
బునం దధివసించి యుండునంత మహోత్సవంబున జంద్రాంగదుననుమఱివ
డసి యత్తఱి ౫౭

భద్రాయువు కీర్తిమాలిని వివాహమాడుట

గీ॥ పాలఁదుకలుపొంగి సింగార • మొలుకఁదళుకు
వెన్నమూపుల నద్దెసల్ • వెలుఁగ గలికిఁ
కులుకుగుబ్బలు మోహంబు • దెలుపమెఱుఁగు
మొలకనఁగఁకీర్తిమాలిని • నిలుపనప్డు ౫౯

క॥ తెరఁబట్టిరి తెఱవకుఁదెర। తెరమైలగ్నోదయంబు • తేకువరాన
త్తెరఁగెఱుఁగలేక జనమే। తెరపైపైఁ గదియభాగ • ధేయుకృతాగ్న్యల్లెం

చ॥ వెలయఁగ సావధానయని : వేదవిదుల్ బలుకంగరాజున
త్పలకరవిప్రశుతిశ్రుతిని • ధాన గతిన్మధు పర్కమాదిగా
గలుగు విశేషకార్యములఁ • గాశలమేర్పడఁ జేసి కామినుల్
బలుమరు మంగళార్థగతిఁ • బాటలుబాడుచు సంభ్రమింపఁగన్ ౬౦

క॥ జలజాక్షి గళమునను మం। గళసూత్రముఁ గట్టెవరుఁడు • కౌతుకమొదవన్
జలజాస్త్రు గెలిచి తత్పురిఁ। గలువలతోరణముగట్టు • కైవడిదోఁపన్ ౬౧

క॥ నలువొందనప్పుడంజలిఁ। దెలిముత్తియములు ఘటించి • తెరవతురుమునన్
నిలుపనవియు జీమూతము। వలనన్ జలజలనఁ దొరఁగు • వైపెఱిగించెన్ ౬౨

ఆ॥ వనితయప్పుడంజ • లిని వెల్గుముత్యముల్
వరుని శిరముమీఁద • విరివిఁజేయఁ
బరగఁ నింద్రుశిరము • పై శచీదేవిక
ల్పకసుమంబులుంచు • పాటిదనరె

వ॥ ఇత్తెరంగున ౬౩

సీ॥ ముత్యాల బాసికం • బులు ఫాలఫలములఁ
బొలుపొందు కాంతులఁ • బొదలుచుండ
సప్తర్షి దివ్యతే • జస్ఫూర్తి గలవాఁడ
వనిపల్కుబడి ముందు • వనువుఁదోప

సప్తపదంబుల ♦ సనకల్లునం జేర్చి ♦
ప్రకృతి పురుషులెడఁ ♦ బాయరనెడు
సుగుణుఁ దోఁపగబమ్మ ♦ ముడిని వెలుంగుచుఁ
జెంగటనుప్పొంగి ♦ తొంగలించు

ఆ॥ వేడఁదగినకులము ♦ వేల్పులగురువగు ♦
తపసితేనిరాణి ♦ దర్శనంబు
జేసి పెండ్లిజగతిఁ ♦ డాసివీరంబుప్పై
పొలచి రవ్వధూవ ♦ రులుకడంగి॥ ౬౮

సీ॥ నిజమైనపెనువీఁడు ♦ నెలవైన దేవర
మాటలోఁదిరిగిన ♦ మధురవాణి
తేజరిల్లుచునుండు ♦ జేజేలరాయెదఁ
బాయక నిలచిన ♦ పంకజాక్షి
బత్తులంబ్రోవఁగ ♦ సత్త్వంబుగలదొర
కరగామెలంగిన ♦ పరమసాధ్వి
తరుచుగాసుఖయించు ♦ తెరగన్నులలరిన
పెనిమిటితోఁగూడు ♦ పువ్వుఁబోడి॥

గీ॥ గావలయునీవెలఁది యని ♦ కాంచుజనము
పొగడుచుండంగ నారాచ♦బోలతిఁమిన్న
మగనితోఁగూడి ♦ దేదీప్య♦మానయగుచు
మూర్తివిస్ఫూర్తిగను ♦ పట్టమోదమలరా॥ ౬౯

క॥ సరసవృత్తులనవ్వధూ ♦ వరులు వేద
ఘణిత మార్గసితులనేరు ♦ పరచి తెలుప

---

* కీర్తి మాలిని జూపట్టమూర్తిదసర- తా-ప్ర

నిత్యకర్తవ్య సంగతుల్ ♦ నెరపిరపుడు
బ్రాహ్మణాశీర్వచనములు ♦ బలసియుండ॥ ౬౬

చ॥ మునుకొని నేలవేలుపుల ♦ మూకలునీకను దానమాడి భో
జనము నకిచ్చగించగర ♦ సాతలనాథుడ భీప్సితంబుగా
నను వృపడంగమ్మడసన ♦ మంచితమైన పదార్థమెల్లమున్
బనివడ వడ్డనల్ సలిపి ♦ బంతులవెంబడి సంచరింపుచున్॥ ౬౭

సీ॥ అన్నముష్ణంనస ♦ నుంచితంశాకపా
కల్వంసభవతీహా ♦ ఘనశలాటు
సంఘుటితోపదం ♦ శిశిరేష బహుళతా
నాస్తిరసాఢ్యప్ర ♦ శస్తపక్వ
ఫలసాప్తవంనాస్తి ♦ బహుకృతభక్ష్యాది
క సమీచ్యనితాంత ♦ కరుణయాప్ర
కటశీతలోదక ♦ పటుతాంనపరమాన్న
మస్తినాస్త్రపప ♦ న్యస్తవస్తు

గీ॥ సంచయోనాస్తిలవణంచిం ♦ చాఫలరస
కలితమోదనమోవభో ♦ క్తవ్యమత్ర
మదపరాధవిచార్యతః ♦ మస్వమనుచు
విభుడుభోక్తలనందతి ♦ నభినుతించె ౬౮

వ॥ క్రమ్మరనమ్మహీమండలాఖండనుండ దభ్రసితాభ్ర ప్రశస్తకస్తూరి కాకుం కుమ సంకుమద మృగమద హిమాంబు పరిమళ పరిమిళత సుగంధబంధుర చర్చల వలనను గంబూరంబు వేడబంబుగల తాంబూలంబుల వలననుంబహు విధవాసనావాసప్రోల్లసత్ఫుల్ల హల్లకమల్లికాదికుసుమ విసరంబుల వలనను సారవార నారీవిహార వారపార వారసార సాక్షీకృత తౌర్యత్రిక చమత్కృయలవలనవిభావాను భావాద్యుల్లసద్రసవిశేష శ్లేషిముఖ సుఖముఖోచ్చార ణోల్లాస కరపరిహాస కసల్లాప ప్రసంగంబుల వలనను ఇది మొదలగు నైనంది

న బహుమాన కార్యంబుల వలన సంతకంతకు సంతోషంబుల నందం దయ్యంద
రి కానందంబు నొందించి సొంపుప్పుట్టించు నిలింప పతివైభవంబున సంభూ
తోత్సవ ప్రభూత భూతలాధీశ జాలంబులకు జాతరూపస్వరూప చేలంబులొ
సంగి ధరామర వరుల కపరిమిత రత్న సువర్ణ దుర్వర్ణ నిర్నిద్రముద్రికలొసంగి
సుజన నేతయగు జామాతకుఁ బన్నివేల మొదవుల కదుపుల నంతకిమ్మడి తురం
గంబుల నంతకు జమిలిబలుగొమ్ముల మొకమ్ముల నంతకు గెట్టిరథంబుల నం
తకినుమడి యూడిగపుచేడియలనంత కెక్కువ విడిపుడి గంతకన్న మిగుల
రతనంబులనివి మొదలగు హారణంబుల నాగమోక్ష ప్రకారంబుల సవినయం
బుగా నిచ్చి మణిపుత్త్రి యనందగు తనపుత్త్రిం జూచి.

సీ॥ అత్తమామలయాన ♦ నొగాదనక వారి
మనసురా మెలఁగుమీ ♦ మంజువాణి
పతిమాట జవదాట ♦ కతనికింపగు వేళ
నెదురొడఁబోకుమీ ♦ యిందువదన
తోడికోడండ్రతోఁ ♦ గూడివాదులకెల్ల
హితమాచరింపుమీ ♦ యిగురుఁబోడి
చుట్టాల యెడ యేనిఁ ♦ గొట్టుమిట్టాడక
కరుణ రానముపుమీ ♦ కంబుకంఠి

గీ॥ సేవలొనరించు దాసదా ♦ సీజనముల
దయఁదలంపుచుఁ బ్రోవుమీ ♦ తరళనయన
యెన్నికత్తింటికినిబుట్టి ♦ నింటికెప్పుడు
వాసిరాఁగఁజరింపుమీ ♦ భానురాంగి ౭౦

ఆ॥ ఎల్లజనుల యెడలఁ ♦ దల్లితల్లి యనంగ
మెలఁగ వలయుబుధులు ♦ మేలనంగ
బావమఱుఁదులందు ♦ నావంతయైనను
గడుసుతనము వలదు ♦ కమల నయనా ౭౧

క॥ మునుదాదులు ప్రమదాదులు। నినదాదులు నెరపఁబుట్టి ♦ నెనరుట్టిపడన్
ఘనజాలకవినుతాలక। చనజాల కయున్నగన్న ♦ జనకుండంతన్ ౭౨

చ॥ కరములుచాచి యెత్తుకొని ♦ కౌఁగిట నొప్పఁగ నప్పళించుచున్
శిరముప యింగనుంగవను ♦ జెందిన యశ్రువులుంచె నెట్లనన్
సిరిజనియించువేళల ♦ క్షీరసరిత్పతి తచ్ఛిరంబునన్
దరగలుచాచి శీ౦రకదం♦ బములందగఁ జల్లెనో యనన్ ౭౩

వ॥ ఇవ్విధంబున గారవించి ౭౪

క॥ అమ్మా, అత్తింటికిఁబో। వమ్మా తడవేలచేసె ♦ దమ్మా; నీతో ♦ డమ్మా;
యింతటవచ్చెద। మమ్మాయీ జాలిమాన ♦ వమ్మా కొమ్మా ౭౫

ఆ॥ అనుచుజాలిమాన్చి ♦ యంపక మొనరింప
మగుడి మగుడిచూచె ♦ జిగురుఁబోడి
చెలఁగిపెనిమిటింత ♦ సిరిగలవాఁడైన
నతివపుట్టినింటి ♦ కాసపడును ౭౬

క॥ అంతట నవోఢత్రోసా ♦ మంతహితప్రరోహితాను ♦ మతితత్పరశు
ద్ధాంగ ప్రదేశముధ ♦ కాంతుండొనరించె జనముకౌతుకమందన్ ౭౭

వ॥ అంత శుద్ధాంత ప్రవేశానంతరంబునఁ జోక్కమగు నొక్కసమయంబున

ఉ॥ చంపకగంధి దోర్తురభ ♦ సంబున రాజకుమారుఁ జేరినా
కెంపుపసిండి గిండియను ♦ నిండిన సంపెగినూనెఁ బూసెని
ద్దంపుకురుల్ నటింపఁగను ♦ దమ్ములు పెంపెనలారఁ చన్గవన్
సొంపులుజూపఁగంకణరు ♦ చుల్గను పట్టువలగ్న మూఁగగన్ ౭౯

క॥ శిరసంటి నవనకములయు ♦ చిరుచెమ్మట గ్రుమ్మరింప, శీతోదకసం
భరితమగు నటకలిడిచె స్ఫారమజ్జనశాల్ల కడకుఁ ♦ దేర్చిప్రియమునన్ ౮౦

సీ॥ మంజువాణి యొకర్తు ♦ మజ్జనంబొనరింప
శ్వేతవస్త్రములొక్క ♦ చెలియగట్టె
మదవతి యొక్కతె ♦ మణిభూషలనొసంగె
శిరమునవొకలేమ ♦ విరులుదురిమె
కంజాక్షియొక్కతె ♦ కనకపీఠముపెట్టెఁ
గలికియొక్కతెమేన ♦ గంధమలఁదె
అగరుధూపమునొక్క ♦ యతివసమర్పించె
లలనయొక్కతెపాదు ♦ కలనమర్చె

గీ॥ నాతియొక్కతె నీరాజ♦నంబుజూపెఁ
బడఁతియొక్కతెసురటిచేఁ ♦బట్టివిసరె
బాలయొక్కతె రత్నద ♦ర్పణముఁజూపె
రామయొక్కతె ఘనచామ ♦ రంబుబూనె॥ ౮౧

క॥ వనజాస్యయొక తెౕమోలన్ । గనకపుపళ్లెరముపెట్టె ♦ గలికియొకతె వా
సన దొలుకుజలమ్ములలరిన । కనకాలుకనుంచె వేడు ♦ కల్జనియింపన్॥ ౮౨

మ॥ సమరస్యంబయికించి దుష్టమగునా ♦ శాల్యన్నమున్ దుగ్ధమా
జ్యముపచ్చళ్ళునపూపముల్ వడియముల్ ♦ శాకంబులున్ సూపము
త్తమలేహ్యంబు రసాయనఁబులు ప్రమో♦దంబొప్పవడ్డించిరా
రమణుల్ కంకణకింకిణీకటకజా ♦ రావంబు తోరంబుగాన్॥ ౮౩

గీ॥ ఇటుల వడ్డింపనవియెల్ల ♦ నింపులేక
పెరుగు పరమాన్నములరుచు ♦ లెఱుగఁలేక
కూరగాయలుచవియని ♦ కోరరాక
వలసివల్లమిసాపాటు ♦ సలిపెనపుడు॥ ౮౪

క॥ అంగనయొక్కతె ముంగల । బంగరుపావలుల గించ బదములఁదొడియా
భృంగారు జలముచేను । ప్పొంగుచుఁజేవార్చి రాజపుంగవుడంతన్॥ ౮౫

క॥ జాంబూనదవిదితములౌ । గంబూరపుభాగములను ♦ గైరావళులన్
బింబోష్ఠియొకతియందియఁ । దాంబూలము వేసికొనియె ♦ ధావిధిదోపన్॥ ౮౬

సీ॥ పంజరసింజాన ♦ బహుకీరశారికా
ఫణితమన్మథతంత్ర ♦ బంధురంబు
జాలాగతారవ ♦ స్పర్శపికారవా
కర్ణనోత్సుకపటు ♦ కలరవంబు
సుఖకృద్రతిరహస్య ♦ లిఖితబంధవిశేష
సంయుతయవనికా ♦ సంచయంబు
నవరత్న కీలిత ♦ నవ్యోపచారస
జీవపాంచాలికా ♦ సేవ్యతలము

గీ॥ సారఘనసార వరగంధ ♦ సారచారు
మసృణఘుసృణవిదిత సంకు ♦ మదమృగమద
ముఖరతి సుఖకరద్రవ్య ♦ ముఖ్యమగుచు
నలరుచుండిన కేళికా ♦ నిలయముననుll ౮౭

చ॥ అరుదొనరించు కుందనపు ♦ టందలముల్ దగుతూగుటుయ్యెలల్
విరివిరిచప్పరంబులును ♦ వింతగు కాంతులఁ జెందు చందువల్
వరలెడు దర్పణస్ఫుటక ♦ వాటములుం మగరాల దేహళుల్
తరళగ వాతురత్నములు ♦ తద్గృహదీపములై కనంబడెన్॥ ౮౮

క॥ మగరాలకురుచలును నిగ । నిగమను మరకతఘుమణుల ♦ నిడుపులు కోమల్
ధగధగను పద్మరాగము । లుగనొసరినశయనమున్న ♦ లోపలిదెసకున్॥ ౮౯

ఉ॥ మూలలనీలముల్ తుదల ♦ ముత్తెపుగుత్తులు సందుసందులన్
జాలగు పచ్చలున్నడుమ ♦ చక్కని కెంపుల జొంపముద్దులన్
మేలగుస్ఫాటిక కాంకములు ♦ మించుల సంచుల మించుపట్టెయున్
నీలుగఁగల్గి వెల్గుటకుఁ ♦ జిత్తమురంజిలి సమ్మదంబునన్॥ ౯౦

వ॥ మఱియుఁ గర్బురాభంబులైన కుంభికుంభ సంభవంబులు రక్తసిత వర్ణంబులైన వంశజంబులు జ్యోతి ప్రభంబులగు జలద జననంబులు హారిద్రాభంబులైన యిక్షు సంభూతంబులు నీల కాంతిగల ఫణిఫణోద్భవంబులు శుద్ధస్ఫటిక సంకాశంబులగు శంఖ జాతంబులు కృష్ణలోహితచ్ఛవిగల వరాహదంష్ట్రోదితంబులు పాటల ప్ర శంబులగు శుక్తి జన్మంబులు గజల హారంబులు ముక్తావళులు దేవచ్ఛందంబులు గుత్సంబులు గుత్సార్థంబులు గోస్తనంబులు మాణవకంబులు నేకావళులు నక్షత్రమాలికలు ననుహార విశేషంబులు నవరించి రత్నమయంబులగు భూషణంబులు శ్రీగంధాది పరిమళ లేపంబులు నానావిధ కుసుమ మాల్యంబులు మొదలగు చతుర్విధ శృంగారంబుల నలంకరించి యించుబోడులలోఁ బ్రోడయగు నొక్కచేడియ యాపూఁబోఁడి కిట్ల ౯౬
నియె॥

శా॥ ఓ నారీమణి చెల్వునింగదిసి నీ • యుల్లాసముల్ జూపి నీ
వానింగానొనరించు మించుకవినే • వాకౌఁగిటన్నేర్పుచున్
సూనాస్త్రుంగెలిపించి నేరుపులచే • సాక్షించి సోలించితే
నీనాసేఁత మెఱుంగవచ్చు నిపుడో • నీరేజపత్రేక్షణా॥ ౯౭

గీ॥ అనుగులొత్తు పండు • టాకుల సొగసైన
మదుపులొసఁగి రతుల • జడుపులేక
సరసరతులవిభుని • గరగించి తేనియు
నేడు దెలియునీదు • నిపుణతయును॥ ౯౮

క॥ వినుముద్దుగులుకు పలుకుల । వినఁదలఁచి వీఁడుందుగోరి • వేఁడిపలుకరిం
చిన సిగ్గుఁబడుచు లోభంపు । బూనరఁగ విని విననిపగిది • నుండెదుసుదతీ ౯౯

చ॥ అనిచతురోక్తి సూక్తులగ • యాళితనంబునఁ బల్కునా సఖుల్
దనువిడనాడి యొక్కెడఁ దొ • లంగుదురోయని పారిపయ్యెదల్
బెనఁగొని వెన్కముందడుగు • బెట్టుచు నందెలు ఘల్లుఘల్లనన్
గినుకఁదొలంగు చూపులన • శీతతఁదూరుచు వచ్చెనయ్యెడన్ ౧౦౦

వ॥ ఇట్లు చనుదెంచి ౧౦౧

సీ॥ అతివమణిమయకేళి గృ ♦ హాంతరాళ
రమ్యశయనంబు వసియించు ♦ రమణునెదుట
నిలిచి భయకంపవిస్మయో ♦ త్కలికపులక
ముఖ్యసాత్త్వికదశలచేఁ ♦ బొలిచియపుడు ౧౦౨

సీ॥ చెలియ తద్దేహ దేహళీ ♦ సీమ జెంది
వెనుక ముందైన యడుగులఁ ♦ దనరెలజ్జ
యనెడు చెలిపెన్కఁ గొనగించి ♦ సలత(ప్రేమ
యనెడు చెలిముందరికిఁ ద్రోచు ♦ ననువ్రుఁదోప॥ ౧౦౩

వ॥ ఇవ్విధంబున విభుని ముందల నిలిచిన తత్సఖులమ్మనోహరాంగిఁ నింజూచి యిట్లనిరి. ౧౦౪

గీ॥ నేరుపరికాఁడవన్నిటఁ ♦ నృపతనూజ
బాలఁజూచినఁగడు ముద్దు ♦ రాలుగాని
ప్రౌఢతన మేమియుంగదు ♦ బుజ్జగించి
తీరఁగడఁగాఁగ మెల్లన ♦ దిద్దుకొమ్ము॥ ౧౦౫

చ॥ వెలఁతసలజ్జయై పెనఁగ ♦ నేరదుమాకని కేళిలోపలః
బలుగతులంబులంగఁ జొరఁబారదు కౌఁగిటి కానఁజేసినన్
వెలిమ్రఁదలంచి ముంగలికిఁ ♦ జీరదు శ్రీధరణీశ పుత్రమా
వలఁగలచేతలీవెరుగ ♦ వా వివరింపఁబనేమి మాకికన్॥ ౧౦౬

గీ॥ అనుచుఁబల్కి నగుచు భ ♦ ద్రాయువపుడు
ముందు ఘనసారసహిత తాం ♦ బూలములను
లలిత మణిభూషణాంబరా ♦ దుల నొసంగి
యొని వైనచ్చేడి యలనేరు ♦ పలరుషుండ॥ ౧౦౭

వ॥ అట్టులంబనిపిన॥ ౧౦౮

సీ॥ శ్రీగంధమే దెత్తు ♦ శ్రీగంధగజయాన
చంద్రంబునే దెత్తు ♦ చంద్రవదన
సుమజాలమే దెత్తు ♦ సుమనోరథావాప్తి
ఫలములే దెత్తుజం ♦ ఫలదుకోజ
సారసంబే దెత్తు ♦ సారసాంచిత పాణి
పాటలంబే దెత్తు ♦ పాటలోష్ఠి
పరిమళంబే దెత్తుఁ బరిమళోత్సవవాంఛ
సరసినే దెత్తుఁ గే ♦ సరిసుమధ్య॥

గీ॥ యనుచు నొక్కొక్కరయ్యింతి ♦ ననఁగుఁ జెలులు
కార్యమిమమునఁ గేళికా ♦ గారమెడలిఁ
చిఱునగవు నెమ్మనమ్ములఁ ♦ జెంగలింప
వచ్చిరయ్యెడ సిగ్గను ♦ వనితదక్క ౧౦౯

వ॥ అట్టియెడ॥ ౧౧౦

క॥ పతియపుడు స్థాయిభావం ♦ బతిరసమునఁ దోఁచ ♦ భావహావాదికముల్
మితిలేక మొలఁగెఁ బ్రేమన్ ♦ సతిమోహమున దృష్టినిలిపి ♦ సరభసవృత్తిన్

చ॥ చరణతలంబులెంచికర ♦ సారసముల్ బరికించి పెందొడల్
మురియుచుఁ గాంచి చిన్నసను ♦ మున్ వివరించి చెలంగుచున్న మో
మరసివచించి పేరురము ♦ సంద్రబియంబున మించియున్న భూ
వరునయనాంతముల్ మగుడ ♦ నెనులాతుణికత్వ మువ్వఁగన్

వ॥ అప్పుడు ౧౧౧

సీ॥ సమ్మోదమున్ననల ♦ సంబులై యంతలో
గ్రమ్మరవలితప ♦ కారమొంది

ప్రేమచే నార్ద్రింబులై ♦ మాటిమాటికి
ముకుళీకృతంబులై ♦ మోహమానను
క్షణమాత్రమాభీసు • ఖ్యస్ఫీతివిలసిల్లి
లజ్జాప్తిచేఁ జంచ ♦ లంబులగుచు
గడుని మేషపరాఙ్ము ♦ ఖంబులై హృదయ భా
వా కూపములనుబ ♦ యల్పడంగ

గీ॥ జేయుచూపులచేఁ బ్రియు ♦ జెంతఁ జేరి
యిందిరాసుతుపట్టంపు ♦ టేనుఁగనగఁ
నలరువిల్తుని నవమోహ ♦ నాస్త్రమనఁగ
నిలుచునయ్యింతిఁ గనుఁగొని ♦ నృపవరుండు ౧౧౩

సీ॥ ముందుగా నేనయ్యె ♦ మందలించినఁ బల్క
నలుగునో కలుగునో ♦ తెలియరాదు
సూచిత ప్రేమచేఁ జూచితినా • వెన్క
కేగునో లోఁగునో • యెఱుఁగరాదు
పేడమిమ్మనిచేరఁ ♦ బిలచిన యింతగాఁ
జేరునో మీఱునో చెప్పరాదు
పై తాపటంబుచేఁ ♦ బట్టెదనంటినా
వెగచునో పరచునో । దెరవుగాదు

గీ॥ ఏమి సేయుదు నేమందు ♦ నేయుపాయ
మేగతిని యీవిరాళిని । నెటులనోర్తు
ననుచు శిరమూచుఁ జేఁ జాచు ♦ నెనయఁ జూచు
నేరుపేర్పడ కప్పుడా ♦ నృపవరుండు ౧౧౪

ఉ॥ ఏగతి మందలింతునిపు ♦ డిందుముఖీదృఢ మానసంబునీ
లాగు గరంతు లజ్జితవి । లాసకళాకుశలాత్మనిప్పుడే

బాగుగ గూడువాఁడసుమ। బాణశరంబులఁ జిక్కి స్రుక్కినే
వేగగ లేఁటంచు మదివిశ్వవిభుండు దలంకి చింతిలెన్ ౧౧౫

వ॥ ఇట్లు చింతించి ౧౧౬

గీ॥ నేరుపునగాని కరగదీ ♦ నెలఁతమనసు
ప్రోడ తనమేరు పరచంగఁ ♦ బొసఁగదనుచుఁ
జాటుకారప్రకార వా ♦ చావిచార
మమర ధరణీధవుండిట్లు ♦ లనియెనపుడు ౧౧౭

క॥ ఓరాజీవాక్షిరోమరు। బారింబడియున్న ననుఁ గృ ♦ పారసధారా
వారిం దేలించుట కై। రారాదా యిందుముందు ♦ రాకేందుముఖీ

గీ॥ కొమ్మయీ మడుపులనుజే ♦ కొమ్మనీదు
మధుధురాధర రససుధా ♦ మధురభాష
యిమ్ము లలరంగ మణిభూష ♦ యిమ్ములిప్పు
గనికరమ్మునఁ గైకొమ్మ ♦ కనికరమున ౧౧౯

సీ॥ పలుకవే తేనియల్ ♦ జలుకంగముంగల
నబ్బునిబ్బపు గబ్బి ♦ గుబ్బలాడి
చూడవే వేడుకల్ ♦ తోడనేకూడంగఁ
జన్నారి నెమ్మోము ♦ చిన్నెలాడి
కులుకవే పాయంబు ♦ గులుకులు తళుకొత్త
మేలైన పువ్వుల ♦ మేనులాడి
తెలఁగవే చెలువమ్ము ♦ మొలకసమ్మదముల
మించుసంచులమించు ♦ మెరుఁగుబోడి

గీ॥ చాలమున మేలమేటికి ♦ వాలుగంటి
యెదుట కేతెంచ వేటికే ♦ యిందువదన

జాలిఁ జెలించనేటికే • సారసాక్షి
కేళి నేలంగ రాదెయో • కీరవాణి ౧౨౦

సీ॥ ఏకాంతమునను ని • న్నెప్పుడువీక్షింతునో
యని తల్పుకొనఁగొన్ని • దినములేఁగె
సరసరాత్రిందివ • జాగ్రదవస్థచేఁ
జరియించఁ గొన్నివా • సరములేఁగెఁ
మదనవేదనభూయ • మానమానసతనా
రంభించఁ గొన్నివా • రంబులేఁగెఁ
కుశలవాంఛితభవ • ద్గురుజనాజ్ఞప్తికై
వసియించఁ గొన్నిది • వంబులేఁగె

గీ॥ నిముసమొకపూట పూటొక్క • నెలయు నెలయు
హాయనము హాయనముగల్ప • మగుచునుండుఁ
గరుణఁ జేయుట యెప్పుడో • గారవించు
టెప్పుడోకాని తెలియదే • యిందువదన ౧౨౧

సీ॥ ఇంపుగా నగుమొగం • బెత్తికన్గొనకున్న
దొంగలరాయనినెట్లుఁ • దెగఁడువాఁడఁ
జేనెజాల్గలుగవా • తెరఁగ్రోల నీకున్న
మధువిజృంభణమెట్లు • మరచువాఁడఁ
గలికామృతములొల్కు • పలుకుఁ బల్కకయున్నఁ
గీరాదికములనెట్లు • గెలుచువాఁడ
సురతసౌఖ్యంబునఁ • జొక్కించకున్నను
దర్పకు నేనెట్లుఁ • దరుమువాఁడ

గీ॥ గబ్బి చనుగుబ్బ లొరయంగఁ • గౌఁగలింపఁ
జేయకున్నను బైవచ్చు • శీతలాని

లుని హసించఁగ నేనెట్లు • పెనఁగువాఁడ
వింతసేయంగ నేటికే • విద్రుమోష్ఠీ అ.౨౨

సీ॥ అతివరో మన్మథుం • డనుసూత్రధారుండు
తద్దేహలావణ్య • ధన్యకళలఁ
బాత్రముల్ జేసినే • పత్యాఖ్యయవనికాం
తరములోపల స్థాపి • తముగఁజేసు
నవియు బాహ్యాభ్యాంత • రావాప్తిఁ జెన్నొందఁ
గనుగొంటి గానిమి • కుక్కుటముగాఁగ
దారయులజ్జాతిర • స్కరణిలోపలనుండి
విలసిల్లు నీమనో • వృత్తినటిని

గీ॥ వెడల నీవయ్యె నీకృపా • స్వీతదృష్టి
ననుఁ గనుంగొంటి వేనిఁద • న్నాట్యవిధముఁ
జూచి సమ్మోద మొందుదో • సుందరాంగి
మనవిఁ గైకొనుమికనైనఁ • జనువుమీర ౧౨౩

వ॥ అని విప్రలంభశృంగారంబున నొక్కింత సరసవచన రచనల నెఱపి సంభోగ
శృంగారంబున గోమటించి ౧౨౪

చ॥ నడుమసియాడఁ గంకణని • నాదము లుప్పతిలన్వచాబ్జముల్
తడఁబడ ఘల్లుఘల్లని ముదంబున నందెలు మ్రోయుచుండసొం
పడరెడు మారుకేతనప • టాంచలమై తగిపైటజారన
ప్పడఁతి కరాంబుజంబొడసి • పట్టినృపాలవతంసుఁ డయ్యెడన్ ౧౨౫

వ॥ ఇవ్విధంబున బట్టినఁ గిలికించిత భావంబున సంచలించు చంచలాక్షిని హంస
తూలికాతల్పంబునంజేర్చి ౧౨౬

సీ॥ తరళాన్వితంబులై • విరళప్రవాళహా
స్తార్చితంబులు కంచు • కాంతరంబు

సీ॥ ముప్పిరిగాఁ బెన్గ • మోవిమోవిఁ గదించి
చాలువా రెడఁ తేన • గ్రోలిగ్రోలి
కళలొక్క చక్కఁగాఁ • గరగంగ నంగంబు
నేకీకృతము లుగా • నెనసి యెనసి
సమ్యక్ప్రకార ప్రదే • శముల నన్యోన్యహ
స్తాబ్జంబు లానరంగ • నదిమియదిమి
యారయ నాకీర్ణకర • మాంబుపూరంబార
నతిగాఢ రతిరయం • బాచి యాచి

గీ॥ సొలపు గిలగింత నొక్కులఁ • గలరవణము
లంటి మేనుల నొక్కుల • సదరు ముద్దు
గులుకువాక్కులఁ బలుగంట్ల • నులికిపాటు
బొమల నిక్కులఁ దగు కేళిఁ • బొలిచి రపుడు. ౧౩౩

వ॥ తదనంతరంబు ౧౩౪

చ॥ వలపుల తావి మోవిపయి • పల్మొనలందముఁ జెందగబ్బిచ
న్నులు నెలవన్నెలందగివి • నోదము మీరఁగ చంబుజార మే
న్వాలవలఁ బారఁ బోక ముడి • వీడఁగఁ గౌనసియాడ నొక్కచో
నల కలశయ్యనుండి చెలి • యల్లన లేచె విభుండుఁ జూడఁగన్ ౧౩౫

గీ॥ నరుక లొకకేల సవరించి నీవినలన
విడిన వసనంబు సవరించి • యడరుచున్న
సిగ్గుతో భయసంభ్రమ • స్థితిని బ్రియుని
వెనుకఁ జేసి తొలంగె న • వ్విద్రుమోష్ఠి ౧౩౬

వ॥ ఇట్లు తొలంగి తత్సమయోచిత కృత్యంబులు నిర్వర్తించి నిద్రాకాంతఁ జె
న్నొందె

సీ॥ సునుగప్పు కొప్పము ♦ సూన్యపునగదియంగఁ
జన్గొండ లురమున ♦ సంఘటిల్లఁ
జక్కన్ మెఱుఁగెక్కు ♦ చెక్కిచెక్కిటనుండఁ
దావిచేఁ దగుమోవి ♦ మోవిబెనఁగ
సరసకటీతటిఁ ♦ జరణాబ్జము జెలంగఁ
బాలుపొందు కరముపీ ♦ పునఁబొసంగ
నలయక తనరుమే ♦ నలనొక్కటిగఁ జేసి
రతిపారవశ్యసం ♦ రంభ మొంది

గీ॥ సుందరీమణి గూడియా ♦ సూనబాణుఁ
డనఁగఁదగినట్టి భద్రాయు ♦ వతివినోద
సమ్యగమృతాంబునిధియందు ♦ శయితుఁడైన
నీరజాక్షుఁడవలె సుఖ ♦ నిద్రఁజెందె ౧౩౮

వ॥ అట్టియెడ ౧౩౯

గీ॥ అంతకన్నమున్నె ♦ మానీరజాతాక్షి
లేచి కేళిలక్ష ♦ ణోచితముల
మఱుఁగుపడ విలాస ♦ మందిరంబెడఁబాసి
వచ్చి సిగ్గుపడిన ♦ వనితలప్పుడు ౧౪౦

గీ॥ చెలియ యీరేయి విభుఁడేమి ♦ జేసెనతని
క్లిష్టవర్తనమేరీతి ♦ నీవుసలిపి
తింతయును వచింపుమిప్పుడనీ ♦ చెంతనిరుగు
పొరలనుగాని సఖులాతి ♦ పొరమటాడె ౧౪౧

౪. అనవిని వినసట్టులనా। సన తామరసంబువంచు ♦ సనబోడినిచ
య్యనఁ గదిసిపరిరంభం। బునఁజేర్చిప్రియోక్తులొప్పఁ ♦ బొదలించితగఁ ౪౨

భూషణస్థానవి పర్యంబున నగు విభ్రమంబును, దోషాత్రుమార్గచిత్యాది సాంక ర్యంబున నొప్పు కిలికించితంబును ఇష్టకథాది సంభవ సంభావనా సూచకం బులగు మోట్టాయితంబును రతిసమ్మర్ద సుఖాధిక్యంబగు కుట్టమితంబు విలాస జనితంబగు బిబ్బోకంబు నిరంతర సౌందర్యంబున దగులలితంబు మనోజ్ఞదృష్టి చపలత్వంబుగల కుతూహలంబు భయసంభ్రమంబులందగు చకితంబు వాక్యా వివరణంబుగలవి హృతంబును విస్మృతివస్తు సంజాతంబై తోచు హాసంబు నివి మొదలగు యష్టాదశ శృంగార చేష్టలెఱుంగంజేసి స్థాయీ భావంబు పరస్ప రావలోకన సంభాషణాలింగన చుంబనాద్యనేకవిధవ్యాపారంబులుగ అలశృం గార రసంబునకు నుత్సాహంబు బుట్టించి నగుచుఁ బ్రియునివలనఁ బ్రతిదినాభ్య స్తరతిగతు లెఱింగి యుక్తాంతారత్వంబు  ౧౪౫

సీ॥ పర్వేందు ఖండప్ర ♦ భాఫాలతలమున
నునుకుంతలములు న ♦ ర్తనముసలుప
నురుచిర భాస్వన్మ ♦ కురుకపోలస్థల
ములమణితాటంక ♦ ములునటింప
విలసిత శ్రమజలం ♦ బులచేత నించుక
తోలఁగిన మౌక్తిక ♦ తిలక మలరఁ
గుచకుంభములమీఁదఁ ♦ బ్రచురంబులగు తార
హారముల్ డోలా వి ♦ హార మొంద

గీ॥ జఘనఘన మేఖలారావ ♦ చరణనూపు
రస్వరంబులు గళరవ ♦ సుస్వరములు
కంకణనినాదములు నొక్క ♦ గతిచెలంగఁ
బడతిపీ  ... నన ♦ ప్రీతిఁ గలంచె  ౧౪౬

వ॥ అట్టియెడ  ౧౪౭

సీ॥ మౌక్తికంబుల చంద్ర ♦ మండలంబుకెలంగి
విరళతారకలవ్యో ♦ మ వీథిదనరె
జంచలత్వము మాని ♦ స్మారచాపముదోఁచెఁ

గలరవంబులు మాని ♦ గలరవములు
నించుక ముకుళించె ♦ నిందీవరంబులు
కమ్మ తెమ్మెరలు ని ♦ ల్కడలఁ జెంద
నచలితస్తబకమై ♦ యలరె జంపకవల్లి
చిగుతవెన్నెల గల్గి ♦ చిగురునిగుడ

గీ॥ మెఱుపులొందిన మేఘంబు ♦ విరివిడాచె
నేమిచిత్రంబొకాని యీ ♦ భామయనుచు
సరస వచనరచనలన త ♦ రుణిగరఁగఁ
జేసిసంతోషవారిధిఁ ♦ జెందెనృపుఁడు ౧౪౮

వ॥ ఇవ్విధంబున నర్మోక్తి కర్మగర్భనర్మ స్ఫోటనర్మస్వాంజ్ఞమధురిమధురీణంబగు వచనంబులఁ బ్రతిదినంబు సమస్త సురతవిశేషంబులఁ బ్రౌఢనాయిక నొనరించ నమ్మానవతి స్వాధీనపతికాది లక్షణ లక్షితయై సరస సల్లాపహావభావ విలాస విభ్రమాదులఁ గొన్నిదినంబులు దనర్చ ౧౪౯

గీ॥ అంతక తకఁ బ్రౌఢిమ ♦ నలరికీర్తి
మాలినీకాంత కాంతుని ♦ మనసుఁగరఁగఁ
జేసిచంద్రాంగదాజ్ఞప్తి ♦ శిశిరవిలస
దుపవని చరించెఁ బ్రియునితో ♦ నుత్సహించి ౧౫౦

గీ॥ రయునితఁ కుద ♦ శార్వ దేశాధిరాజ్య
పూజ్యుఁడగువజ్రబాహుని ♦ పుత్రుఁడగుటఁ
దద్విషయమున కాధిప ♦ త్యమువహింపఁ
జేయవలెనని సంతోష ♦ చిత్తుఁడగుచు ౧౫౧

క॥ ధీరుఁడగుమంత్రి నొక్కనిఁ జేరితదర్థ్యత్నుఁడటకుఁ ♦ జేరఁనుసాయ
ప్రారంభంబొనరింపుమనఁ బూర్వమున నేగి యనిన ♦ యతఁడిట్లనుచున్ ౧౫౨

వానిఁదివ్యాకార • వంతునిగాఁజేసి
యారాజపుత్రుని • కతిముదమున
శత్రువధంబుతో • శంఖఖడ్గములిచ్చి
యొనసిద్వాదశ సహ • స్రేభబలము

గీ॥ నొసఁగి సకలార్థశాస్త్ర సం • యుక్తుఁజేసె
గానవిశేదు సమర్థుండు • ఘనవిచారుఁ
డాజవదనుని బుత్రుని • రాజధాని
కిప్పుడు దోడ్కొని పొమ్ము సుమ • హీశతిలకా ౧౬౨

క॥ అని సర్వంబువచించిన। వినివిస్మయ మందికుంది. వెనుకనుదాఁజే
సినదుర్నయమును దెగడుచు। జననాథుఁడుసమ్మదమున • సత్వరుఁడగుచున్ ౧౬౩

క॥ ఆయుగ్రభార్యతనయుని। బాయవిమోహంబుతోడ • పరిరంభముల
డాయంజేయుచు సమ్మో। దాయత్తమనంబుదోప • నధిపతియచటన్ ౧౬౪

వ॥ కొన్నిదినంబు లధివసించి తదిష్టగోష్ఠితో నుండునెడ

క॥ ఆనైషధుండుబహుబహు। మానంబొనరింపనగ్ర • మహిషినిసుతునిం ౧౬౫
నానావిధమణినికర। స్యానరథంబులనువిడుక • చయ్యనవచ్చెన్ ౧౬౬

క॥ వచ్చినిజరాజధానికి। విచ్చలవిడి యచ్చరాళి • వెరగందంగన్
సచ్చరితుఁడైనపుత్రునిఁ। జెచ్చెరసింహాసనస్థు • జేసెముదమునన్ ౧౬౭

వ॥ ఇట్లుచేసిన ౧౬౮

గీ॥ సకలజనుల సదానంద • జలధిఁదేల్చి
దేవగురువిప్ర పూజా • విధేయవృత్తిఁ
బ్రాజ్యతరపూజ్య సామ్రాజ్య • భారమూని
పరిబరి భద్రాయు విందద్రాహై • భవముదోప ౧౬౯

గీ॥ మగధదేశాధినాథుహే ♦ మరథుముందుఁ
బుత్రమిత్ర కళత్రప ♦ భూతభూతి
నొందఁజేయుచు విడచియా ♦ నందమహిమ
సకల పృథ్వీభరంబున ♦ సంభ్రమించె ౧౭౦

చ॥ శివకవచప్రభావము ప్ర ♦ సిద్ధతరర్ష భయోగిదత్తఖ
డ్గవరదరప్రతాపమున ♦ ఖండపరాక్రమ విక్రమంబుప్రా
భవముఁ జెలంగుమండఁ బరి ♦ పంథివిదారణ మాట చిత్రమా
యవిరళదానధర్మ పకఁడౌటకుఁ ♦ జోద్యమె యెన్నిభంగులన్ ౧౭౧

వ॥ అని యివ్విధంబున సకలవర్ణంబులవారు వినుతింప సామ్రాజ్య ధురంధరుండై యుండెనని సూతుండు శౌనకాది మునీంద్రులకు నీ పుణ్యకథా శ్రవణంబునఁ జతుర్విధ పురుషార్థంబులు సిద్ధించునని వివరించి యైతిహ్య పురాణంబుల వినోదంబు సలుపుచుండె. ౧౭౨

శా॥ అండేజధ్వజకాండకాండ కకటా ♦ హాప్రాంచదుద్యద్యశ
స్తండప్రక్రమ దక్షదక్షసవన ♦ ధ్వంసక్రియాహంక్రియా
ఖండప్రాభవ చిత్తచిత్తజ మహా ♦ గర్వాభ్రజంఝానిలో
ద్దండస్థైర్య విహారహారశరదు ♦ ద్యద్వారిభృద్విగ్రహా. ౧౭౩

క॥ సురధరణీధరశాసన। నరసారథితో దనత్ర్వ ♦ ణవజపక్షృద్దా
శరధి హేతకరణ ధీరత। శరధీకృత శరధిశైల ♦ శయభూమిరథీ ౧౭౪

పృథ్వీవృత్తము

నియుద్ధ సమయోద్యమ ♦ నిజభుజార్గళాస్త్రత్రుట
ద్వియత్పృథుపదాపత ♦ ద్విమతతుండ చండోత్తమా
భయాభ్రమదహాస్కరా ♦ భయకర ప్రచక్రీభవ
త్స్వయోదయశరాసనా ♦ తతసమూర్జితైకోత్సవా॥ ౧౭౫

సీ॥ ఇది శ్రీ వేములవాడ పట్టణనివా • సేశానసంప్రాప్త శ
క్త్యుదయప్రాభవ కామినేనికుల రా • జారెడ్డి దేశాయిస
మ్మదలక్ష్మీపతి పండితోదితను • ధీమందార భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమురుచిం • పున్పంచమోల్లాసమై ౧౭౬



ఇది శ్రీ సద్రామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణాకటాక్షేక్షణ ప్రసాద
ప్రాప్తోభయ భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుళ్ల గోత్రపాత్ర
కామినేని వంశపయః పారావార రాకాసుధాకర రాజన్న
దేశాయి సార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వాణ కవిత్వ
చాతుర్యధుర్య పరాశరగోత్ర రావాకలింగ
నార్యపుత్ర లక్ష్మీపతి ప్రణీతంబైన
భద్రాయు రభ్యుదయంబు
నందు సర్గము
పంచమోల్లాసము

